


శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు



విద్యాపోషకుఁడు,

దేశోద్ధారకుఁడు, విశ్వదాత,

శ్రీ శ్రీ శ్రీ

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి

అమృతాత్మకు సమర్పితము.



# FOREWORD

### (*FIRST EDITION*)

---

"*Vidyarthaprakasika*" is a series of essays on the aims and methods of education according to the cultural ideas of ***Hindu Dharma***. The author of these essays, by apt historical illustrations and quotations of striking passages and sayings from our ancient literature, brings out the central theme of our scriptures, enlightenment of the individual and service to society, as the fundamental basis of human action and endeavour. In spite of apparent dissimilarity between the Greek and the Hindu ideals, there is much that is in common between the two civilisations—co-ordination of the various activities of man to the central idea of ***Dharma*** as enjoined by the Hindu Scriptures and ***Smriti*** Writers, and the Greek ideal of the good life and harmoneous development with the difference that the spiritual basis is lacking in the Greek ideal. The author, while a stern critic of certain evils in our present day educational system, is by no means a pessimist. He has a clear vision of a 'new India pulsating with fresh life and vigour and is not unwilling to recognise that Western contact may give a new orientation to our own culture without in any way destroying its roots or impairing its vitality. The Andhra University has done well in prescribing "*Vidyarthaprakasika*" as the text-book for the University course.

ALLADI KRISHNASWAMY,

ADVOCATE-GENERAL,

The High Court of Madras.

# INTRODUCTION

(*FIRST EDITION*)

---

Few words are needed to introduce this "*Vidyarthaprakasika*" of Mr. Jonnalagadda Satyanarayana Moorti, M. A., B. L., B. T. P., (Hon. Fellow) Sahitya Bhushana, to the discerning Telugu reader for, this talented young Andhra author has long been familiar to the readers of the Telugu Magazines as a prolific writer attempting new sallies of style, treatment and outlook in Telugu prose, critical, descriptive and imaginative, after the manner of the foremost of European Essayists. I have been reading his new ventures in this line in the *Bharati* for some years with great hope that he will turn out to be one of the pioneers of modern Telugu prose in fields untouched by the elder masters like the late Rao Bahadur Viresalingam Pantulu, justly called Gadya Tikkanna. Much as such an introduction is superfluous, I have taken real delight in contributing this slight commentation as an humble yet hearty blessing from an elder worker in the literary vineyard. May his work prosper day by day and may his ambitions for Telugu prose be realised and consecrated.

The collection of Essays, now, herein published in book form under the appropriate title *Vidyarthaprakasika* are of such a type of serious reading that no one may

pretend to read them as he runs. It is therefore proper that some Universities have prescribed them for serious detailed study: for, a very close and detailed and critical study alone, on the lines of English prose criticism, can clearly bring out all the admirable features of outlook, treatment and organisation of material and varieties of prose that the author has daringly attempted in them after European models.

However, these essays form neither a systematic treatise on the history and methods of Education, nor a critical exposition of the educative process as such set out as a regular Philosophy of Ednecation. What they are may be stated to be "Considerations of matters Educational," seeking from a really philosiphical and fundamentally spiritual point ot view to synthesise educational ideas and ideals Eastern and Western, evaluate the aspirations and achievements of the so called educated men and women of modern India, even the varying tendencies of their life-drift so far as they are affected by such ideals and aspirations. I am delighted to find that he brings into play all his knowledge and appreciation of Indian philosophical thought in its theoretical and practical, *Yogic*, aspects to bear on this interpretation of educational efforts, ideas, ideals, achievements and even failures in the ancient and modern world and I commend this to the notice of the discerning reader as the author's special contribution o critical method followed in these expositions of "matter educational". The essay called "*Paramjyoti*" is mos

significant as an illustration of such *critical method.* Very few contributions to Educational history or methodology and psychology have yet pursued the subject above the physical, mental or intellectual planes into the realm of the "Soul" or "Personality" struggling to disengage itself from or obscured by *Prakritic limitations* of body and mind. For the first time in recent years I believe this earnest truth-seeker has dared to follow it up into this new and entrancing region and I trust all earnest teachers would be very grateful to him for all time for this great service of setting out the educational process once again as a joint spiritual *Yogic* endeavour of teacher and pupil operating as a living day to day consecration. It is no more a "*noble profession*" or "*a sorry trade*" but an ever evolving practice of *Brahma Vidya.* This is the secret of *Vidyartha* and these essays rightly serve as its "illuminator."

Those that are disposed to delight in the beauties and nuances of a tesselated literary style familier to them in the works of masters of English prose may contemplate and follow out passages like (i) అనంతసౌందర్యమున...(97) (ii) ముద్దుకృష్ణుని తొట్టె చుట్టు... (146 47) (iii) హిమగిరి శిఖరము నుండి యెగసి...(160-62) or (i) భారతప్రకృతికి అనుకూలమైన...(74) (ii)"ఇక సత్వగుణ సంపన్నుని...(54).

The passage "ఉన్న విద్యాధికులము సప్పుడుమండిమి తేను... (51) gives us the realisation which has sent the author on a

great quest the results of which are elaborated in these bracing and thought provoking essays.

B. SESHAGIRI RAO,
M, A., Ph. D.

*Membre de Honneur, Societie Academique,*
*d' Historie Internationale,*
*Chevalier and Baron (O. C. E.) Grand Prix*
*Humanitarie,*
*Commandeur, l' Order le Sang Francais.*
*Grand Commandeur Order de St. Lazarie,*
*Pradhanisekhara (Bharatitirtha).*
*Professor, Maharajah's College, Vizianagaram.*

# తొలిపలుకు

(ప్రథమ ముద్రణము)

శ్రీయుత జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి పంతులు ఎమ్. ఏ., బి. ఎల్. గారు స్వీయవిరచిత "విద్యార్థి ప్రకాశిక" యను పొత్తమును సాదరముగా నా కొసంగి నా యాశయమును దెలుపవలె నని కోరుటవలన నేను దానిని వందనపూర్వకముగాఁ గైకొని సమయాభావమువలనఁ గొన్ని కొన్ని భాగములనుమాత్రము చదువఁగలిగితిని. అది యెనిమిది ప్రకరణములుగా విభజింపఁబడియున్నది. అందలిభావములుత్కృష్టములును సంచింత్యములును; శైలి మధురమును సుఖబోధమును. దాని నాంధ్రు లందఱును—ముఖ్యముగాఁ బాశ్చాత్యనాగరకతావ్యామోహాయుక్తులు చదువవలె నని కోరువాఁడను. దానిని బాఠ్యపుస్తకముగా నాంధ్రవిశ్వవిద్యాలయము నిర్ణయించుట కడు సమంజసము. మద్రాసు విశ్వవిద్యాలయముగూడ నప్పొత్తమును బాఠ్యపుస్తకముగా నిర్ణయించు నని నమ్మువాఁడను.

ఇట్లు,

మకాము—మద్రాసు<br>౧౫-౮-౩౮

శ్రీ విక్రమదేవ వర్మ.

# పీఠిక

( ప్రథమ ముద్రణము )

## విద్యార్థప్రకాశిక

అనెడి యీవచనరచనను రచియించిన శ్రీయుతులు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎమ్.ఏ., బియల్ గారిని నేను విశేషముగ భారతీపత్రికయందలి వీరి వ్యాసముల ద్వారమున నెఱుఁగుదును. వీరివ్యాసములు పూర్వకవులనుబట్టి కాని నవీనకవులనుబట్టి కాని పోల్చి చూచిన నెవరి రచనను గూడఁ బోలవు. భారతములో శ్రీనన్నయభట్టుగా రొకట-

"పీని చాన వేఱు"

అని వ్రాసినారు. సర్వవిధముల నవ్వాక్యమునకు నీయన రచన ప్రథమోదాహరణముగా నుండును. ఒక్కొక్క విషయమునుగూర్చి యీయన వందలకొలఁది పుటలు మిక్కిలి యపూర్వము లైన యభిప్రాయములతో సహృదయరంజకముగా వ్రాయుటను జూచి నేను మిక్కిలి యక్కజపడుచుందును. నేనుగూడ "నుప్పు లేనిది ముప్పందుము" అను తెలుఁగున నే వెఱ్ఱిమొఱ్ఱిరచననో నడపుతరగతిలోనివాఁడనే కాని యీయన వ్రాసిన విషయములను గూర్చి వ్రాయవలసి వచ్చుచో, నే కొంచెమునుగూడ వ్రాయఁజాలనని యే హృదయపూర్వకముగాఁ జెప్పుదును. ఈయన రచనలను గూర్చి సవిమర్శముగా నుపోద్ఘాతము వ్రాయవలసివచ్చుచో, హూణభాషాకవుల యభిప్రాయములను జక్కఁగా నర్థము

# CONTENTS



CONTENTS

కన్పట్టుచునేయుండును. ఆహేతువుచేతనే యనుకొందును-దండి బాణప్రభృతి మహాకవులు విశేషించి గద్యములయందే తమతమ యభిప్రాయములను బ్రకటింపఁజొచ్చిరి. జనసామాన్యమునందు గద్యరచయితలకుఁ గవిగణమునందు స్థానము లేశమును గనుపట్టదు. కాని రసప్రధానమైనదే కవనమనియెడి విశేషజ్ఞులు గద్యకవులకు వారివారి రచనలనుబట్టి తగిన స్థానము నిచ్చితీరుదురు. ప్రస్తుత మీ జొన్నలగడ్డవారు కూడఁ బైతరగతికిఁ జేరువారే యని నేను స్థూలదృష్టిపరిశీలనమీఁద వ్రాయ సాహసింతును. ఎంతో విపులముగా నేను టీకను వ్రాయఁగలనని గ్రంథకర్తగా రనుకొనియుందురు. గ్రంథకర్తకన్న నా కుండెడిశ్రద్ధ మిక్కిలి తక్కువది యగుటచే వారి మనోరథపూర్తి కొఱవడినది. కాని వారి గ్రంథలోపము కాదు. ఇది సత్యమని చదువరులు నమ్మవలయు నని నేను గోరుదును. వీరి రచనలో భాషకన్న భావములకే యెక్కుడుగా నేను ప్రాధాన్య మిత్తును. "లోకో భిన్నరుచిః". ఇంత కన్న నధికము వ్రాయనేరని నన్ను గ్రంథకర్తయును, జదువరులును మన్నింతురుగాక!

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,

శతావధాని.

# నా మా ట

## (ప్ర థ మ ము ద్ర ణ ము)

మానవుని సర్వతోముఖాభివృద్ధికి సక్కనైనది విద్య; భారతపునరుద్ధరణమునకై నేఁ డనివార్యమైనది విద్య; జగతికి పచ్చతోరణమును గట్టునది విద్య; మనుష్యాత్మను కౌస్తుభముచే నలంకరించునదియు విద్యయే!

దీనిని దృష్టిఁగొని తెలుచుగ బహుళపత్రికలందు నేఁ బ్రకటించుచుండు వ్యాసములలోఁ గొన్నింటినిమాత్రము కవిమిత్రుల ప్రోత్సాహము నందఁజేసికొని, గ్రంథస్థము గావించితిని. తక్కుంగలవానిని పాఠకలోకమునకు పదపడి యర్పింతును.

విషయము గభీరసింధువున కెనయైనది. అశ్రాంతము నిందుండి భావవీచిక లుదయించుచునే యుండును. జిజ్ఞాసువుల సాదరదృష్టి చంద్రికావృష్టియై వీనిని సోఁకుచో, నివి యుత్తాలతరంగము లగును; విద్యార్ణవమున జనించు కల్యాణరమ మానవులను బ్రోచు మోక్షలక్ష్మి యగును.

నా యాశయములపై శుభాక్షతలు చల్లి, ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు విశేషముగ విద్యార్థులకై నిర్దేశింపఁబడిన ఈపొత్తమును పాఠ్యగ్రంథముఁ గావించిరి. పండితవరేణ్యులు, సాహిత్యసమ్రాట్టులు, జయపురసార్వభౌములు శ్రీశ్రీశ్రీ

విక్రమదేవవర్మ మహారాజులుంగారును, మహాకవులు, శతావధానులు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారును, సుప్రసిద్ధసారస్వతోపాసకులు, సహృదయులు డాక్టర్ బి. శేషగిరిరావుపంతులుగారును, న్యాయవాదులలో తలమానికమై, న్యాయశాస్త్రముతోపాటు వివిధవిజ్ఞానాంశములను మనసునఁ జేరవేసికొని స్నాతకమహోత్సవములయందును, వివిధసభాంగణములయందును విద్యాశయములను గుఱించి గంభీరోపన్యాసము లొసఁగుచు, నీ యాశయఫలసిద్ధికై విశ్వవిద్యాలయములకు బహుభంగులఁ దోడ్పడుచు యశస్తిలకుఁడైన సర్. అల్లాడి కృష్ణస్వామిగారును దీనికి తొలిపలుకులు వ్రాసిరి. విద్యాశయములకై పాటుపడు ప్రసిద్ధదేశోద్ధారకుఁడు, విశ్వదాత, నాగేశ్వరరావుపంతులుగారు దీనిం గృతినందిరి. "గృహలక్ష్మి" పవిత్రాంగణమున నాకు మిగులఁ గూర్చు మిత్రపుంగవులైన విశాలహృదయులు శ్రీ కేసరిగారు దీని ముద్రణభారమును వహించి నాకుఁ జేయూఁత నొసఁగిరి. ఈ మాననీయులందఱకును మనఃపూర్వకమైన వందనము లాచరించుచున్నాను. సకాలమున గ్రంథమును విద్యార్థులచేతులఁ బెట్టుటలో నాకు మిగులఁ దోడ్పడిన మిత్రులు శ్రీ ఎస్. శేషగిరిరావుగారికిని, శ్రీ చదువుల రామచంద్రయ్యగారికిని గృతజ్ఞుఁడను.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

# సమీక్ష

మ. పరమేష్ఠిప్రణయైకవిశ్వభువన ప్రాసాదసృష్టిన్, దరం
తరసౌందర్యసుధాపయోధినిజమేధామందరాద్రిన్ మథిం
చి రసోదారమతిన్ గ్రంథులకుఁ బ్రాచీనార్యసాహిత్యత
త్త్వరహస్యామృతభాండమిచ్చిన సుధీంద్రా! నీకు బ్రహ్మాయువౌ.

చ. విమలశరన్నదీపులినవీథుల తాల్గగించు నిండుపు
న్నమ మునిమాపునన్ కుసుమవనమ్ముల కమ్మనితావులన్ దరం
గములఁ బెనంగి వీచు ననుగాలిసుఖమ్మనకంటె నీదుభా
వమున సుఖమ్ము శాశ్వతమవాఙ్మనసమ్ముగదోయి మిత్రమా!

ఉ. తూరుపుటింటికిం గొని సులపషల్ మును దాఁచినజ్ఞానరత్నభాం
డారము ఖండఖండము - నాఁచికొనన్ మన ఆఁగ్లసంస్క్రియా
దారతలా ప్రతీచిది చెదారముసైన పదాలువన్నెబం
గారమటంచు రే తమ అగారము గానరిదేమి కర్మమో!

" శ్లో. యా దుగ్ధాపి, నదుగ్ధేవ కవిదోగ్ధృభిరన్వహమ్,
హృది నస్సన్నిధత్తాం సా సూక్తిధేను స్సరస్వతీ "

"విద్యార్థప్రకాశిక" :—ఇది విద్యవలని పరమార్థము నుపదేశించు మహోపన్యాస గ్రంథము. బ్రహ్మశ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి M. A, B. L గారి విజ్ఞాన రత్నాకరమునుండి వెలువడిన జీవరత్నము. ప్రతిభా శాణమున సానలుదీర్చి, కవి, ఈ రత్నమున కెనిమిదకోణము లేర్పరించినాఁడు. అవియే ఉపన్యాసములు. వాని శీర్షికలు, ఉపక్రమణము, అనుక్రమణవిన్యాసము, ఉపసంహారము—అన్నియు సార్థకములై, సాత్త్వికభావ జీవకాంతి సంపన్న

ములై, కవియుద్దేశమును సఫలీకరించుచున్నవి. ప్రథమో
న్యాసము. (1) "తమోదీపిక." కవి, ఈదీపికతో విశ్వప్ర
సారస్వత మార్గమున (2) "విజ్ఞానయాత్ర" సాగించినా
పిమ్మట, యాత్రానుభవమునఁ దన ఆర్షదృష్టికి గోచరిం
(3) "ప్రాచీనాశయముల"ను సమీచీనముగఁ బ్రతిపాదిం
నాఁడు. తరువాత వాని నలవరించుటకై (4) "క్రతువు"
నుద్బోధించినాఁడు. వెంటనే, తదనుష్ఠానమునకై ప్రణవా
కంబును, శివాధిదైవతంబు నగు పంచాక్షరీమంత్రరాజము
(5) "ఓం నమశ్శివాయ" మాతృస్వరూపమున నుపదేశిం
నాఁడు. అనంతరము హృదయ వీణాతంత్రుల మేళవిం
"మాణిక్యవీణా ముపలాలయంతీం మదాలసాం మంజులవా
లాసామ్" అని (6) "కల్యాణగీతిక" నాలపించి సారస్వతశ
నావేశింపఁ జేసినాఁడు. పదంపడి, హృదయకమల కర్ణికాపీ
మున సాక్షాత్కరించిన ఆ (7) "పరంజ్యోతి" స్స్వరూపిణి
చే, ఆ పరశక్తిచే, ఆతల్లి సరస్వతిచే, అమృతకలాసమ
న్మేషితములగు (8) "సుభాషితోపన్యాసము" లిప్పించి, అసా
భూతమగు సంసారమును ఆనందతరంగితముగా మార్చివే
నాఁడు. సాధు!! సత్యనారాయణమూర్తీ! ధన్యుఁడవోయి
సారస్వతకలా సౌధమున కచ్చుగట్టిన సోపానములే నీ యుప
న్యాసములు. అస్ఖలితాభ్యాసమున వీని నధిగమించిన జిజ్ఞా
సువులు, పరమహంసలై, బ్రహ్మానంద సరస్తరంగముల
నుయ్యాల లూఁగకుందురా? ఓహో! ఇదిగదా కావ్యకలా
పరిణామము!

ఈ గ్రంథము పరిమాణమున అలంతియేకాని, కళా సౌభాగ్యమునఁ గడుంగడువలంతి. “ఇంతింతై, వటుఁ డింతయై, మఱియుఁ దా నింతై” అనునట్లు వామనమూర్తివలె క్రమపరిణామమున విశ్వరూపము దాల్చి, ఉత్కృష్ట మానవజీవితమునకు ఉపకరించు విజ్ఞానప్రపంచసన్నివేశ మంతయు నావరించినది. పొత్తము, ఆలంకారికమతమునఁ గావ్యము గాకున్నను, గద్యములోని ప్రతిపదంబునను, లలితకవితాకళలు దాఁగుడుమూఁత లాడుచుండుటచే, కావ్యమువలన, సముత్పాద్యమగు అవ్యయానందము నందించుచునేయున్నది. జీవకళంగులికించి, చికిలియొనర్చినభాష పరిపుష్టమగు సాహిత్యసన్నివేశము, పద్యమైననేమి, గద్యమైననేమి ? చూడుఁడు మచ్చునకు:.

“భక్తులపైఁ బడినదెబ్బ, భగవంతునకుఁ దగిలినట్లు, మాతృభాషలకును, సంస్కృతమునకును దగిలినదెబ్బ. భారతీయజాతీయత్వమునకుఁ దగిలినది” :— ఈ వాక్యము, ఆంగ్లవిద్యకతమున మనకుఁ గలిగినలాభనష్టములంగూర్చి విరియఁ జిమ్మిన కమ్మనిపూలగుత్తి. ఉపమ ఎంతసొంపైనదో ఊహింపుఁడు-ఇందలి ఆధ్యాత్మిక సత్యసౌరభమునకు జోహారు-మన మతము, జాతి, నీతి, కల, ఇది అది యననేల యావద్భారతకమం దిమిడియున్నదికాదా ?

“భారతీకవిహృదయము దివ్యబృందావన మని పలుమాఱు వ్రాశాను నేందును. భారతీ కవిరచనమును పరిశీలించుతఱి నందు నందనశోభను మాఱుము; కల్పకముతో కామధేను వందు కానంబడును. అమృతకలశముతో మధురసౌరభము సహకరించుట గాంతుము. నేఁటి మనుష్యసంఘమున

చెలరేఁగు బడబానలము నార్పఁజాలు ద్రవకణము లీయమృతకలశములోనివే! నేఁటి విషవాయువులను దఱుమున దీమధురసౌరభమే! కళకతన, విజ్ఞానముక తన వ్యక్తిగతముక్తియే కాక సర్వమానవముక్తి కూడ సాధ్య మని నేను వాదింతును. వీనికతన భ్రాతృత్వసౌహార్ద్యభావములు తలసూపు నని కంఠ మెత్తి వచింతును. నేటిసభ్యజగతియందు బుసగొట్టుక్రౌర్యమును లాంగఁదీసి, చిత్తము వచ్చినరీతిని దాని నాడించి, దానిఫణముననుండి ప్రసరించు చారు మాణిక్యదీప్తులందు అద్భుతభావసృష్టిఁ జూపి ప్రపంచము నానందమయ మొనరింపఁ జాలువాఁడు మాధుర్యసౌందర్యసౌరభముల నాత్మహృదిఁ బెం పొందించువ్యక్తి యనినొక్కి వక్కాణింతును. పృథుకవీంద్రుఁడు రవీంద్రుఁ డిట్టివ్యక్తియేకదా! గంధబంధురమైన ఈతనికవితను కాంచినంతన, ఈతని ప్రఫుల్లహృదయము దివ్యసౌందర్యనిలయ మనిగుర్తింతును. సౌందర్యసంశో భితహృదయమే శాంతినికేతన మైనది.”

పైవాక్యపరంపర మనము తరతరంబులు పఠింపఁదగినవి కావా?

“అన్ని మతములు, అన్ని జాతులు గుండగొట్టఁబడి ఒక్కటే యుండ మై, తోఁచినగాని యైక్యభావము విరాజిల్లనేర దని మనతల్లి యెన్నఁడును తలఁచియుండలేదు. వివిధరుచులను, వివిధ ప్రకృతులను, వివిధ శక్తులను తెగఁ గొట్టుట సాధ్యము కా దని యెఱిఁగి, పెక్కుమణులం దొక్క కెంపుదార మును జొనిపి చక్కనిమాల్యము గ్రుచ్చునట్లు వ్యత్యాసములందు ప్రేమ సూత్రమును చొప్పించి అపూర్వదామముచే నాత్మగళము నలంకరించుకొని, దిక్కామినులకు మిఱుమిట్లుగొలిపిన లోకమాత భారతమాత. **Unity in difference** అనువాక్కు వివిధరాగములతో నొక్కండై రాజిలు నింద్ర ధనువువలె నొప్పి నది మనసీమ యందే! జగదీశుని తోఁటయందలి మల్లె పూవులవలె గగనతలమునఁ గాంతిలు పెక్కుచుక్కనెచ్చెలు లొక్క నిస్తబ్ధ గీతికచే తమవనమాలికీనుదోయికి విందు సేయులీల, పెక్కు జాతులు మాననేల యందు వెలిలి ఏకగ్రీవముగ జాతీయగీతిక నాలపించినవి, పెక్కు మతములు మధురమంజుల ప్రణయగీతిక నాలపించినవి.

పై ముచ్చటింపులో, మూర్తిగారి విశ్వమానవసౌదర్య మెట్టి మాధుర్యమును వెదచల్లుచున్నదో విశాలహృదయులే ఎఱుంగుదురు.

ఇవిగాక మనజీవితసమస్య లెన్నో చర్చింపఁబడినవి. తూర్పు పడమరలు వానివానిసభ్యతలు సంప్రదాయము లెన్నో ఉపన్యసింపఁబడినవి. గ్రంథము నామూలాగ్రము ప్రత్యక్షరము శ్రద్ధాళువులై, పలుమాఱు పఠింపవలయునే కాని, మచ్చుముక్కలతోఁ దెలియఁదగినది కాదు. చిన్ని కాగితపుముక్కపై, గోటిగీఁతతో చిత్రించిన చంద్రమండలమును జూచి అమృతమునకై అఱ్ఱులుసాఁచిన ప్రయోజనమేమి ?

సత్యనారాయణమూర్తిగారు సహజముగ సరళహృదయులు - సరసకలోపాసకులు - ఆఙ్గ్లవాఙ్మయశిఖాగ్రములగు డిగ్రీలతోనే విశ్వము మఱచినవాఁడు కాఁడు. మాతృస్తన్యపూరమున మస్తిగొన్న మహనీయుఁడు కాని పోఁతపాలగుటకలతో గిటకవాఱినసీరసుఁడు గాఁడు. పాళీ, బంగాళాది ప్రాచ్యభాషలలో నుత్తమ పరీక్షలం దుత్తీర్ణుఁడైన ప్రజ్ఞాశాలి. ఇరుగు పొరుగులలోని మెఱుఁగుతఱుఁగు లెఱింగిన మేటి నిశితమగు ప్రతిభ, నిరాఘాటమగు యోచన, నిర్వికల్పమగు సంకల్పము, నిమ్నత యెఱుంగని భావనాపటిమ, నిరర్గళమగు భాష- ఒక దానివెంట నొకటి, "తన వెంటఁ సిరి, లచ్చివెంట నవరోధ వ్రాతముఁ దానివెంతను పక్షీంద్రుఁడు" అనునట్లు పరు

వర్తింపఁగల సమర్థుఁడు. తాను నమ్మిన సంప్రదాయమును, కవిణగొట్టి చాటించుటలో జంకుకొంకు లెఱుంగఁడు. తన ఆత్మవిశ్వాసమును చదువరుల కొక్కమాఱుగ నూటిపోత మన్న రసావేశముతోఁ గలము పరువెత్తుచుండును. అడ్డు లేదు. అవధి లేనే లేదు. లెక్కకు మించిన ప్రమాణపరంపర లొక్కుమ్మడి గుప్పుచుండును. గుట్టపుచదువువారి కిది కొంత విసుఁగుగా నుండునేమో కాని, ప్రాజ్ఞుల కీఫక్కి పాయసాహా రము. ఏమైనను వీరి వ్రాఁతలయందొకానొక నూతనత్వ మున్నది. ఎట్టినార్యునిసూక్తివైచిత్రియో యేమో వేరున కేమి గాని, వానియందు సాత్త్వికసౌరభము గుబాళించు ననుట వాస్తవము. వేయేల? పేరునకుం దగినట్లే సత్యనారాయణ మూర్తి ఋషితుల్యుఁడు. కావుననే ఇట్టి సముజ్వలసారస్వత మును సృష్టింపఁగలిగినాఁడు. "నానృషిఃకురుతే కావ్యమ్" అని ఊరక చెప్పిరా?

కవియైపుట్టునుగాని, పుట్టియెవ్వఁడును కవి కానేరఁడు. కవిత్వమునకు ఆస్తిక్య మాలంబనము. ఆస్తికునకుఁగాని, ప్రామాణికబుద్ధి యేర్పడదు. ప్రామాణికబుద్ధివలన జిజ్ఞాస, జిజ్ఞాసవలన తత్త్వాన్వేషణ పరత్వము, దానిచేభావనాశక్తి ఉద్దీ పించును. అందుండి అంతర్ముఖత్వము, పరోక్షువస్తువునంద పరోక్షానుభూతి, రసావేశము, ఉజ్జ్వలితము లగును. వెంటనే వాగ్దేవి ప్రసన్నయై, కవిహృదయకవాటమును దెఱచికొని, ...వేదిక నలంకరించి, అలౌకికానందాత్మకమగు కావ్య ను తానే నిర్మించును. ఈ నిర్మాణమున, కవి నిమి ... కావ్యపాత్రములలో లీనుఁడై యుండును.

"పలికెడిది భాగవతమఁట!
పలికించెడువాఁడు రామభద్రుండఁట!"

అను పోతనకవీంద్రునిపద్య మీ అనుభవమునే చాటుచున్నది. ఈ పలికించెడిది రామభద్రుం డనుడు లేక ఏ Intuition or Emotion నో అనుఁడు. ఏదేనొక దివ్యశక్తి యని అంగీకరింపక తప్పదు. ఈ శక్తి జన్మాంతరసంస్కార మున ఎవ్వనికోగాని లభింపదు.

"శ్లో. నరత్వం దుర్లభం లోకే, విద్యా తత్ర సుదుర్లభాం
కవిత్వం దుర్లభం తత్ర శక్తిస్తత్ర సుదుర్లభా."

ఈ శక్తిచేతనే కవి, యేయుగాంతరముననో, భౌతిక శరీరముల విడిచినవ్యక్తులను, మరల బ్రతికించి, చిరంజీవులఁ గావించి తనకావ్యప్రపంచమున నాడించుచున్నాఁడు. ఈ గన మయ ప్రపంచపాత్రములలోఁ గలసిమెలసి, పాఠకులు జీవిత పరమాదర్శమగు సత్యసౌందర్యము ననుభవించుచున్నారు. కవితాసంస్కారబీజముగల కవి తనలో దాఁగియున్న ఈ శక్తిని విజృంభింపఁ జేయఁజాలుటకు ఆస్తికతయె ఆలంబ మని పూర్వకవిపుంగవుల వ్రాఁతలవలనఁ దెలియుచున్నది. నాస్తికు నకు, సంశయాత్మునకు, ప్రామాణికబుద్ధియే కాదు, సర్వము శూన్యమే. గీత చెప్పనేచెప్పెఁగదా.

శ్లో. "అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి,
నాయం లోకోఽస్తి నపరో నసుఖం సంశయాత్మనః."

అని. ఇట్టి మిథ్యావాదిని శరునిఁ గవితాకాంత వరిం పదు. ప్రేమింపనైనుంగని శూన్యహృదయునితోఁ గవితా

కాంతగా ఏకాంతయు మనసిచ్చి మాటాడదు. ప్రేమార్ద్రమైన హృదయక్షేత్రమందే కలాంకురములు మోసులెత్తును. గురుశుశ్రూష, సజ్జనసాంగత్యము మున్నగు సంస్కారములచే ఈ యంకురములేచి పూచికాచి ఆనందామృత ఫలము లందించును. ఈ అమృతఫల రసాయనమే జాతికి జీవనము.

వాక్కుచే నర్థము అర్థముచే వాక్కువలెనే సంగీతముచే సాహిత్యము సాహిత్యముచే సంగీతము పరస్పరాశ్రయమున ప్రతిభాసించును. వీని ద్వైధీభావముకంటె అద్వైతభావమే అవ్యయానందమునకు ఆలంబనము. పరశక్తితోఁగూడిన పరశివతత్త్వమే సంగీతసాహిత్య స్వరూపము. ఇదియే సత్యము శివము సుందరము. సహజసాత్త్విక ప్రవృత్తిగల కళోపాసకుఁడీ సౌందర్యానందలహరియందు సుస్నాతుఁడగును. తత్క్షణమే, సారస్వతశక్తి సాక్షాత్కరించి, "త్వమేవాహం త్వమేవాహం త్వమేవాహం నసంశయః" అని కవికుమారుని తన అక్కునఁజేర్చికొని, వానికిఁ గలాసామ్రాజ్యపట్టము గట్టిపెట్టును. అట్టివాఁడే కలాప్రపూర్ణుఁడు- కవిసమ్రాట్టు. వానికావ్యమే ఆదర్శము. అనుశాసనము.

ప్రేమ త్యాగము దయ దాక్షిణ్యము నెఱుంగని తమఃప్రవృత్తికి తత్త్వోపదేశమంతయు నాకాశ పంచాంగము. వానికి సాత్త్వికవాసనయే గిట్టదు. సాహితీసంసారము వానికి సహారాయెడారి. లలితము సుందరము మధురము నగు భావావేశము వాని కేకోశమందైన జనింపదు. గండ

శిలనైనఁ గరఁగించి, త్రాచుపామునైన తల యూఁచు మధురామృతగానమే వానికిఁ జీదరింపు- తలనొప్పి. రసవిషయమేదియు వాని రంజింపనేరదు. చందమామవెన్నెలకుఁ జంద్రశిలలే కాని చాపఱాలు పులకించునా? ఇట్టి కసాయిపాలంబడిన కలాసరస్వతికి డెస్డిమోనా (Desdemona) గతియే సంప్రాప్తమగును. అంతశ్శుద్ధి, ఆర్ద్రమానసము లేని అసూయాదూషితుఁ డాఱుశాస్త్రములు నొక్కమాఱు కల్వమునవైచి, రసప్రకరణముతో రంగరించి, "ఔషధం జాహ్నవీతోయం వైద్యో నారాయణో హరిః" అని, గుటుక్కున మింగి త్రేఁచినను, ఆనందాత్మికయగు కలాసరస్వతి కైవసము గాదు. భావము ననుసరించి, భాష తానే ప్రసరించును; కావుననే కావ్యమునుబట్టి, కవిమనస్తత్త్వమును గుర్తింపనగు నని తాత్త్వికుల సిద్ధాంతము. వ్రాఁతంబట్టియే వ్రాయసకాని చేతస్స్వభావమును గనిపట్టవచ్చునఁట! భావావేశము లేని, బలాత్కారపుఁగవిపద్యముగాని వాక్యముగాని, వాని మనస్తత్త్వమునకుఁ దగినట్లే, వక్రమై, కర్కశమై, నీరసముగా నుండును. వానిరచనయందు పదములన్నియు అస్థానంబునం బడి, ఒకదాని కొకటి ఎడమొగము పెడమొగమై, "ఈతఁడు మైత్రీమాధుర్య మెఱుంగఁడు" అనుటకుఁ దార్కాణగా నుండును. ఇఁకఁ బద్యములోని పదములకన్నిటికిని అర్థము తెలియుచున్నను, పిండితార్థము సమన్వయమునకు రాక, పాఠకులఁ బీడించును. ఆపదములే, సరసుఁడు సరళోదారహృదయుఁడగు కవినోటంబడి ధన్యము లగును. తాత్త్వికు లిట్లే చెప్పిరి:

శ్లో. "యానేవ శబ్దాన్ వయమాలపామః, యానేవ చార్థాన్ వయముల్లిఖామః।
తైరేవ విన్యాసవిలాసభవ్యైః, సమ్మోహయంతే కవయో జగంతి."

"నిండుమనంబు నవ్యనవనీతసమాన" మైనప్పుడే జీవిత మానందమయమగును. అట్టి ఆనందమయుఁడే కవిబ్రహ్మ. అతఁడే ఉత్కృష్టజాతిని సృష్టింపఁగలఁడు.

కళలు:— ఆధ్యాత్మికములు- ఆనందపరిణామములు. అందుత్తమకావ్యకళ-దీనియందే జాతీయజీవన మాధారపడి యున్నది. "ప్రకృతిప్రతిబింబమే కవిత్వము" అని ఆధునికులు కొందఱు నిర్వచనముచేయుచున్నారు. ప్రకృతిబాహ్యస్వరూపమును యథాతథముగ ననుకరించినమాత్రమునఁ గావ్యకళ సంపూర్ణమగునా? కవి, ప్రకృతిలోఁ బ్రకృతియు, అంతకంటెను బరుఁడును గావలదా? కాకున్న, ఈ అనుకరణకళ మానవసంఘమున కొకపాటి వినోదమునకే అక్కఱకు వచ్చునేమోకాని, ఆనందపరిణామము గాదు. ఆ వినోదమైనను క్షణభంగురమే. దేశకాలవ్యవస్థలంబట్టి, అభిరుచులు, ఆచారములును మాఱుచుండుట ప్రకృతిధర్మము. కావున సాహితీసరస్వతియు, ఈ చంచలప్రకృతితోపాటు, పూఁటకొక బురఖాతగిలించుకొని, స్వరూపమునేకాక స్వాత్మనుగూడ మార్చికొని, సంఘము తన్నెట్లాడించిన నట్లాడవలయునేకాని, తానే సంఘమును సన్మార్గమున నడపించునది కాకపోవునుగదా, ండు కావ్యము "కాంతాసమ్మితము. ప్రేయసివలె జాతికి దేశముచేయునది" అను సాహిత్యవేత్తలమాట బూటకమే తన యిచ్ఛవచ్చినట్లు, తన పోకడలతోపాటు

సాహిత్యమును దిద్దవలసియుండును. (నేఁడు జరుగుచున్న దీ పనియే)- ఈ దిద్దుఁబాటులతో నేఁడు పుట్టిన సాహితీసరస్వతి తేపే సందుగొట్టి చావవలసినదేకదా! స్వాతంత్ర్యమా లేదు, సార్వకాలికమా కాదు. ప్రతిక్షణమును బాలారిష్టము-ఇట్టి తాత్కాలిక సాహితీసంతానము పుట్టకున్ననేమి? మన ప్రాచ్యసాహిత్యపుబ్రతుకీపాటిదేనా? ఎన్నివిప్లవములో, ఎన్ని ఆత్యాచారములో తప్పించుకొని, కొన్నివేల శతాబ్దములనుండి ఖండఖండాంతర తత్త్వవేత్తలకు సైతము ఉపాస్యదేవతయై, నవనవోన్మేషయౌవనకలాకాంతులతో జీవించియున్నదే — ఈ అమరత్వమున కేది మూలము? సత్యము, అహింస, దయ, దాక్షిణ్యము- మున్నగు ఆధ్యాత్మికభావసౌందర్యమే కాదా? జాతీయపవిత్రజీవితమున కిదే ఆదర్శము కాదా? ఆచారములు మాఱునుగాని, ఆదర్శములు మాఱునా? ఆర్యసాహిత్యమున కీ ఆదర్శమే అమరత్వమును ప్రసాదించినది. అట్లయిన వాస్తవిక సాహిత్యము పనికేరాదా, ఎల్లకాలము నీ ప్రాఁతపుంతయేనా? నూతనత్వము వలదా? కావలయును. కాని భారతీయశరీరము లెన్నివిధముల మార్చినను, ఆత్మను మార్పఁదగదు. ఆత్మవంచిత మగుజాతి నిర్జీవము-అనుకరణకళయందు సౌందర్యమే లేదు. పైఁగా, దానియం దింకొక అనర్థమున్నది. సత్త్వరజస్తమోగుణాత్మకమే ప్రకృతి. అందుఁ దమోభాగమే హెచ్చగుటనిర్వివాదము. దానినే అనుకరించుచువచ్చిన సాహిత్యము తమఃప్రధానమే అగును గాని సాత్వికసుందర మెట్లగును? అట్టిసాహిత్యమువలన జాతి కధఃపతనమే కాని అభ్యున్నతిలేదు. కావున, కవి, ప్రకృత్యనుకరణముతోపాటు తన

భావనాశక్తిచే ప్రకృతికంటె విలక్షణమైన ఆధ్యాత్మికప్రపంచమునుసైతము సృష్టించి, అందుండి పాఠకులకు సత్యసందేశమందింపవలయు. ఆత్మకు సౌందర్యమే సత్యము. దాని పేరే ఆత్మసామ్రాజ్యము. భారతీయుఁడీ ఆత్మసామ్రాజ్యమును సభ్యత నందవలయు నన్న ఆర్యసాహిత్యమునే ఉపాసింపవలయు. నేఁటి మన విశ్వవిద్యానిలయము లెన్నటికైన నట్టి ఉపాసనా మందిరము లగునా ?

సత్యనారాయణమూర్తీ! నీగ్రంథము చదువుచున్నంత సేపు నీవు నాకన్నులముందే ఉన్నావు. ఇదే నా ఆశీస్సనంది కొని పొమ్ము.

ఇట్లు భవదీయుఁడు,
ఒలిజేపల్లి లక్ష్మీకాంతము.

# ఒ క మా ట

(ద్వితీయ ముద్రణము)

విద్యనుగుఱించిన ప్రసంగములే కొంతకాలమునుండి సర్వస్థానములందును శ్రుతిగోచర మగుచున్నవి. మంత్రులును, అధ్యాపకులును, విశ్వవిద్యాలయోపాధ్యక్షులును, దేశనేతలును పెక్కుదిక్కులనుండి యీ విషయమును విలోకించుచున్నారు. ఉదాత్తములైన విద్యాశయములను నిర్వచించుటకు తగినయద నిదియకదా! ప్రస్తుతగోష్ఠి కర్ణగోచర మగుటకు మున్నే యుదయించి, యీ కర్తవ్యభారమును వహించిన "విద్యార్థప్రకాశిక" కట్టెదుట ననుకూల మైన కాలమునే యవలోకించినది. జిజ్ఞాసువుల యాదరానురాగములు దీని యుపాయనము లైనవి.

ఆంధ్ర విశ్వకళాపరిషత్తువలెనే మదరాసువిశ్వవిద్యాలయముకూడ కళాశాలలందు దీనిని పాఠ్యపుస్తకముగా నిర్ణయించినది. నాయత్నము నీతీఱున నాశీర్వదించిన ఈమహాసంస్థలకు హృదయపూర్వకముగ ధన్యవాదము లర్పించుచున్నాను.

ప్రస్తుతయుగమున స్థలమునకు సంబంధించిన యంకిలి తొలఁగినది. సకలసీమలును సన్నిహితసంబంధము నందినవి. తమతమ యాశయములను తమ జెండాలపై చిత్రించుకొని, పృథ్వీజాతులు దవ్వులనుండి దరిఁజేరుచున్నవి! మానవదిగ్వ

లయము మిక్కిలి విశాలమైనది. జీవితపథమున నవ్యదృశ్య
ములు దృగ్గోచర మగుచున్నవి. సంచలితసమయమున సోమ
రియై పడియుండఁగలవాఁ డెవఁడు? సంకులసమీకమున సుఖ
స్వప్నము గ్రోలఁగలవాఁ డెవఁడు? హృదయనిభృతమున నాత్మ
శక్తులను నిదురనుండి లేపి, అష్టదిక్కులకు దృక్కులను ముడి
పెట్టి, వివిధ శాఖలందు జవోపేతముగ ముందంజవేయు జ్ఞాన
మును ఆత్మవిభూతి గావించుకొనుట ఆధునికవిద్యార్థికి తప్పని
సరియైన కర్తవ్య మైనది. ఒంటరితనమున బ్రదుకీడ్చువాఁడే
విజ్ఞానాంగణమున జాతి మతభేదముల సృష్టిగని సొంతమూల
యందు నక్కి కాళ్లు ముడుఁచుకొనును. కాళ్లు ముడుఁచుకొను
వాఁడు రాతిప్రతిమ యగునుగాని గట్టులనెఱుఁగనిభావక్షేత్ర
మున పథికుఁడెట్లగును? సర్వశాస్త్రములను నేఁడుమానవుఁడు
తనమాన్యములఁ గావించుకొనఁగల హక్కునొకపిడికిటఁ బట్టి
నాఁడు; సకలకళలను తనసొమ్ములను చేసికొనఁజాలు శక్తిని
రెండవగుప్పిటఁ బూనినాఁడు. వట్టిచేతులతో నిలుచువాఁడు
చప్పట్లు కొట్టఁగలఁడు. అంతియే! భారతికి నెలవైన నేలలో
నీ నిర్భాగ్యుఁడు నిలువఁజాలునా?

స్థలప్రతిఘటనము వంగి సలాము లొనరించినపుడు,
కాలమునకు సంబంధించిన యడ్డుగట్టులు శిరములెత్తి నిలు
చునా? గట్టులు తెగినపుడు జ్ఞానపూర మవిరళముగ స్రవిం
పదా?

వర్తమాన కాలశిఖరమున కలోస్సస్‌వలె నిలిచి, గత
మును విశాల సింహావలోకనమున నిలిపి, మతిమంతుఁడు భావి

కాలమున తనగమ్యస్థానమును నిర్దిష్టము గావించుకొని మనో రథసిద్ధికై నడుముగట్టును. తన తపఃఫలముచే గిరీంద్రుని తల పైఁగల గంగోత్తరిని కదపి, గంగాసాగర మెందున్నదో యూహించి దివిజకల్లోలినికి నిజజీవిత కల్లోలినిని సహకరించి పూత భావవీచికల హాయి నంది విజ్ఞానపథికుఁడైన భగీరథుడు నిజాశయసిద్ధి నందెనుగదా! కాలపథమున వెనుకముందుల నవలోకించి,సంచితవిజ్ఞానమునకు నూతనపరిజ్ఞానమునుతోడుచేసి, జీవితమంజూషయందుఁ జేర్చుకొనుపథికుఁడే క్షుద్రభేదములను నేల గాల్చి, జగతిని కవుంగిలించి, కులుకును.

దుష్ప్రవృత్తులు నేఁడు కారుపొగలను, విషవాయువులను గ్రక్కుచున్న నేమి? మనుష్యత్వమునందలి మహత్త్వమును గుర్తించిన విజ్ఞానయాత్రికుని దృష్టియందు పరమాశయపుంజము పరంజ్యోతి యై తేజరిల్లుచునేయున్నది. అసాధ్యములను తనదొడ్డిలోనిపాఁడియావులఁ గావించుకొనుచున్న మహాత్ముఁడిట్టిపథికుఁడుకాఁడా? ముక్తిదూతకాఁడా? ఈతఁడు మనియున్నకాలమున మసలుభాగ్య మందిన యువజిజ్ఞాసువులు సాధింపరానికార్యములను, సాధించుశక్తిని తమసాధనకతనఁ బడయఁజాలకుందురా?

విద్యార్థినై, తోడివిద్యార్థులను తోడియాత్రికులను జేసికొని, ఉత్కృష్టసాధనకై వారి నుత్సహించుట నాయాశయమని నా "విద్యార్థప్రకాశిక" చెప్పకచెప్పుచున్నది. కళాశాలలందలి మన యాచార్యులు తమ పసన్నదృష్టి నీయాశ్రయ

మునకు లగించిరేని, సంతోషపూర్వకముగ నీగ్రంథమును విద్యార్థులకు బోధింపఁగలరు.

వ్యాసవాఙ్మయము భారతభాషలలో నంతగా గోచరింపదు. వంగభాషలో నీలోపమును మాపుచేసినవాఁడు కవీంద్రుఁడైన రవీంద్రుఁడే! బహుళవిజ్ఞానాంశములు—భాసురవిద్యాశయములు వ్యాసద్వారములనుండి వంగజిజ్ఞాసువుల మనసులఁ బ్రవేశించి, వారిని వంగభారతిచుట్టు వందిమాగధులను గావించుచున్నవి. ఉదారాశయముల నారాధించుచు, ప్రపంచవిశ్వవిద్యాలయములలో నొక్కఁడని వాసిగాంచిన కలకత్తావిశ్వవిద్యాలయము విమర్శనమును, వ్యాసవాఙ్మయమును నిర్బంధపఠనమున నిలిపి, ఉత్కృష్ట పరిశోధనమునకు విద్యార్థుల నుత్సహించుచుండుట విశ్వవిదితమే !

శబ్దజ్ఞానముతోడనే సంతృప్తి నంది, విమర్శాలోకము నందని విడ్డూరపుగాథలనే మనసులందు గ్రుచ్చి మనపని చెల్లిపోయిన దని మన మీవఱలో నెంచుచువచ్చుచుండుటచే, క్రొత్తదియైతోఁచు ప్రస్తుతకర్తవ్యము మహోన్నత మహీధరమట్లు తోఁచి, కొందఱి మనసులందు జంకు పుట్టింపవచ్చును. సంతృప్తికి, అలసభావమునకును సైదోడులై ప్రవర్తించువారు నవ్యయత్నమును క్రీఁగంటనైనఁ జూడరుగదా! కాని, ఆచార్యుని జూచి యంతేవాసి తననైరాశ్యమును నిర్వాసిత మొనరించి, ఆతనివలెనే కాలక్రమమున "సోహం" అని జీవితకైలాసమున శంఖమును పూరింపఁజాలుటం, ఆదర్శవిద్వాంసుల దృష్టాంతముల నొజ్జబంతులు గావించుకొని వీరు తమమనసు

లయందలి నివురుఁనూఁదివైచి జిజ్ఞాసానలమును రగుల్కొలుపగలరు. చిత్తమును పీడించు ప్రతికూలశక్తు లీయగ్నిలో చిటచిటలాడుట కెంత సేపు పట్టును ?

సంకెలలు త్రెంచుకొనిన శాంప్సన్‌వలె, గుట్టకు బంధింపఁబడి స్వాతంత్ర్యము నందిన ప్రొమెథ్యూస్‌వడువున, కఠినసంప్రదాయ శృంఖలములను త్రెంచుకొని, ఆంతరంగిక స్వాతంత్ర్యము నందినజిజ్ఞాసువులు, అనంతవిజ్ఞానవిహాయసమున విహంగములై యెగసి, లాతిశక్తులను నిర్జించి, సుధను గైకొని, అసంఖ్యాకులపురిపిళ్లలో దానిని పోసి, వారి నమృతజీవులను జేసి,తమవలెనే జగదీశునకు సన్నిహితులను గావింతురు.

నా గ్రంథాశయముల నాదరదృష్టితో వీక్షించి, ప్రేమపూర్వకముగ నాపూనికపై శుభాక్షతలు చల్లిన మహనీయులలో దేశోద్ధారకు డొక్కఁడు. కేవలము మేధాశక్తినిమాత్ర మంది, హృదయవిద్య నెఱుఁగక అడలుగొలుపుసుడిగుండము లందుదొరలు అభాగులకు రక్షణస్థానమును జూపు లైట్‌హౌసు కళాప్రపూర్ణునిజీవితము. ఉదాత్తమైన ఆశయములను తమ పూజాపీఠమందలి జ్యోతులుచేసికొని, వానిచరితార్థతకై తమ యాయువును నైవేద్యముగ సమర్పించిన మహాపురుషులలో నీయాంధ్రమనీషికి తావు కల దని ఈతనిజీవితతత్త్వమును, గ్రహించి, ఈతని జీవితవిధానమును గమనించినవారు నొక్కి వచింతురు! ఉత్కృష్టాశయగోష్ఠిని హృదయంగమ మొన

రించుకొనువిద్యార్థులు, ఈ మహాశయముల ననుష్ఠించినమహా పురుషుల దృష్టాంతములపై దృష్టిని ప్రతిష్ఠించిరేని, అనిర్వాచనీయమైన అభ్యుదయము రమాకాంతునవలె కల్గెడుట నిలుచుట నవలోకింతురు. గ్రంథారంభమున నెలయు భావబంధుర చిత్రమున కళాప్రపూర్ణుని కాంచియే, విద్యార్థులు "విద్యార్థి ప్రకాశిక"ను విలోకింతురుగాక!

విశ్వదాతభౌతికశరీరము నేఁడదృశ్యమైపోయినది. కాని, యీ మహాపురుషుని భౌతికకాయమును ఆటపందిరి గావించుకొన్ని, ఆంధ్రవసుంధరయందు ఉత్తమాశయముల పంటలు పండించిన ఆత్మ అమృతజీవియై, తన ఘనసాయమును జిజ్ఞాసువుల కప్పగించి, సుధాబంధురసూనములను పోలు ఆశీస్సులను దివినుండి భువిపైఁ గురియించుచునే యున్నది. కావున నా గ్రంథమీ పవిత్రాత్మతో కృతిరూపకమైన చుట్టఱికమును నిలుపుకొనినది.

సర్వవిధముల దేశోద్ధారకునకు సన్నిహితులై, ఆ మహాపురుషుని అడుగుజాడల ననుసరించి నడచుచున్న జిజ్ఞాసువులు, నా ప్రియమిత్రులు శ్రీ శివలెంక శంభుప్రసాదు గారు నాయాశయ మెఱిగి, ద్వితీయ ముద్రణమును తామే నిర్వహించి, నా గ్రంథమును దేశాటనమునకై పంపు భారమును వహించి, నా యుద్యమమునకు అనన్యమైన చేయూత నొసఁగిరి. నాయెడల వీరు చూపిన అవ్యాజవాత్సల్యమునకు కృతజ్ఞుఁడనై యుండును.

కవి పండితుల నిండుగుండెలనుండి వెడలిన పందుతల
పులు కల్యాణాత్మకములైన సేసలై ఈ గ్రంథపుత్రికపై పడినవి.
సద్భావరాజి గురియించిన సహృదయులకు జోహారులు.

కవితాకళానిధులు శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతముగారి
సమీక్షను నీ ముద్రణమున గ్రంథస్థము గావించితిని. వీరికి నే
నెంతయు కృతజ్ఞుడను.

చెన్నపురి
15-6-1938

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

# విషయసూచిక

# తమోదీపిక

మనుష్యహృదయమందలి దివ్యశక్తులను అవ్యాల విజృం
షఁజేయు అద్భుతశక్తియే విద్య. తన అంతరంగమందలి
హత్తరభావవారాశిని మానవుఁ డెఱుఁగఁడు. ఎఱుఁగుట
తని కాంతరంగికదృష్టి ఆవశ్యకమైనది. ఈదృష్టి నలవఱచు
ని, లోని గభీరరత్నాకరమును గుర్తించు జిజ్ఞాసువు అతుల
ానవిభూతి కధిపతి యగును. తన గుండెయందు కాఁపురము
ము అద్భుతశక్తికి చేతులు మొగుచును. దాని వెలుఁగు
న, దినమణితేజమున తేజరిల్లు తామరవలె ప్రఫుల్లజీవి
ును. ఈతని నిమిత్తమాత్రునిఁ గావించుకొని, వీనిచే
అద్భుతక్రియలు చేయించును. అద్భుతక్రియలు అద్భుత
ాసముద్భూతములు. ఈ భావములు విద్యయందు
ైన పంటయే కదా! అంకురము కావించు సాధనయే
్క్రమమున దానిని ముగ్గినపండు చేయును. విజ్ఞానక్షేత్ర
ు ముగ్గినపండు కాఁదలఁచునాతఁడు సాధనయందు సిద్ధ
స్తుఁడు గావలెను.

సాధన మతమునకు సంబంధించినది. కావున విద్య
మునకు దగ్గఱిచుట్టము. ఈ సత్యమును అధునాతన వసుం
యింకను గుర్తింపకుండుట దురదృష్టము. దివ్యజ్యోతివలె
మనప్రాచీనులదృష్టి సమత్వమున వెలింగినది. కావున

నాధ్యాత్మికవిభూతిని కరస్థలామలకము కావించు విద్యనే వారు తమ యిలువేలుపుఁ జేసికొనిరి.

మనుష్యజీవనము బహుముఖములుకలది ; మనుజుఁడు నిర్వహింపవలయు క్రియలు వివిధములు. చెట్టుకొమ్మల ట్లివి వేఱువేఱైయున్నను, వీనికి జీవితమువోయు ఏకైకశక్తి ఆత్మ శక్తియే! ఈశక్తి నారాధించి, దీని ప్రసన్నత నందుటకు వలయు జిజ్ఞాసానుష్ఠానములు మతమువలనఁగాని సుసాధ్య ములు కావని గ్రహించి, మన ప్రాచీనులు దీనిని గణాధిపతిఁ గావించి, తొలుత దీనిని సేవించి నిర్విఘ్నజీవనములు కడపిరి. కావుననే భారతప్రకృతియందు నేఁడును మతము అధిష్ఠానదేవతమైయున్నది. అన్యనాగరకతలు ఎన్నిమాఱులు భారతసభ్యతపై దాడివెడలినను, అది నేలఁగూలక ప్రపంచ జిజ్ఞాసువులదృష్టిని, బోధకులదృష్టిని, ప్రవక్తలదృష్టిని ఆకర్షిం చుచుండుటకు కారణము మతమహాత్త్వమును గుండెయందు నిలుపుకొనుటయే !

పాశ్చాత్యనాగరకతయందు ఏదో వెలుఁగు వెలుఁగు చున్నదని, * దానికి "జే! జే!!" అని, తమ నాగరకతకు "ఛీ!" యనువారు ఆంగ్లవిద్యయం దారితేఱిన భారతీయు లలో ననేకులున్నను, ఆంగ్లవిద్య నెఱుఁగని పామరులు సంప్ర

* ఈ వెలుఁగునుగుఱించి రవీంద్రుఁ డీమనినాఁడో పరికింపుఁడు :

"The glow we see on the Western Horizon is not the glory of the sun or of a new birth, it is that of a conflagration."

దాయసిద్ధమైన మతమహత్త్వముపై కన్నిడి దాని యాలో కమును తమ జీవనములను గడపుకొనఁ గాంక్షించుచున్నారు. ఈకాంక్ష కతననే భారత రాజకీయ, సాంఘిక, ఆర్థికోద్యమ ములు మహత్తరాశయమండితములై యుండవలెనని వీ రాశ పడుచున్నారు; ఈకాంక్ష కతననే మతముపై, ఆత్మశక్తిపై, ఆధ్యాత్మికశక్తిపై నాధారపడు ఉద్యమములనే వీరారాధించు టకై ముందంజ వేయుచున్నారు.

మతమనినంతన ముఖము చిట్లించుకొను విద్యాధికు లున్నారు. వీరి మనసును పట్టినచదువు కృషికులను, పల్లె వాసులను అంటుకొననందుల కానందించవలసియున్నది. 'భారతీయులు పల్వురు మూర్ఖు' లను వాక్కు కర్ణకఠోరమై వినఁబడుచున్నది. కాని, యీ మూర్ఖులహృదయములం దింకను ఆరిపోని జ్యోతిని మన ఆంగ్లవిద్యాధికులు పల్వురు సాదరదృష్టితో విలోకించి, తమ యంతరంగమందలి అఖం డముపై రివ్వు రివ్వునవీచు ప్రతికూలసభ్యతా వాతూలమును ప్రతిఘటించు రక్షణవ్యవస్థను నిలుపుకొందురుగాక!

మతమహత్త్వమునకు పరోధియై, ఆధ్యాత్మికశక్తిని గనక, ఉత్తమాశయములకు దూరీకృతమై యున్న దకావుననే, నేఁటి విద్యావిధానము పెక్కు చెడుపులకు కన్నె...యినది. ఈ చెడుగులపై నేఁడు కొందఱు మహాశయులు దృష్టినారిం చుట సంతోషకరము. బెంగాలు ప్రాష్ట్రమందలి విద్యావిధా నము లోపములతో నిండియున్నదని, నిన్నగాక మొన్న ఆ

రాష్ట్రపాలకులే తెలిపిరి. ఈ లోపములు అధునాతన భారత విద్యావిధానమం దంతటను ప్రబలియున్నవి. ఈలోపము లచిరములో నంత మొందవలెను. మనుష్యహృదయమున జిజ్ఞాస నుదయింపఁజేసి, మానవుని యాత్రికునిచేయు విద్యావిధానము తలసూపననాఁడే, సర్వతోముఖపురోభివృద్ధికి వలయు భావసామగ్రి, శమంతకముకతన వృద్ధియగు బంగారుప్రోవువలె మనుష్యహృదయమున పెంపొందును.

మూర్ఖులనఁబడు పల్లెవాసులందు పల్వురు ముముక్షువులున్నారు. మానవజీవనమును నేఁడెదుర్కొను వివిధ సమస్యలను గుఱించిన పరిజ్ఞానముమాత్రము నేఁడు వీరికి అక్కఱ్ఱైయున్నది. ఇట్లని స్త్రీలనుగుఱించియు వాకొందును. మన నారీమణులందు మతమహత్త్వము వెలుఁగొందుచునేయున్నది. వీరియందు నేఁడు సంచలన ముదయించుచున్నది. ముందంజ వేయ వీరు కౌతుకము చూపుచున్నారు. కాని వీరిలో పల్వురు నేఁటి ఆంగ్లవిద్యాధికుల దృష్టాంతములను మేలుబంతులు చేసికొనఁజూచుట దుఃఖకరము. ఈ విద్యాధికులందఱి కనుకొలుకులందు వెలుఁగునది పూతభావమరీచి కాదని వీరు గుర్తింపవలెను. తమ హక్కులును, తమ బాధ్యతలును, తమ కర్తవ్యములును ప్రత్యేకప్రాముఖ్యము కలవనియు, తమ దృష్టి నాకర్షింపవలయు విద్య నేఁడు విజృంభించుచున్నది కాదనియు, తమ ఆశయములను, తమ గమ్యస్థానమును గమనించియే తాము నడుముఁ గట్టవలె ననియు సోదరీమణులు గ్రహింపవలెను.

మతాలోకమందే విద్య పెంపొందవలయుననుట కెన్నెని కారణములు కలవు. మతదృష్టి సచ్చిదానందముల కాలవాలమైన జగదీశునిమీఁదనే యుండును. "సత్యం, సుందరం, శివమ్" అను పరమాశయములదెస మతము తన చెంగటఁ జేరువారిని కొంపోవును. ఈ యాశయములు తత్త్వశాస్త్ర మతశాస్త్రములందు నెందో అడఁగియుండి, పండితుల చర్చకు పనికివచ్చు సామగ్రిమాత్ర మని అపోహపడువారు కొంద ఉన్నారు. ఇవి మానవజీవనమును తమదెస కాహ్వానించు దివ్యశక్తు లని వీరు గ్రహించుట పాడి. వీనిదెస పెడమొగము పెట్టువారు అపరదిశఁగల నరకమందుఁ గూలఁబడెదరు. మనుష్యమానసము ఏదేని ఒకదిశకు పోకమానదు. మానసము నదీపూరమువంటి దని మనశ్శాస్త్రపరిజ్ఞాత లెఱుఁగుదురు. నిదురయందుగూడ నిది స్రవించుచుండును. ఆత్మశక్తి ఈ పూరమునకు ఉచితపంథ నేర్పఱుపవలెను. లేనిచో, అది ప్రతికూలదిశఁ బాఱును. ఆత్మశక్తి, మతపరిజ్ఞాన, మతానుష్ఠానములవలన పెంపొందును. మానసమును సత్పథగామిఁ జేయున దీ శక్తియే!

మనుష్యచిత్తముపై గొప్పతలఁపులు పూలవానవలె రాలినపుడు అది స్వర్గమగును. వానకోయిలమై మానవుఁడు తన చూడ్కి సీతలఁపులపై నిలుపడేని, రాబందులట్లు దుశ్చింత లాతని చిత్తముపై వ్రాలి, దానిని పొడుచుకొని తినును. సదాశయము స్వర్గబంధురము; దురాలోచనము తనగుండెయందు నరకము నిముడ్చుకొనియుండును. నాక

నిరయములకు నడుమ Purgatory అనఁబడు లోకము కలదని క్రైస్తవులు, చిరనరక చిరస్వర్గములందలి విపరీత భావమును నెట్టించుటకై యూహించుకొనినను, ఇట్టి దొండు కలదని తెలుపఁజాలము. సచ్చిదానందములు లేని తావున నంధకార మలముకొనియుండును. సత్యములేని తావున అనృతము రాజ్యచక్రము త్రిప్పును! ఆనందమున మున్క వేయనివాఁడు, దుఃఖబడబానలమున మిడుత యగును. ఈయంశముల నెఱిఁగియే, పరమాశయముల దెస మానవుని నడుపఁజాలు వెరవులను తమ విద్యాప్రణాళికయందే మన ప్రాచీను లేర్పఱచిరి. * నిముస మోపికపట్టి పరిశీలించితిమేని, మనుష్యజీవనము, విద్య, మతము అవినాభావసంబంధమున మన దేశమందు వరలె నని గుర్తింతుము.

---

* విద్యార్థి అలవఱచుకొనవలసినది ఆధ్యాత్మికదృష్టియనియు, నైతిక పటుత్వ మనియు నేను పలుమాఱు వాకొనుచునేయుందును. జిజ్ఞాసువులై యాత్రికులైన పాశ్చాత్యమనీషులు మన ఆశయముతో నేకీభవించుచున్నారు. డాక్టర్ హాగ్ మహాశయుని వాక్కులు పరికింపుఁడు: "For my experience is far from teaching me that the Indian undergraduate is less responsive than other under-gradutes to the emancipating transforming magic of a many-sided College life, and to the contagious example of teachers with whom pursuit of truth, beauty and goodness is an abiding passion. If you, graduates have had the good fortune to belong to a College that knows its business, to-day is not the first time that you have inwardly pledged yourselves to support and promote the cause of morality and sound learning. Disinterested pursuit of the good and the true has long ago become a demand which you make upon yourselves." Vide Dr. Hogg's Address delivered at the Madras University Convocation held on 7th August,'35.

సుగంధ సౌందర్యములు హృదయమునకు స్వర్గసుఖ మిచ్చునవి. కాని గుణములకు ప్రత్యేకమైన అస్తిత్వము లేదు. ఇవి ఒకవస్తువుపై నాధారపడవలెను. కావున సుగంధ సౌందర్యములు పూవు నాశ్రయించినవి. ఈ గొనములు లేని యెడల, పుష్పనకు బ్రదుకు లేదు. పూవు లేకున్న యెడల వానికి దిక్కు లేదు. విద్యామతములు మనుష్యజీవనము నాధారము చేసికొనును. ఇవి లేని జీవనము అబద్ధపు బ్రదు కగును.

మతదృష్టియందలి మహదాశయములను క్రమానుష్ఠానము కతన మానవుఁడు మనసునకు పట్టించుకొనవలెనని యెంచియే ప్రత్యేకజీవన ఘట్టములందు మన ప్రాచీనులు ప్రత్యేకజీవన విధానములను నిర్ణయించిరి. వీనినే ఆశ్రమము లందుము. తొలుతటిది విద్యార్థిది. వృక్షాంకురమువలననే వృక్షఫలము తలసూపు లీల, విద్యకతన మనుష్యజీవనము ఫలపుష్ప సమన్వితమై, కల్పకమునకు నోజబంతి యగును. తొలుతటి ఆశ్రమమం దారంభమైన సాధన, నాలుగాశ్రమములు ముగియునప్పటికి పూర్ణమై, మనుష్యజీవనమందలి తుది రొబ్బయందు ముక్తిమందారమును కుసుమింపఁజేయును. ఈ సాధనమును నెఱపిన నిష్ఠపరులే—యీ తపసునందు సిద్ధహస్తులైన మహానీయులే సర్వతోముఖ జ్ఞానాభివృద్ధినంది, తమ విజ్ఞానసౌరభము నాత్మజీవనమున నింకింపఁజేతురు. వీరి చరిత్ర సుగంధబంధురమైయుండును! మనుష్యశక్తులను నిశితమొనరించుటయ కాక మనుష్యచరిత్రను అమరులకు నొరవడి చేయుటకూడ విద్యయొక్క ఆశయ మగుచు, ఈ యాశయ

మును అందిపుచ్చుకొనువారే నిక్కంపు విద్వాంసులై బహు వ్యాఖ్యాతుల కాచార్యులై, పరార్థజీవులు కాఁజాలుదురు. ఇంద్రియనిగ్రహహీనుఁడైన విద్వాంసుఁడు ఆత్మజీవనమున గరళము [illegible]కొని, అన్యుల కడలు పుట్టించును. "చారుమాణిక్య భూషితశస్తమస్తకంబయిన పన్నగము భయంకరము" కాదా?

ఆత్మసంయమమునం దాఱితేఱినవారు, వీర్యవంతులై అద్భుతశక్తి సంపన్ను లగుదురు. ఈ వీర్యమునే అరవింద యోగి energy అనుచుండును. (We are each of us a dynamo into which waves of that energy have been generated and stored, and are being perpetually conserved, ·used up and replenished". Vide "The Brain of India"Page 21, by Sree Aurobindo Ghose.) ఈశక్తిని తమ హృదయములందు పూరించుకొను వ్యక్తులే ఆత్మకురుక్షేత్రమున విజయులు కాఁగల రని గీతాచార్యుఁడు వాకొనె నని భగవద్గీతయందలి శంఖప్రకరణమును హృద యంగమముఁ గావించుకొనినవా రెఱుఁగుదురు. శంఖమును పూరించుటన నీ శక్తిని అంతరంగమున నిండించుటే! పాంచ జన్యమును పూరించిన హృషీకేశుఁడును, దేవదత్తమును బూరించిన ధనంజయుఁడును, పౌండ్రమను మహాశంఖమును పూరించిన వృకోదరుఁడును, అనంతవిజయమును బూరించిన యుధిష్ఠిరుఁడును, సుఘోష మణిపుష్పకములను పూరించిన నకుల సహదేవులును, వేర్వేఱుగా ("పృథక్పృథక్") తమతమ శంఖములను పూరించిన యోధులును మహాబాహువులైన "పృథివీపతు"లును ఈ యద్భుతశక్తికతననే విజయకేతన

మొత్తఁగలిగిరి. కౌరవవీరు లెవ్వరును శంఖమును పూరింపరైరి. వారి కీశక్తి లేదనుట స్పష్టవిషయము. వారు మనుష్యులకు నోజ్జబంతులు కారు. అపజయమునకు వా రనుంగుబిడ్డలు!

ప్రాచీన విద్యావిధానమున మేలుచేతు లైనవారందఱును తమజీవనములం దీ యద్భుతశక్తిని 'శంకుస్థాపనముఁ' గావింపఁ గలిగిరి! ఈ విద్యావిధానమందలి పరమార్థమును గ్రహించి దాని నొరవడి గావించుకొనఁజాలితిమేని, నేఁటి మనవిద్యా ప్రణాళిక 'నవనవోన్మేష శాలినియై', మనకు పునరుద్ధరణము చేకూర్పఁ గాఁగలదు. ప్రాచీన మనిసంతన,—సనాతన మని సంతన చట్టుగుని లేచుట పాడికాదు. *

యుగములు కడచినను, నవయుగమున కక్కఱలైన పద్ధతులు కొన్ని అవలంబనీయములైనను, ప్రాచీన సంస్థలందు పెరిఁగి పెంపొందిన ఉత్తమాశయములు (యివి రవికిరణము లట్లు, పూవుతావివలె, పండువెన్నెల చందమున మాపు నెఱుఁగక నిత్యనూతనము లగుడు) నేఁడును మన పూజాపీఠ మందలి ఆరాధ్యదేవతలై వెలయవలెను. ఏకాగ్రదృష్టి యనుఁడు, మననవిదిధ్యాసనము లనుఁడు, మతానుష్ఠానవిద్యా భ్యాసములవలన మనుజునకు పట్టుపడును. పరమాత్మనుండి కదలివచ్చిన జీవాత్మను తొంటిపదవియందు చేరుచు అద్భుత

---

* "It is a buman paradox not altogether devoid of humour and tragedy that, in these days when reason and enlightenment are supposed to be the ruling factors, Sanathana Dharma should be looked upon by certain sections as essentially reactionary." His Holiness Sree Sankaracharya of Kamakoti Peeta.

శక్తి మతమందున్నట్లు, అణువైయున్న మానవుని బ్రహ్మాండ ములను నిండియున్న భగవానునందుఁ జేయుచుశక్తి విద్యయందు కలదు. ఆదర్శవిద్య నంది, ఆత్మశక్తిని బడసినమహాసాయము లో మహావీరుఁడై "సోహమ్" అని గురుగంభీరస్వరముగ బలికి "తత్త్వమసి" యను గంభీరవాక్యానేడు టిహృదయ మున ప్రతిధ్వనింపఁజేయును. ఒకప్పుడు అణువైయుండిన వ్యక్తి యాశక్తి నందినంతన, పొన్న వాహనముమీఁద శ్రీకృష్ణు నట్లు యుగములమూపునఁ దేజశ్శాలియై వెలయును! మనుష్యజీవనమున కీ ఘనపదవి నిచ్చువిద్యయే నేఁడు మనకు కనకదుర్గ కావలెను. వ్రతమనిన పరమపవిత్రోపసంభరితస్వాం తలగు సోదరీమణు లీదుర్గను, యీ "ముగురమ్మల మూలపుటమ్మ"ను హృదయమందిరమునందు నిలుపుకొందురు గాక!

గురుతరోద్దేశమును కనులయెదుట నిలుపుకొనుయాత్రి కుఁడు ఎదుటికొండ కొనను చేరఁజాలకపోవచ్చును. ఈతని యుద్దేశమందలి మహత్త్వమును, ఈతని దృఢయత్నమును గణనీయములు. ఈతఁడు గెలుపునందుఁగాక, అందకపోవును గాక—యీకృషియును, ఆయుద్దేశమును సహజభూషణములై యీతని చరిత్రకు అపూర్వసౌందర్యము నొసఁగును! అనంత శక్తిసమన్వితుఁ డగు జగదీశుఁడు తన యొరవడినిబట్టియే మనుజుని సృష్టించినాఁడు. జన్మపరంపరలు వివిధప్రాకార ములై యెదుట నిలిచినను, నిజజీవనోద్దేశమును గుర్తించిన మానవుఁడు ప్రాకారములను దాఁటిదాఁటి స్థానకాంతున్న జేరి

తుఁడై, దివ్యసింహాసనాసీనుఁ డైయున్న సర్వేశుని చేరి, ఆతని హృదయమున కౌస్తుభమణి కాఁగలడు. ఒకటే ప్రాకార మున కవ్వల, ఒకటేజన్మమున కవ్వల ముక్తిని చూడఁగలిగిన మానవు లీవఱలో నే యుగమందును పుట్టలేదు.

" ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః,
అనేకజన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్."
(శ్రీ భవద్గీత ; అధ్యాయము 6 ; శ్లోకము 45.)

ఎన్నియో జన్మలను దాఁటియే నరుఁడు విజయుఁడవ్వో ననియు— ధనంజయుఁడా యెననియు గీత తెలుపుచున్నది. కృషి సూత్రమును వదలనివాఁడు, సూత్రము తుదఁగల దివ్యమాణి క్యమును కాలక్రమమున చేఁబట్టఁగలడు. కృషియే మనుష్య జీవన మహత్త్వము నుగ్గడించువంది! ఇదియే ఈశ్వరసృష్టి యందు మనుజున కగ్రస్థానము నిచ్చుచున్నది!! ఇదియే వీరుని ఈశ్వరపార్శ్వమున దివ్యరుచులు చిప్పిలఁజేయు గద్దె యం దాసీనుఁగావించును!!! రక్కసిమూకల నెదుర్కొనిన బ్రహ్మచారి మహావీరుఁడను ప్రతీతి పడసి, సంజీవిని చేతఁబట్టిన నిత్యజీవియైనట్లు, మహారిష్టములను ప్రతిఘటించు వ్యక్తి అమ రత్వము నందఁగలఁడు. ఈతని ఆశయము చెరిగిపోదు; జగ దీశుని నొసలున వెలయు కస్తూరీతిలకమువలె అనంతకాల మున శోభిలును! ఎదుటికొండ నెదుర్కొనినపు డీతని నొసలునుండి చెమ్మటబొట్టులు రాలును ; యీ బిందువులకు అదృశ్య దేవతయ ట్లీతని చెంగట వర్తించు వీని యాశ యము దోసి లొగ్గి, అవి దివ్యమౌక్తికము లగుట గుర్తించి,

[illegible] సంకేత ప్రశ్నల, పరీక్ష ముగిసినంతన ప్రాణపతిం జేరు [illegible] హృదయసీమయందు స్వాగత మిడి [illegible]హారము నాతని కంధరసీమ నలంకరింపంజేసి “ఇంక [illegible]నైతి” నని కులుకును!

నేడు సమ్ముఖమున నున్నది సంతమసమే. నానా జాతులవారు నేడు చీకటిలో కుమ్ములాడుచున్నారు. “హక్కు”లని “ప్రత్యేకజాతి సముద్ధరణ”మని పెడబొబ్బలు పెట్టుచున్నారు! ఈ చీకటి అంతరించినగాని, ఎవ్వరును తమ హక్కులను, బాధ్యతలను గుర్తింపలేరు. సాంఘిక రాజకీయోన్నతికి వెలుంగు అవసరము. ఈ వెలుంగు నిచ్చునది సద్విద్య. సద్విద్య సదాశయము నుపాసించునది. ఈ యాశయమును దృష్టినిడికొని వ్రతదీక్షకు కడంగితిమేని, సుప్రసన్నమైన దేవివలె నది సంతమసమును చీల్చి, చెండాడి మన ముంగల మహాజ్యోతియై వెలుంగును. ఈ తమోదీపిక ముంగల స్త్రీలును, పురుషులును, సర్వజాతులును జగద్ధాత్రి కట్టెదుటనిలుచు భక్తులట్లు వ్యత్యాసము తెలియక నిలువం గలరు. ఈ జ్యోతికతన వీ రాత్మజ్యోతిని, పరంజ్యోతిని గుర్తించి వానికి తమ గీతాంజలి సమర్పింతురు. ఈ శుభ ముహూర్తము ప్రత్యక్షమగుట ఎన్నటికో కదా!

# విజ్ఞాన యాత్ర

ఉత్తమ విద్యాపీఠమును చేరుకొనిననాఁడే మానవుఁడు సర్వతోముఖాభివృద్ధిని కనులఁ జూచును. ఉత్తమాశయములను ఆత్మజీవనమునకు 'భూరిమయాంగద తారహారములు' చేసికొనిననాఁడే, ప్రభాకలితుఁడై ఆతఁ డున్నతవిద్యాపీఠమునఁ దోఁచును. పూర్వకుధరశిఖరముపై సప్తాశ్వుఁడు తోఁచినంతన, అనంతానందమున వికిరవితానము రవికి గీతాంజలి నర్పించులీల, కాలశిఖరము నాత్మపీఠిఁ గావించుకొని విజ్ఞానసందీప్తజీవియైన యాతనిగాంచి దశాంగనలు పులకితలై జేజేలు పాడి రత్నరుచుల సీతనికి నివాళియిచ్చి, వీని కీర్తిచంద్రికలను నోముబొట్టులట్టులు తమ ఫాలభాగములందుఁ దాల్తురు.

ఆత్మపరిశీలనమున నాటితేటిసవ్యక్తి క్రమక్రమముగ నీయున్నతపీఠస్థలిదెస సాగిపోఁగలఁడు. ఇట్టి పరిశీలనమువలన గాని మానవుఁడు తనగుణములను, తనదోషములను గుర్తింప జాలఁడు. లోయలోనుంటినని తపించునాతఁడు కాలక్రమమున గట్టులదారమూపున ముంగాలివ్రేళ్ళపై నిలిచి, ముగ్గిన పండువలె కట్టెదుటఁదోఁచు పరమాశయమును పుడుకఁ జేతులు చాపును.

గోయిఁ గూలక గొప్పకెక్కిన వా రెంద ఉన్నారు ?

దుఃఖమును గుటకలువేయక సుఖమును గ్రుంకు లిడనివా రెందఱున్నారు? తప్పులందు తలక్రిందులుకాక ఒప్పులనోప్పరి కించినవా రెందఱున్నారు? నేగులఁ గూలక, బాగులఁ బట్టి నేర్చినవా రెంద ఱున్నారు? ఎట్టిబ్రదుకులోనైన మిట్టపల్లము లుండకపోవు. పల్లములం దల్లాడుచు, ఎత్తున కెగయుచుంటిమని మిడిసిపడువారు మఱింత లోతైన గోతిలో దొరలుదురు. దోసగుల నెఱుఁగువారు నాడిగుర్తించి, మెలకువ మెయి నర్తింతురు. దోషముల నెఱుఁగవలెనను మక్కువ భావబాధుర మైనది. అసంతృప్తి, అభివృద్ధికాంక్షలతో నిది నిండియున్నది. అసంతృప్తిలేనివ్యక్తి, నిలిచినచోటునందే నిలిచి, మునిఁగిన గుంటయందే మునిఁగి, బండబారి, మొద్దుదేఱిచావకయుండ్చి నట్లే యుండును. అసంతృప్తియందే అభివృద్ధికాంక్షయు, జీవకళయు, భావ్యాదాశయమును నున్నవి! దోషములనెఱుఁగఁ గాంక్షించు హృదయమందు దోషములే ఉండవు.—దోషము లుంట దోషములను మఱుఁగుపఱుచుకొను నెపందయందే కాని, అవి తోఁచుదిక్కున కన్నుంచువ్యక్తి హృదయమందుఁ గాదు.

బదరికాశ్రమమును జేర నుంకించు యాత్రికునివలె, తన జీవన పరమావధినిచేర నాతురపడు విజ్ఞానయాత్రికుఁడు, తన పయనమును జిజ్ఞాన పిపాసఁగల సతిఁగూడి సలిపిన, ధన్యుఁ డగును. సహధర్మచారిణి ఎందున్న నందే గృహముండును. గృహలక్ష్మివలన సీతఁడందు చేదోడు వీనికి ద్విగుణీకృతశక్తి నిచ్చును.

గృహ మన నాలుఁగుగోడలవరుస గాదు ; లక్ష్మియన పెక్కురూకల గుట్టగాదు; స్త్రీయన రక్తమాంసముల చక్కని గ్రథనముకాదు. స్వర్గమును చవిఁజూపి, మోక్షమునకు ద్వారమగునది గృహము! హృదయవిషాదమును దూలించి, ఆత్మారాము నెదుటఁబెట్టు పవిత్రశాంతిమూర్తి లక్ష్మి!! సత్వరజస్తమముల (స్త్రీ=స+త+ర. స=సత్వ, త=తమ, ర=రజ) కలయికయందలి గభీరోద్దేశములు వ్యక్తీకరించు అద్భుతసృష్టి స్త్రీ!!! స్త్రీ యన గృహ మనుఁడు.—స్త్రీ యన లక్ష్మి యనుఁడు —స్త్రీ యన స్వర్గ మనుఁడు.—స్త్రీ యన శాంతి యనుఁడు—స్త్రీ యన మోక్షసోపాన మనుఁడు. స్త్రీని గుర్తింపక, స్త్రీని చీఁకటికోణమందుంచ నూహించువ్యక్తి, మకుటమునఁ దాల్పవలయు కోహినూరుమణిని కోళ్లబుట్టయం దుంచువానిఁబోలియుండును—గళమునఁ దాల్పవలయు శమంతకమును గుహయందు దాఁచియుంచు ఎలుఁగున కెనయైయుండును. 'స్త్రీరత్నము' వాడుకపదముమాత్రమే కాదు!! భాసమానభావమయూఖములు ప్రసరించు చైతన్యయుక్తమణి అది. సచేతనరత్నమందలి కళ లలితకళలందలి కళకు మిన్నయైనది. లలితకళలు సౌందర్యనిధానములై ఆధ్యాత్మికజీవనమునకు మార్గదర్శకములగుచో, లలితకళలను మించిన కళతోనొప్పు స్త్రీవదనమును, వదనకళను మించినసౌందర్యముతో నొప్పారు స్త్రీహృదయమును మహత్తరభావ నిక్షేపములై ఆనందమయజీవనమును చేతికందీయవా? స్త్రీ ఆనందము,—స్త్రీ అనురాగము. దృగ్గోచరముకాని హృదయమే స్త్రీరూపున ప్రత్యక్షమగుచున్నది.

హృదయసౌందర్యము స్వర్గసామ్రాజ్యమును జేర్చునని అన తారపూరుషు లనిరికదా? ఇట్టి సౌందర్యమును,—ఇట్టి సామ్రాజ్యమును పురోభాగమందుంచు అద్భుతవ్యక్తి స్త్రీ!

స్త్రీ, పురుషునకు ప్రాపు.—పురుషునకు స్త్రీ పట్టుం గొమ్మ. పురుషుఁడు మేదస్సు.—స్త్రీ హృదయము. మేదస్సు గగనచుంబి హిమాద్రివంటిది.—హృదయము, పూతగుణ ప్రపూర్ణ భాగీరథిఁబోలునది. సురధుని లేకున్న, తుషారాద్రికి మహత్త్వమే లేదు.—తుషారాద్రి లేకున్న, సురధుని కైహిక శోభయే లేదు. ఈ రెంటిని గలిగినది కైలాసము. ఈ కైలాసము —హృదయమేధలను గలుపు కైలాసము,— సతీపతులను జేర్చు కైలాసము గృహము. ఈ కైలాసమునఁ దోఁచుభావ విభూతియే జిజ్ఞాసువులు కాంక్షించు పరమార్థము.

ఈ యాత్రికుల కర్తవ్యనిర్వహణమునకు తొలుత కావలయునది ఉత్సాహము. తొలినిముసమందే కొంచకొనఁ జూచి, నడుముఁగట్టఁగల శక్తిసంపన్నులు సాధారణమానవు లందు సక్కృతు. తొలియంజ వేయక మలియడుగునకై ఎగిరి పడువారు కాలువిఱుచుకొని కూలఁబడుదురు. అడుగును అడఁచివైచు అలసభావమును అంత మొనరించునది ఉత్సాహము. ఎట్టికర్తవ్య మైనను, ఉత్సాహద్వారమునఁ బ్రవేశించియే పవిత్రమగు తన ఆశయగర్భాలయమును చేరుకొనఁ గలదు. కర్తవ్యము కదలుతటి ఎన్నెని నియమములును, విఘ్నములును దృష్టినాకర్షించును. విధిపరంపరలు ప్రాకారపరంపరలు.

ప్రాకారములను దాఁటి కడనున్న ఆశయదైవతమును జేరి నపుడే యత్నఫలితము సమ్మూర్తిన మగును.

ఫలమునుబట్టి గుణము నెంచునలవాటు మానవలోక మందుఁ గలదు.—ఇది కూడదనఁ జెల్లును. గుణనిర్ణయ మొన రించునది ప్రయత్నముకాని, ఫలితముకాదు. ఫలితము గమ్య స్థానము. గమ్యస్థానమును చేరితి నని ఉబ్బి తబ్బిబ్బగుమను ష్యుఁడు మనుష్యుఁడే కాఁడు. ఒక గమ్యస్థానము వేఱొకగమ్య స్థానమునకు ఆదర్శపూరుషుని జీవనపథమునఁ దొలిమైలు ఱాయి. ఆశయము దిగ్వలయమువంటిది. దిగ్వలయమున కవ్వల నేమున్నదో,—ప్రయత్నమున కవ్వల నేమిఫల మున్నదో మానవుఁ డెఱుఁగఁడు. దృష్టి పాఱినకొలఁది కొండకొన ఎత్తై యున్నట్లేతనికి తోఁచవచ్చును. తాను నిర్దేశించుకొనిన తెరు వునుబట్టి తిన్నగ నడుచుట నితఁ డెఱుఁగవలెను. ఈతనిశక్తిని నిరూపించునది ఈతని గమనిక. కుప్పిగంతులును, కోతికొమ్మ చ్చులును గమనికలు కావు ;—కున్కిపాటునడకయు, అస్సు రుస్సురుపోకయు గమనికలు కావు. నిర్దిష్టమార్గమున, నియమ సోపానముల ననుసరించి ఆశయశిఖరముదెస సాగుచలనమే గమనిక. ఉత్సాహమును, దూరదృష్టియు నీచలనమునకు పద యుగ్మమై కర్తవ్యపథమందు ముందంజవేయఁజాలును.

జ్ఞానయాత్ర సలుపునాతని ముందంజ కేవలము ఉత్సా హముతో నిండియుండరాదు. వట్టి యుత్సాహము వ్యర్థమైన నురుఁగు. నురుఁగునందుఁ దేలియాడువారు మనుజులుకాక

ఎండుబెండు లగుదురు. ఏప్రయత్నమునకైన నుత్సాహము సంజీవివంటి దనుట నిక్కమే. గభీరయోచనయు స్థైర్యము తోడుపడకున్నయెడల, దొలుత సంజీవినియైన ఉత్సాహము పదపడి మానవుని ఇటునటు దొరలించి భయదముగ ముప్పునందుఁ బడఁద్రోయును. ఎదుటిపని కష్టతరమై తోఁచినకొలఁది పురోభాగమందలి కర్తవ్యమహోగ్ర మెత్తై గోచరించినకొలఁది. బలమైన యోచన ఉత్సాహమునకు చేతికఱ్ఱయై యుండవలెను. మానవజీవనమందును,—ముఖ్యముగ భారతజీవనమునందును, భావగమనము జవోపేతమై యుండు నేఁడు ఈవిషయ మెల్లర దృష్టి నాకర్షింపవలెను.

భారతజీవనమున సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమస్య లెన్నో నేఁడు తలయెత్తియున్నవి. వీని నెదుర్కొనుపట్ల తమకు సమానబాధ్యత యున్నదని స్త్రీలు గుర్తింపవలెను. పురుషులతో సరిసమమగు హక్కులకై సోదరీమణులు ప్రయత్నములు సలుపుచుండుట సంతోషకరము. దైనికజీవనమునకు సంబంధించినవ్యక్తిగత సామాజికవిధులను మెలకువమెయినిర్వర్తించుట సామాన్యక్రియకాదు. పరిజ్ఞానముగాని, అనుభవముగాని ఎఱుంగక ముందుల కుఱుకువ్యక్తులు ఘోరమైన అరిష్టములకు పునాదులను త్రవ్వారనియు, వీనిని కూల్చుటకు శతాబ్దాలు చాలినవికావనియు ప్రపంచచరిత్రలు తెలుపుచున్నవి. స్వపరిపాలనము భారతీయుల కింతలో చేఁబడినను, చేఁబడకపోయినను, రాజకీయరంగమందు నేఁటికంటె వారు విశేషబాధ్యతను బాధ్యతగాకున్న,—అశేషములైన బాములను గాంతురనుట

తథ్యము. ఓటు చేయువ్యక్తి ఓటు చుట్టు అల్లుకొనియుండు జటిలరాజకీయాంశముల నెఱుఁగవలెను. మానమును అమ్మి పైకమును చేబట్టుటెట్టిదో ఓటును అమ్మి మాటనింపుటయు నట్టిదే! బాధ్యతయందలి అర్థమెఱుఁగక బాధ్యతజరుపువారు పలుగాకుల నెందఱినో లేవనెత్తినవారగుదురు. క్లిష్టమైన ఆర్థికాంశములు మనజిజ్ఞాసువుల నఖదర్పణములం దుండవలెను. సాంఘిక సమస్యలను చేయునపుడు వీరు తమ అభిప్రాయములను తొలుత తామే నిశ్చయించుకొనవలెను. ఒకవిషయమున నొరులు—వారెంత ఘనులైననేమి—ఏమిచెప్పినను దానిని బాగుగ విమర్శింపక వీరు కైకొనరాదు. 'భళాభళి' బ్రదుకు ఆత్మగౌరవమున్న వ్యక్తికి కాదు. నిరంతరము 'తందాన తాన'లందు దొరలువాఁడు మనుష్యులం దధముఁడని నా యభిప్రాయము. ఒకఁడు మఱొక్కరున కనారతము ప్రతిధ్వనియై మనగోరియుండుటకంటె మహీతలమునుండి మటుమాయమగుట మంచిది. విచక్షణమెఱుఁగని మనుజుఁడు మనుజుఁడేకాఁడు. అంతరాత్మనుండి యల్లుకొనివచ్చు హేతువును, అంతరంగమందే పూడ్చిపెట్టి, మఱొక్కరుని చేతికి ముక్కుదారమందించి, వంగి సలాములు సేయుచు, వెలికిలఁ బడునాతఁడు దానిసకుఁగూడ సిగ్గుఁదెచ్చు నరాధముఁడు! శారీరకముగ గాకున్నను, మానసికముగ నిట్టిహీనజీవనముఁగడపు మానవులు నేఁడెందఱో ఉన్నారు. మహత్తరమైన వ్యక్తిత్వముల సాగిలపడుటయు,—మహత్తరమైన భావమునకు జోహారొనరించుటయు మహాపురుషలక్షణములు! మనుష్యులను దిగమ్రింగు

పిశాచములను పదములక్రింద నొక్కియుంచుటయు, మనుష్య జాతికి కళంకము నాపాదించు దుర్వ్యసనములను పుట్టినపుడే చంపివేయుటయు మహాపురుషలక్షణములే!! ఇట్టి తీవ్రసంఘటనములును, తీవ్రదృశ్యములును అనుదినము కన్పడి మానవులను సవాలుచేయకపోయినను, అపుడపుడు దెబ్బగొట్టినట్లు నెదుట నిలుచుననుట నిక్కము. కూపనిభాసములను, కూపనిఆచారమును, ప్రలోభముజూపు దృశ్యమును ప్రతిఘటించుట కెంతేని మానసికశక్తి ఆవశ్యకము. ఒక విషయమును గుఱించిగాని, ఒక ఆచారమును గుఱించిగాని సమస్త ప్రపంచ మొక్కతలంపుననున్నను, విమర్శించి గోదాని నా వ్యక్తి పరిగ్రహింపవలెను. తన యోచనకు,—తన అంతరాత్మకు ఆభావము విరుద్ధమైతోచెనేని, ముల్లోకములు గదలునాని పైబడినను, జంకుగొంకులేక తన నిశ్చితాభిప్రాయముతో నే తనజండాపూని ఆతఁడు నిలువవలెను. ఎదుటిబలగము పెద్దది ఆతనిని పూడ్చినను, పూడ్చిపెట్టవచ్చును.—కాని అతనిని దిగమ్రింగిన అణువులు అపూర్వశక్తిసంది స్వాతంత్ర్య శాసనందలి మహత్త్వమును దిగంతములకును, సహస్రాబ్దులకును గురుగంభీరస్వరమునఁ దెలుపును!—అతఁడొలికిన రక్తము నుండి అనంతకాలము జయదుందుభులు మ్రోగుచుమ్రోగును !! తుత్తునియలైన అతని యెముక లొక్కొక్క టొక్కొక్క విజయధ్వజమై నభోసీమనంటును!!! స్వాతంత్ర్యమునకై తనను తుచ్ఛమొనరించుకొనిన మహాపురుషుని పాదరేణువులకై పంతములాడుచు అమరులు నరుస్వ లెత్తుకొనివత్తురు !!!!

సూక్ష్మపరిశీలన స్వాతంత్ర్యభావములు, వివిధజీవనరంగము లందు నేఁడెంతయు నావశ్యకములై యున్నవి. తమ యుత్సాహమున కీ శక్తులను తోడుపఱచుకొనుట తోడువిద్యార్థుల ప్రస్తుతకర్తవ్యమని నొక్కి చెప్పుచుంటిని.

ప్రాచీనసంప్రదాయములు నేఁటిఅభివృద్ధికాంక్షయందు రవరవలు పుట్టించునో, దాని నందలమెక్కించి ఊరేగించునో, ప్రతీచీయాచారములు ఆకస్మికముగ అనంతవిజయమును అరచేతి ఆమలకమొనరించునో, అతలగర్భమున విసర్జించునో నేఁటి యువకులును యువతులును తమంతదాము యోజించుకొనవలెను. స్వాతంత్ర్యము హృదయమందును, గృహాంగణమందును అంకురించి, మొలకలెత్తి, చిగురించి, శాఖోపశాఖలుగ సంఘజీవనమునఁ బెంపొందునని గుర్తింపక, గృహాశయములను గొయ్యిఁగూల్చి, గృహదీపమును గుప్పుమనిపించి, గృహబాధ్యతకు బలాదూరని, గృహజీవన నియమములకు దిగదుడుపని, రచ్చపై ఢంకాకొట్టు అభాగులును, అభాగినులును అన్యసీమలందు అనేకు లున్నారు. అంధానుకరణము తమకుఁగాదని రాయిగ్రుద్దిచెప్పి, తమఆదర్శములను పెంపొందించు ఉద్యమమును వారు లేవనెత్తవలెను. తమ ప్రాచీన నైతికవిభవము తమ యంతరంగములందే సహస్రాబ్దులనుండి కదలి చేరుచున్నదని ఒకపరి లోనికిఁజూచి విజ్ఞానయాత్రికులు దానిని గుర్తింపవలెనని నొక్కి చెప్పుదును.

ఒక కంటసాహితీజ్యోతిని రెండవకంటఁ దాత్త్వికద్యుతిని

[illegible]త్రింపఁగలనాఁడువీ రట్లు గుర్తింపఁగలరు. సాహిత్యమును తత్త్వశాస్త్రమును కూడుగుడ్డలు తెచ్చునా యని నేఁడు కొందఱు విద్యార్థులు బొబ్బలిడుచున్నారు. చెన్నపురి విశ్వవిద్యాలయము తత్త్వశాస్త్రమును తఱిమితఱిమి కొట్టుచున్నది. తత్త్వశాస్త్రము మటుమాయమైననాఁడు నేఁటి విశ్వవిద్యాలయములు మసిబొగ్గుగుట్టలగును! మనుష్యత్వసిద్ధికిని, బ్రాహ్మణ్యసిద్ధికిని వలసిన మహితభావముల నిచ్చునది తత్త్వశాస్త్రము. భారతీయుఁడు తత్త్వమయుఁడు. కావుననే ఎన్నెన్ని [illegible] లోకని మెడఁబట్టి నులుముచున్నను, తన ఆత్మను పరమాత్మకు సంధించి, తన మహత్త్వమును కాఁపాడుకొనుచున్నాఁడు! తాను నేర్చినదానిని తన జీవనమం దింకించుకొను సరిపాటు భారతీయునిది. పాశ్చాత్య తత్త్వవేత్తలజీవనములం దెన్నో హంసపాదు లున్నవి. మన తత్త్వవేత్తలజీవనములు మహామహిమమయములనుట జగత్ప్రసిద్ధము. తత్త్వశాస్త్ర మత శాస్త్రములు అర్ధనారీశ్వరులట్లు వరలి, మానవుని చే "సోఽహమ్" అనిపించి, భరతభూమిని భవ్యభూమిని గావించె నని ప్రతీచీపండితులే ఎఱుఁగుదురుకదా! మైత్రేయీ గార్గిలను మించిన విదుషీమణులు ఏ దేశమందు, ఏ శతాబ్దమం దున్నారు? వైదుష్యము అన్యసీమలందు ఋజువర్తనము కావచ్చును, కాకపోవచ్చును. వైదుష్యము భారతసీమయందు సుగుణమంజూషము. మైత్రేయీగార్గిలు చదువులు నేర్చిన చానలేగాక పవిత్రచారిత్రలగు మానినీమణులని ఎవ్వరెఱుఁగరు? పల్వురు గార్గిలును, అసంఖ్యాకులైన మైత్రేయీలును నేఁడుతోఁచిన యెడలనే

తొంటిమైత్రేయీ గార్గిల జీవనములు నాఁడే ఎండుపైరై మడి యుక నేఁడును నవపల్లవములతో శోభిలెనని తెలుపుదును.

దృఢనిశ్చయ, ఇచ్ఛాశక్తి, త్యాగతితిక్షలు కూడి రమణి ఆయెనని పృథ్వికిఁ వెలిపినది భారతసీమయే! ఆత్మ గౌరవరక్షణార్థము అగ్నికుండమున నుఱుకఁగలిగిన స్త్రీ భారతస్త్రీ! అవిసితి అత్యాచారములు మాఱొక్కనినను అసి ధారావ్రతదీక్షవీడని స్త్రీ భారతస్త్రీ!! ఆకసమువిఱిగి తలపైఁ బడినను, తన యున్నతోద్దేశమునుండి పదస్ఖలనమెఱుఁగనిస్త్రీ భారతస్త్రీ!!! కల్లోలము కబళింపనెంచినను, అల్లకల్లోల మడ లింపఁజూచినను, దివిజకల్లోలినియట్లు శాంతశీతలగుణముల నొప్పారినస్త్రీ భారతస్త్రీ!!! నాఁటిస్త్రీ, నేఁటిస్త్రీ దృష్టియందు ధ్రువతార కాఁగలిగి నాఁడే నేఁటిస్త్రీ పవిత్రమగు తన ధర్మ మును నెఱపుకొని ఆదర్శగృహలక్ష్మి కాఁగలదు!!!!

స్త్రీయం దిట్టి యద్భుతశక్తి కలదు కావుననే పురు షుఁడు నలుపు గురుతరయాత్రయం దీమె సంగిణియై యుండ వలె నంటిని.

మహాభారత మేమనుచున్నదో పరికింపుఁడు :

"సీ. ధర్మార్థ కామసాధన కుపకరణంబు,
గృహనీతివిద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయ,
స్థితికి మూలంబు సద్గతికి నూఁత

గౌరవంబున కేకకారణం బున్నతి,
స్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ,
చూవె భర్తకు నొండ్లు గావు ప్రియము
ఆ. లెట్టిఘట్టములను నెట్టియాపదలను
నెట్టికీడులను. ముట్టఁబడిన
వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను,
నొనరఁ జూడఁగనిన జనుల కెందు."

(ఆదిపర్వము, చతుర్థాశ్వాసము. పద్యము 81)

తమ సంగిణులశక్తికతననే త్రిమూర్తులు తమతమ యుద్యోగములను నెఱపుచున్నారని తాత్త్వికులనుచుందురు.*

రేఁబవళ్లు కలిసినగాని దినము కాదు. రవిలేని పగలు కారుమబ్బునోటి కబళ మగును. రాజులేని రాత్రి [illegible] హృదయమట్లు బీతుఁగొలుపును. రవి రాజులకలసినే, దినానిశులు అనంతకాలపథమున దిర్దిరఁ దిరిగిపోవుచున్నవి. వీని పొందు వీనికి గమనిక నొసఁగును. వీనిగమనిక వీనియాత్ర. స్త్రీ

---

* "The three qualities of the one Supreme are developed into three distinct personalities. And each of the latter is said to function through its own respective *Sakti* or energy, and so we have answering to *Brahma*, *Vishnu* and *Siva*, Uma, Saraswati, Lakshmi, and their *Saktis*,' (Vide Sir S. Radhakrishnan's "The Heart of Hinduism" P. 3.)

పురుషుల పొందు వారికి గమనిక నిచ్చును. పురోభివృద్ధి దెస వీరు నలుపుయాత్రయే ఈగమనిక. వీరి దీర్ఘయాత్రయందు మొలకలెత్తిన ఆశయాంకురములు వీరి జీవనకేదారమునకు సింగారమును, రంగారు బంగారువన్నెను చేకూర్చును; వీరి భావిజీవనమును గంధబంధుర భావములకు పూలకారు చేయును. సౌరభ ప్లావితమైన వీరియాత్ర ముగిసినముహూర్తమున తొలుత నేఁ దెలిపిన ఉత్తుంగకాలశిఖరమున జోడు శమంతకములట్లు వీరు వెలుగొందుదురు. *

---

* Presidential Address delivered at the Anniversary of the Andhra Students' Association of the Ramakrishna Mission, Madras in 1936.

# ప్రాచీనుల ఆశయము

సంపూర్ణ జీవనమును నడపు భావశక్తులెట్టివో యోజించియే మన ప్రాచీనులు విద్యావిధానములకు నిర్ణీత ప్రణాళికలను, పంథలను ఏర్పఱచిరి. సంపూర్ణ జీవనమున సమాన భాగధేయులు స్త్రీపురుషులని గుర్తించి, వీరివీరి యాంతరంగిక వ్యక్తిగతశక్తుల ననుసరించి వీరి క్రియాకలాపమును నిర్దిష్టము చేసిరి. వీరు వ్యక్తీకరించిన సిద్ధాంతములును, నియమములును మనుష్య మానసగ్రథనము ననుసరించి జనించినవి కాని అర్థశూన్య ప్రలాపమునుండి యుబికినవి కావు.

ఆంతరంగికదృష్టియందు సర్వతోముఖమైన మానవ సమస్యలను వారు విలోకించిరి. కావున నాఁటి వ్యక్తిగతజీవనమును, సంఘజీవనమును, జగచ్చక్షువు నెదుటఁ గాంతిలు సూనవితానమట్లు వెలసినవి.

మహితాశయబంధురజీవనమును, కళోపాసనమును నీదృష్టియందే వెలుంగును. ఈ దృష్టి దివ్యచక్షువులోనిది. దివ్యచక్షువులు కలవారే దివ్య మయూఖ సంవీక్షజీవనములఁ గడపఁగలరు; ఆదర్శకళోపాసకులు కాఁజాలుదురు ; వీరి జీవనములు దేవతలకుగూడ మేలుబంతు లగును; వీరి రచనలు భావ ప్రభాకలిత తరణికిరణములకు నొరవళ్ళగును.

పాశ్చాత్యవిద్యావిధానమున నాంతరంగికదృష్టి కల దనుట కల్ల. ఆకస మంధకారబంధురమైనయెడల, అవని యాలోకప్రదీప్తమగునా? విద్యావిధానమున వెలుఁగులేనిచో తత్ దానిపై కన్నిడు నాగరకత ఖద్యోతమండలమట్లు చూపట్టు నా? ఆత్మప్రదీపమున దివ్యతైలముపోయు అదృశ్య ఆధ్యాత్మికశక్తి యెట్టిదయో ప్రతీచీఖండవాసు లెఱుఁగరు. ఈ జ్యోతి నందని విద్యయును, జీవనవిధానమును పైపై మెఱుంగులు కలిగినవైన నేమి, బాహ్యసృష్టిని ప్రదర్శించునవైన నేమి, ఆత్మశక్తి లేనివై కంకాళసన్నిభము లగును. నేఁటి పాశ్చాత్యుల ఉద్గ్రంథపత్రములును, జీవనవిధానాంశములును కళాసౌందర్యరహితములై యున్నవి. కారణము? వా రాత్మ బృందావనద్వారమును బంధించివేసి, మేఘశిఖరమున కుప్పె గంతు లేయుచుండుటే! ఆత్మజ్యోతిసముద్భవ యాలోకసూత్రములు పంక్తివితానమైనపుడే మనుష్యరచనలు సచ్ఛిదానంద సమన్వితములై అనంతకాలము వెలయును. ఈజ్యోతిమరీచులే ఉత్తమజీవనమునకు చలనప్రాణము లిచ్చు భావశక్తు లగును.

విద్యావిధాన జీవితవిధానముల కలయికయే కదా నాగరకత! నేఁటి పాశ్చాత్య సభ్యతను పరికింపుఁడు. అందు భావవిభూతి పాలిక్కి; సౌందర్యద్యుతి సున్న. ఆకసము నంటు మేడలను, మిద్దెలను అది నిర్మించినది. ఫిరంగులను తయారొనరించినది; విషవాయువులను ప్రయోగించినది. అపూర్వ ఆగ్నేయాస్త్రములను సిద్ధ మొనరించినది. ప్రపంచముచుట్టు తన బాహువులు పెనవేసియుంచినది. రాశిరాసు

లుగ, ధనమును ప్రోగొనరించినది; ఈరాసులను గొల బోయునది స్వార్థము. ఈరాసులనుండియే ఇపుడు గుండు దెబ్బలు వెడలుచున్నవి! వీనిని గుండెలం దిముడ్చుకొనిన సౌధములు పెటిల్లుమనుచున్నవి! బాహ్యాంతరంగిక వాతా వరణము విషవాయువులతో కారుపొగలతో నిండియున్నది. ఈ విడ్డూరపునాగరకత తన్ను చూచి తానులికిపడుటలేదా ?

ప్రాణములు లేనివానిని కట్టెయందుము. అందలి దీప మారిపోయినది కావున దానికి చీమలుపట్టును. ఎంత యంద మైన శవమైననేమి, అచిరములో చితి నెక్కకున్న దుర్గంధ మును గ్రక్కదా ? ఆత్మజ్యోతిలేని విద్యావిధానము సహజ కవచకుండలముల నెఱుఁగనిదై, అబద్ధపు భుజకీర్తులు తగి లించుకొని రచ్చపై చూపట్టిననేమి ? ఆయువులేనిదై అది దుర్గంధమును వెలారింపదా ?

అధునాతన మనుష్య జీవితవిధానమున మేలుబంతి యగుచున్నది పాశ్చాత్యనాగరకతయే! అర్వాచీన విద్యా విధానమున నొరవడియగుచున్నది పాశ్చాత్య పద్ధతియే! శక్తి యెందున్నదో అధికారమును అందేయున్నది. రాజకీయ మైన స్వరాజ్యముమాట దేవుఁడెఱుఁగును; మనమిపు డాంత రంగికమైన స్వరాజ్యమును కోలుపడుచుంటిమి. పృథ్వీజాతు లన్నియు దానిని గోల్పోయినను, సహస్రాబ్దులనుండి దాని నారాధించుటకు ప్రత్యేకశక్తిఁ గలవార మని గణుతినందిన మనమే దాని నిపుడు పోగొట్టుకొనుచుంట అరిష్టకరము.

ఆచార్యులవారే కల్లుముంతను చేఁబట్టినయెడల, నిక నంతేవాసుల పునరుద్ధరణ మెందుండి యుబుకును? మనయాత్మదినమణిపై పొగమంచును చేరనిచ్చి, మన వ్యక్తిత్వమును, మన స్వాతంత్ర్యభావమును మనమహత్త్వమును మడియించి, మొగవాంచి, వక్రనాగరకత పలుకుదానికి 'భళాభళి' యనుచుంటిమి. ఈపలుకు ఆత్మకుంజమునుండి వెడలుతీయని రాగంపు తీవగాక, భుగుల్భుగ్గుమను స్వార్థమునుండి ఇంజను కూఁతవలె వెలువడు విశృంఖలశబ్దమని మన మింకను గ్రహింపఁజాలకున్నాము.

పునరుద్ధరణము నపేక్షించితిమేని, మన సంప్రదాయములందు మహత్తరములైనవానిని జనము పూడ్చిపెట్టిన గోరీలనుండి లేవనెత్తవలెను. సంప్రదాయమనినను, ప్రాచీన ప్రథయనినను, కనులెఱ్ఱజేసి కొరడాయెత్తువారు నేఁడనేకులు కలరు. ఒక భావమునుగాని, ఆచారమునుగాని పరిగ్రహించుటకుగాని, పరిత్యజించుటకుగాని మనదృష్టి నాకర్షింపవలసినది అందలి గుణమే! యుగములు గడచినను, చీకిపోని దృశ్యములును, భావములును కొన్ని గలవు; నేఁడే పుట్టినను పరదినమందే పరమపదించునవి కొన్ని కలవు. చంద్రతారార్కుల వెలుఁగులు సృష్ట్యాదినుండియున్నవని, నేఁడు ప్రాతబడినవా? యుగయుగములనుండి సుమహృదయమును ప్రాపుచేసికొని యుండు సౌందర్యమాధుర్యసౌరభములు నేఁడు కూడని వగునా? నాఁటివలె నేఁడును ఇవి క్రొత్తలు గావా? ప్రాచీనకాలమున నెపుడో వెలసిన మహాపురుషులును, విదుషీమణు-

లును నేఁడును రేపునుకూడ ప్రాజనీయులైయుండరా? గుణ విమర్శన మొనరింపక నాఁటిది, నేఁటిదను నంశమునుమాత్రము గ్రుడ్డిహేతుగ గణించుటచే మనలో పల్వురు చిరసందీప్తము లైన మానికములను పారబోసి, స్ఫటికస్ఫూడు తయారగు మసిబుఁగ్గుల నోడియందుఁ జేర్చుకొనుచున్నారు. ఈ దురిష్టమునకు కారణము మన విజ్ఞానమునుండి మనము దూరముగ తొలఁగిపోవుటే.

మన విద్యావిధానమున సుహత్తరమైన భారతవిజ్ఞానమునకు తావులేదు. దీనినిగుఱించి సత్యకథనము తెలుపుపట్లు, అందు తలసూపు లోపములపై మేలిముసుఁగు వేసి, అబద్ధపు కావ్యములోనికి లంఘించుట కిష్టపడను. దీని వేరుపురుగు పట్టణమందేకాక పల్లెయందుఁ గూడనున్నది. దీనియందలి లోపములు గోచరించినపుడు దీనికి జేగంట కట్టుటకు సమ్మతింపను. ఆదర్శగురువువలననే ఆదర్శవిద్య చేకూరుననియు, మనుష్య చరిత్రయందలి తొలియక్కరమును దిద్దించు నాచార్యుఁడే జీవనదిగ్వలయమున పదంపడి తోఁచు దృశ్యములకు—అవి రంగారు బంగారు రేకల యల్లికమైనను, కారుమబ్బుల దొంతరమైనను— ఉత్తరవాదియగుననియు తెలుపుట నా కర్తవ్యము. ఏవేళనైన దిగ్వలయరూపము పరికించి, నాఁటిపవలు చిఱుతప్రాయ మెట్టిదైయుండెనో, దానిపై సూఱుములు గురిసినవో, కనకమయూఖలు తళ్కొత్తినవో తెలుపలేమా?

అన్యసీమలందలి మనీషులు ప్రాచీసాహితికి అంజలి ఘటించుచున్నను, దానిని మనము త్రోసి రాజనుచున్నాము. ఈ సాహితికి గ్రంథకర్త జగదీశుఁడైయుండును. లేకున్న జగదీశునందు, అద్భుతప్రజ్ఞను సంపాదించిన మునిపుంగవులు దీని రచయితలైయుందురు. ఈ సాహితి మనకు నేఁడు బోధ పడుట లేదనిన, తప్పు మనయదికాని మన సాహితిదికాదు. నింగిచుక్కలు మనచేతి మల్లెలు కాలేదని వానిని తిట్టిపోయుటేల? చుక్కలను దృష్టియందిడికొని ధ్రువప్రభృతులు ఉన్నతాశయములంది, చుక్కలందు స్థిరవాస మేర్పఱచుకొనిరి. హృదయపూర్వకమైన కాంక్షను దృఢయత్నము కలిసినపుడే మనుజుఁడు ఉన్నతమై, ధ్రువమైన చోటు సందఁగొనును. చుక్కలే ఈతనికడకు దిగివచ్చినయెడల, ముక్కిపోయిన నూకలని వాని నాతఁడు కోళ్లముందు విసరినను, విసరును. మన ప్రాచీనవిజ్ఞానమందలి భావములు * నక్షత్రములు వోలు నవి. వీని నందవలయు ప్రజ్ఞను సంపాదింపక, పిన్నముద్దులై ఇవి యంగిలిఁబడునని ఆశపడుట వెఱ్ఱితనము. అవి యొగ్గి పడలేదని మన కవి యుపయోగింపనివై యున్నవిగాన, నిరర్థకములేయని వానిదెస పెడమొగము పెట్టుట అవివేకము.

* మణిపేటికలవలె ప్రాచీనవిజ్ఞానాంశములను తము వ్యాపియందు లం దిడికొనిన మన మతగ్రంథములను గుఱించి కవీంద్రుఁడు రవీంద్రుఁ డేమి వచించెనో గమనింపుఁడు: "To us the great religious scriptures of India are of living importance, and we cannot help thinking that they lose their significance when exhibited in labelled cases—mummied specimens of human thought and aspiration, preserved for all time in the wrappings of erudition."

మాఱవలసినది సాధారణముగ పఠితయేయయ్యు, బిఱ్ఱ బిగిసిన మనసుతో గట్టిపడియుండి, పఠనీయ గ్రంథము బోధపడదనియో బాగులేదనియో ఈతఁడు పలుకును. తమలోపము నెదుటిరచనముతలకుఁ గట్టుట మనుష్యులందు గోచరించు సాధారణదృశ్యమే. భాషాతత్త్వమును, భావతత్త్వమును ఎఱిఁగిన వారికి మార్పులను, చేర్పులను, తగ్గింపులను, సవరణలను ఉపదేశించుట మూఢునకు కూడివచ్చునేమోకాని విజ్ఞానికి కాదు. కడుపులో సరుకులేని యొకనికి చక్కని సాహితీపత్రము మొండిగోడవలె నుండును. ఈతని మొద్దుమనసునకు సరిపడునట్లు ఎదుటిపత్రమును మరమ్మతు చేయవలెను. మరమ్మతునకును, మనుష్య సంస్కరణమునకును గూడని కొన్నివస్తువులను షేక్స్పియరు ఉల్లేఖించినాఁడు. ఉలి, బాడితలను చేతఁ బుచ్చుకొని తాజ్ మహాలును చక్కఁగ చిత్రిక పట్టెద నను వాఁడు మనుష్యుఁడుగాక రక్కసి యనిపించుకొనును. ఆదర్శ రచయితల వాక్కులు బోధపడలే దని వానిపై దిద్దుఁబాట్లు పేర్చువాఁడును ఇట్టి రక్కసియే! వెలుఁగులు వెలారించు ఆశయమును నేల కీడ్చి చెఱుపఁదలఁచుటకంటె నింగిదెస నగ్రేసరుఁడై పఠిత యొకఁడు నక్షత్రాక్షరమండిత విహాయసపత్రమును పఠింపఁగలిగెనేని, తద్గ్రంథకర్తహృదయమందలి భావభువనములను తనివార, మనసార గ్రహించి తన్మయత్వము చేయఁడా? ఆదర్శసాహితీసేవకులను గుర్తింపఁగల జనసామాన్య మున్నపుడే వారిజీవనము సార్థక మగును. వారి రచనలు అడవిఁ గాచిన వెన్నెలలు కాక రమ్యారామమందలి చంద్రిక

లట్లు శోభిల్లును. జగదీశుని చేరుటకు భక్తుఁడును, భక్తుని చేరుటకు జగదీశుఁడును అనవరతము తపసుచేయులీల, పాఠకుని చేరుటకు గ్రంథకర్తయు, గ్రంథకర్తను చేరుటకు పాఠకుఁడును పాటుపడవలెను. భక్తుని, దేవుని గలిగిన దివ్య బృందావనమట్లు పఠిత రచయితల నొక్కచోట నొక్క భావమున, నొక్క హృదయమున నిడికొనఁగల సాహితి అద్భుతమైయుండును. గ్రంథమును కనిన మనసును, గ్రంథమును గ్రహించుమనసును ఒకదాని కొకటి దుసూహ్యమైన, నవి యున్ననేమి లేకున్న నేమి ? ఈ యాశయమును, దృష్టి నిడికొని మన ప్రాచీనమనీషులు ఉద్గ్రంథములు స్మష్టించినను, తగిన అక్షరాభ్యాసము నెఱుఁగక వాని సత్తువను గ్రహింపలేకున్నాము.

రచయితస్థాన మున్నతమైన దని ఒప్పుకొనక తప్పదు. విమర్శకుఁడును ఉన్నతస్థాన మందియే ఆతనిని విమర్శింపవలెను. సాధనకు ముందు, విమర్శించు చదువరులకు గ్రంథకర్త యందఁడు. ఇట్టివారిని జేర నాతఁడు (భక్తులు కానివారిని జగదీశుఁడు చేరనట్లు)ఆతురతపడఁడు. తానును తన రచనలును దూషణలకు గుఱియైనను, ధూళియణువులతోఁ గలసిమెలసి వర్తించుటకై అతఁడు తనయున్నతస్థానముననుండి కూలిపడఁడు.

ఆదర్శగ్రంథకర్త తన రచనమును తాను దిద్దుకొనఁజాలఁడు. ఏభావమున కాభావము తన భాషాంబరమును తానల్లుకొనును.సాలిపురుగువ్యక్తీకరణముసాలినేఁతలో నుండును.

పట్టుపురుగున వ్యక్తీకరణము పట్టుదారములుగా నుండును. ఈ దారములను, ఆ నేతను ఒకదాని కొకటిగ మార్చుటకును, వీనియం దేమయిన సవరణలు చేయుటకును, ఒరుల కసాధ్యమైనట్లే ఈ రెండుతీరుల పురుగులకును నసాధ్యము. ప్రకృతిని మార్చుట ఎవరియబ్బతరము? ఒక గ్రంథకర్తకు సహజమై అతని మనసుననుండి తనంతట దాను అల్లుకొను రచనమును మార్చుటమాత్ర మెవ్వరితరము? "శైలి, మానసికమైన" దని డీక్వెన్సియును "శైలి, వ్యక్తి" యని న్యూమేనుమసిపియును, ఏల వాకొనిరి? షేక్స్పియరు కాళిదాసు రచనలను చెరిపి, అందలి విషయములను వేరుమాటలందు చెప్పి, షేక్స్పియరు కాళిదాసుల మని విర్రవీగగలవా రున్నారా? విజ్ఞానమునకు పెన్నిధానమైన ప్రాచీన సాహిత్యమునకు వేరు రూపును తేగలవా రెవరు? దాని కన్యరచనమును నిర్దిష్టము చేయగలవా రెవరు?

నేడు మనము పతితులమైయుంటిమి గనుక, శుక్ర తారవలె వెలుగు మన ప్రాచీనవిజ్ఞానమును గుర్తింప లేకున్నాము. మన మనసులు క్రమోన్నతి నందిననాడు (చకోరములు చంద్రకిరణములను బడయునట్లు) మన విజ్ఞానాలోకమును మన మందఁజాలుదుము.

మన ప్రాచీనవిజ్ఞానము మహోదధివంటిది. దీనికి కట్టలు లేవు. దీని గభీరత్వము అద్భుతమైనది. ఇది యనంతమైనది. సర్వకాలములయందును నుండునది. గంభీరసింధు

నినదమువలె వేదశబ్దోచ్చారణము భావగర్భిత మైయుండును. ఆమ్నాయవాక్యాలు బోధపడనితజినికూడ, వాని యుచ్చారణ ందలి గంభీరత్వము తనంతట దాను శ్రోతలహృదయ దేవాలయముc జొచ్చి, దివ్యశంఖారవమట్లు అందు ప్రతిధ్వని సలుపును! ఈ ధ్వనితరంగములు అంతరంగమున మహోన్నతభావములను, అద్భుతానందోత్సాహములను ఉప్పొంగించును. వేదాధ్యయనమున స్వరనియమము పాటించుట విధి. మనోవాక్కాయములకు సంబంధ మున్నట్లు, భావమునకును, భాషకును, ఉచ్చారణమునకును అవినాభావసంబంధ ముండును. ఈసంబంధమును వ్యక్తీకరింపcగల సాహిత్యమే ఉత్తమసాహిత్యము. అనంతసాగరగీతమును విని ఆనందించునట్లు నేcడు మనము నిగమస్వరమును విని ఆనందింపవలసినదే. కాలక్రమమునయైనను నేcటి విద్యావిధానము అనుకూల పరివర్తన మంది, రత్నమయమైన మన విజ్ఞానరత్నాకరమున మున్కవేయుశక్తిని ప్రజల కొసcగవలెను. సంస్కృతము నేcడు "చచ్చినభాష" యైనది. దీనితో మన విజ్ఞానమునకు మనము చచ్చినవార మైతిమి. నూతనసంజీవి నంది, నవజీవనసందీప్తహృదయుల మైననాcడు తీరముగాని మన విజ్ఞానమందుటకు అద్భుతమైన అక్షరాభ్యాస మహోత్సవమును నెఱపుకొందుము. ఈ మహోత్సవసమయమున సమ్ముఖస్థపూజాపీఠమున వెలయు మహత్తర ప్రాచీనాశయము మన చేతి పూలచెండుల నందcగలదు.

# క్రమ నిష్ఠ

హక్కులును, బాధ్యతలును (Rights and Duties) అవినాభావసంబంధము కలవి. వీనిదెస పెడమొగము పెట్టి, వానిని పిడికిటఁ బట్టుట ఎవ్వరికిని సాధ్యము కాదు. బాధ్యతలకు బలాదూరని, హక్కుల నక్కునఁ జేర్చుకొనఁజూచు వారు ధర్మప్రవర్తనమునకు లాతివారై యుందురు.

ప్రస్తుత భారతపరిస్థితులు అధోగతిపాలైయున్నవి. అవ్వలినుండి దాడి వెడలు దురాచారములకు మనయిండ్ల యందు రేకెత్తు అత్యాచారములు భుజము లొడ్డుచున్నవి. దుర్గతియందు కూలఁబడు దేశమును లేవనెత్తుటకు స్త్రీ పురుషులబాధ్యత సమమైయున్నది. ఈ బాధ్యత నివ్వటిల్లిననాఁడు ప్రస్ఫుటితకుసుమములట్లు హక్కులానందముఁగూర్చుచు మన చేతులఁ జిక్కును. ఈ బాధ్యతను నిర్వహించుట పవిత్రమైన సేవాధర్మమును పాలించుట.

అధునాతనయుగమునందు సేవాధర్మము విశేషప్రశస్తి నందినది. వ్యక్తిగతవృద్ధియందుకంటె మానవసంఘాభివృద్ధి యందే ఉత్తమాశయసిద్ధిని గాంచనగునని గెటే (Goethe) కవి పలికిననాఁటనుండి ప్రతీచీఖండమున నీ యాశయము అధికాదరము నందినది. ఈ యాశయము ప్రాచీనయుగమునకు క్రొత్తది

కాదు. గోటికవిపల్కులు పల్వూర హృదయతంత్రులను మీటి భావసుధావర్షమును గురియించినవి. లోకమాన్య తిలక్ ఈ భావమును విశేషముగ మనన మొనరించినాడు. గీతకు భాష్యము వ్రాయుచు, ఆయుద్గ్రంథమున నుల్లేఖింపఁబడిన నిత్య కర్మవిధానమునకు సేవాధర్మ మని అర్థము చెప్పినాఁడు. తిలక్ కేసరి. ఇతఁడుసాహసమునకు రెండవపేరు; స్వాతంత్ర్యమునకు మాఱుపేరు. సేవాధర్మమును నెఱపుపట్ల మాండలే చెఱసాల యందు నాతేండ్లు బంధితుఁడై గీతకు భాష్యము వ్రాయుట కీతఁడు కలమును పట్టినాఁడు. అర్ధాంగిని కోల్పోయి విషాద యోగమునఁగూలఁబడక కర్తవ్యముపై కలము సాగించినాఁడు. గీతలోని ఒక్కొక శబ్దమున కేడునూఱు లర్థములు చెప్పఁ జాలుదు నని ప్రజ్ఞానిధియగు పూరీ శంకరాచార్యు లనినాఁడు. మూలగ్రంథము బహుళభావశాఖలుకల సంస్కృతమైనపుడు, —అందును, గ్రంథములకు రాజైన గ్రంథ మైనపుడు, లోక మాన్యనిబోలు అద్వితీయ పండితుఁడు భాష్యకారుఁడై నపుడు మినుకులీనుతలఁపు లెన్నెన్ని సభ్యప్రపంచమున నుద యింపవు!! తిలక్ వాక్కులు విని ఎందఱెందఱు దేశసేవకు లును, దేశసేవికలును ముందంజవేయలేదు? సేవను భారతీ యులకు తారకమునుచేసిన తొలుతటి ఉపదేశకర్త లోక మాన్యుఁడు కాక మఱెవ్వరు?

సేవాధర్మమును గుర్తించుటకు తోడుపడు విజ్ఞానమును ప్రతీచీనాగరకత యొసఁగునంతదనుక అది యాదరణీయమైనది. దీనికిమించి అందు నేఁడు గోచరించు విచ్చలవిడినడవడి, ధనా

రాధనము, స్వార్థకాంక్ష మనలను చేరరాదు. ప్రతిచీ భూవల యమునందు నెగయు విషవాయువులును, తుపాకిపొగలును, దుర్వృత్తులును, దురాచారములును మనదరిఁ జేరరాదు. ఇట్లని నేఁటి యువకులకును, యువతీమణులకును మఱిమఱి చెప్పుట అవసరము. అభివృద్ధి నందఁగల మని పాశ్చాత్యజీవనవిధాన మును సంపూర్ణముగ ననుకరింప వీ రాతురతపడుచున్నారు. మృష్టాన్న మని భ్రమసి, విషాన్నము నొక కబళముగ దిగ మ్రింగవలె నని మక్కువపడుచున్నారు. పాలనుండి అంచవలె నీటిని వేఱుచేయు టెఱుఁగక అంతయు దుగ్ధమని వీ రపోహ పడుచున్నారు. దురదృష్టవశాత్తూ, పాశ్చాత్యులయందలి మేళ్ల దెస కన్నెత్తక, వారి దోసగులదెస (అవి దోసఁగులని గుర్తిం పక) దృష్టిపాఱించి, తమ జీవనముల కవి యొరవళ్లు కావలె నని ఆశపడుచున్నారు. ఆప్పవాల్పక చూచి, ప్రతీచీసభ్యత యందలి ఉచితాంశములనే కైకొనుఁ డని తెలుపుతఱి దురభి ప్రాయమునకు చోటిచ్చి, "మా స్వాతంత్ర్యమునకు, మా సమత్వభావమునకు, మా పురోభివృద్ధికి, మాయుత్థాన మునకు అడ్డుగట్టులు నిలుపు క్రూరు" లని ఎదుటివారిని దూషించుచున్నారు. పాశ్చాత్య నాగరకతమీఁది వీరి వ్యా మోహము అధిక మగుకొలఁదియు పూర్వసభ్యతదెసఁగల వీరి దృష్టి మందగించుచున్నది. ఒడుదొడుకు పరుగులాటను సంస్కరణ మనియు, అభివృద్ధిపథమందలి సమధికగమన మనియు యోజించుచు, సనాతనధర్మముపై కస్సుబుస్సులను, కాఱుకూఁతలను ప్రయోగించుచున్నారు. సనాతనులమని

పేరుపెట్టుకొను కొందఱు దురాచారములను రేకెత్తించు (అపరాధమును కేవలము వారిమీఁకే కట్టరాదు) చున్నారని, సనాతనమతమంతయు పెంటపోగని దానినితుడిచివేసి, పాశ్చాత్య సభ్యతనుండి ఇంతరొట్టెఁ దెచ్చి, క్రొత్తపందళ్లకుఁ గట్టి, అందు మేళము సాగింపవలెనని వీ రభిప్రాయపడుచున్నారు. ఒకపరి ప్రతీచీసీమల కరిగి, వీ రచటి మనీషుల పుస్తకభాండాగారములను తెఱచిచేసి, ప్రాచీనభారతవిజ్ఞానమును వ్యక్తపఱచు మహాగ్రంథములందు కొల్లలుగ నున్నవనియు, దివ్యాదర్శములకై తపించు నచటిమహాశయులు భారతసీమదెసకే దృష్టి సారించుచున్నా రనియు, వీరు గుర్తింపకపోరు. ఉత్తమాశయఖని యైన సనాతనమతమునెడల, —అద్భుతభావ విలసితమైన ప్రాచీనవిజ్ఞానముపట్ల పొడసూపు జుగుప్స అచిరములో తుదముట్టినఁగాని, ఘోరవిధ్వంసముననుండి భారత నాగరకత విడివడ నేరదు. అంధానుకరణమునకు సెలు వదలినఁ గాని మన యువకులును, యువతులును అభివృద్ధిని కనఁజాలరు.

మహత్తర సేవాధర్మమును నెఱపుపట్ల స్త్రీకిఁ గల శక్తి పురుషునకు లేదు. కళోపాసనమున స్త్రీకి సహజసామర్థ్య మున్నట్లు, సేవాజీవనమున నామెకు సహజశక్తి కలదు. కారణము? కళకును సేవకును వలసినది హృదయసంపద యగుటయే.

స్త్రీహృదయము నందనము. అందు పుష్పించు సుందరాశయములు ముండ్లులేని గులాబులు. స్వార్థమునకుఁగాని,

దుర్భావమునకుఁగాని అందు చోటులేదు. దయనీయమైనదృశ్య మునుచూచి, కష్టభూయిష్ఠమైన సంఘటనమును కాంచి,కనుల నీరు నించని స్త్రీ లేదు. సెగలు పొగలను చిమ్ముచుండ, అగ్ని ప్రవేశమొనరించి నిప్పులనుచారుపల్లవములు చేయఁగలుగునది స్త్రీ! ప్రాణరక్షణమునకును, మానసంరక్షణమునకును, ఆత్మ బలిదానముచేయ ముందుల కుఱుకునది స్త్రీ!! ఎదుటివ్యక్తి సుడిగుండమున మునుఁగుచుండ తనగతి ఏమగునో యని యోజించి, చేయి అందించుట కూడునో కూడదో యని పురుషుఁడు వితర్కించునేమో కాని స్త్రీ కాదు. ఈమె దేవీ వ్రతము సల్పుచుండును. సేవాధర్మ నిర్వహణమందును, త్యాగజీవనమందును స్త్రీ ఆదిపీఠము నధిష్ఠించియున్నది. అగ్ర స్థానమున నాసీనమైయున్నది. దేశచరిత్రలను, సాహితీవ్యాఖ్యానములను, ధర్మగ్రంథములను, ప్రత్యక్షప్రపంచమహాగ్రంథమును పరికింపుఁడు, ఎన్నేని దృష్టాంతములను పొడఁగాంతురు.

సేవాధర్మము భారతధర్మము.ఈధర్మమును హృదయంగమ మొనరించుకొనవలయు ముహూర్తము నేఁడు మనకట్టెదుట నిలిచియున్నది.నేఁడు భారతీయులమందఱమును జాత్యుద్ధరణముకొఱకు,స్వరాజ్యసిద్ధికిఆతురతపడుచున్నాము.ఈస్వరాజ్యమును,—ఈయుద్ధరణమును, రెండుతీఱులు గలవి. బాహ్యస్వరాజ్యమున ఆర్థికోన్నతియున్నది.ఆంతరంగికస్వరాజ్యమున ఆత్మోన్నతి—ఆధ్యాత్మికోన్నతి యున్నది. భారతదేశ మొక పెద్దపల్లెకదా! ఈపల్లెకు నేఁడవసరమైయున్నది బాహ్యస్వరాజ్యము. భారతభూమియందు నేఁడును అద్భుతప్రాచీనసభ్యతా

ఘుని అడుగంటలేదు. దండయాత్రలు నెగ్గినవి,నీల్గినవి. శతాబ్దులును,సహస్రాబ్దులును పర్వున నేతెంచినవి, రివ్వున నెగసిపోయినవి! పడమటితొట్టెలందు నాగరకతలు ఊఁగినవి—ఊడినవి!! బారలు చాపుకొనినగ్రీసు నేఁ డెందున్నదో భూగోళపటమున వెదకవలెను; నోరు తెఱచుకొని దేశములను కబళింపనెంచిన రోము రొంపిలో దిగఁబడినది. సభ్యతకు కౌస్తుభము హృదయము. ప్రతీచీసభ్యతకు హృదయము లేదు, కౌస్తుభముముందే లేదు.ఇట్లని,క్రైస్తవమతమును వెక్కిరించుచు,భయదగంభీరస్వరమున ఫిరంగులు అంతర్జాతీయమహాసభలనుండి యుపన్యసించుచున్నవి.ఆఁగొనియున్నను, మలీమసమైయున్నను, భారతవిషయము నాఁడును నేఁడును భారతభూమిష్ఠమైయే యున్నది. ఈ మన్ను మనియున్నంతకాలము అద్రులు క్రుంగినను, మహత్తర భారత నాగరకత క్రుంగనేరదు. ఈ వఱలో నోరులు దండయాత్రలను బురికొల్పినట్లు, పాశ్చాత్యవాతూలమున నెగురుచుండు కొందఱు ప్రాచీసభ్యతపై మందుగుండు గుమ్మరింపనెంచుచున్నారు. చిచ్చుబుడ్డి కడుపున కలుషమునే యుంచుకొనినను,భాసమానభావముపోలు అగ్గినెరసు సోఁకినంతన,ఆకస్మికసముద్ధరణ మంది, ఐహికపునర్జన్మము (Resurrection)ను పడసి, తళుక్కులీను ఆనందరేఖల వెదచల్లుట నెఱుఁగుదుము. నేఁటి భారతాంబ నెదుర్కొను చిచ్చుబుడ్లను నట్టివే! భారత ధర్మము సనాతనమైనది. దీనికాద్యంతములు లేవు. నేనుల్లేఖించిన ఆంతరంగికస్వారాజ్య మీ ధర్మమం దున్నది. కౌస్తుభమణి కృష్ణహృదయముమీఁదనే కాంతిలును. భారతహృదయము

కృష్ణహృదయమునకు రూపాంతరము; కృషికహృదయమునకు వేఱుపేరు. కనులు దుడిచికొని, ఒకపరి, అభాగునివలెఁదోఁచు కృషికుని పరికించితిమేని, ఆతనిహృదయమున పవిత్ర భా-వ-కౌ-స్తు-భ-ము-ను పొడఁగాంతుము. కొంత దివ్యదృష్టినందితి మేని, వెఱ్ఱిగొల్లలవలెఁ దోఁచు కృషికకృష్ణులందు విశ్వరూపసందర్శనమంది, ధనంజయులము కాఁగలుగుదుమేమో! ఆంతరంగిక స్వరాజ్యమును, ఆత్మసామ్రాజ్యమును, హృదయవిభూతిని మనము మన పల్లెవాసులనుండి, మన కృషికసోదరుల నుండి అందవలెనని ఒకమాఱుకాదు, వేయిమాఱులు కంఠమెత్తి పలుకుదును. నేఁడు వీరికిఁ గావలసినది తినఁగూడు, కట్టగుడ్డ. నేఁటి స్వరాజ్యోద్యమదృష్టిలో నున్నవి ఇవియే యని నా యభిప్రాయము. మనము జరుపవలయు సేవాధర్మము ఈయభాగులపట్లనే. దరిద్రనారాయణులే కదా నేఁటి మన ప్రత్యక్షదైవతములు! వీరికి మనము సలుపుసేవయే పూజయగును. సేవాధర్మనిర్వహణమందే వ్రతోద్యాపనమును కాంతుము.

ఉన్న విద్యాధికులము గుప్పెఁడుమందిమి లేము—మన ధర్మ మెఱుఁగక మన మల్లాడుచుంట పట్టణములలో; మనము ముక్కునఁ బట్టినవి నాలుగింగ్లీషుముక్కలు. సంపూర్ణనాగరకులమని తెయ్యిమనుచు, తెగనీల్గుచు, మన సభ్యతయం దేమున్నదో గుర్తింపక దానిపై అగ్గిపుల్లలను వెలిఁగింపఁ దలపడుచున్నాము. సంస్కృతాక్షరములేమో ఎఱుఁగనిమహాశయులు సనాతనధర్మముపై, వేదములపై, నుపనిషత్తులపై తీవ్రవిమర్శలను, ఉగ్రమైన ఆర్డినెన్సులను ప్రయోగించుచున్నారు.

ఎట్లో—పడమటిగాలితాఁకుడునని యనరాదా?— చేరిన ముండ్లను విసరివేసి, మన మతమందును, మన సంప్రదాయమందును, మన నాగరకతయందును, దివ్యసౌరభమును చిమ్మునవస్రోవులను గుర్తించితిమేని, మన మాంతరంగికోద్ధరణమును, ఆత్మసామ్రాజ్యమును అందఁగలము.

ఈ యాంతరంగికోద్ధరణము నందిననాఁడే ధర్మనిర్వహణమున కక్కఱైన ఆంతరంగికప్రోత్సాహము * నందఁజాలుదుము; సేవాధర్మ, భారతధర్మ, మానవధర్మములు త్రిమూర్తులట్లు వేర్వేఱుగ మానసగోచరమయ్యు, జగదీశున స్లోక్కఁడే యని గ్రహించి వానిపాలనమున సిద్ధహస్తులము కాఁజాలుదుము.

ఇట్టి శక్తి క్రమనిష్ఠవలనఁగాని చేకుఱదు. ఎంతో తపసుచేసి కిదా సూత్మాంకురము కాలక్రమమున మహోన్నత భూమిీరుహమై, అపుడును తనయుద్దేశమును నేల విడువక చేతులనట్లు శాఖలు చాఁపి దివిదెస దృష్టినిలిపి యుండును! క్రమనిష్ఠ సగము కాలము కడచినపిదప మొదలు కాదు. దీతూ జీవనము శైశవమందే

---

* మహామేధావి రాధాకృష్ణుఁ డేమనినాఁడో విలోకింపుఁడు:

"For the perfect men the *dharma* is an inspiration from within, for others it is an external command, what custom aud public opinion demand" (Vide "The Heart of H!ndusthan" Page 33)

ఆరంభ మగును. శైశవజీవనమున తళ్కొత్తు కెంపుకాంతులే కదా కొంతకాలము గడచినంతన, విశ్వవలయమున సహస్రవసుప్రభలను విరియఁబోయఁగలవు! లేఁత తలఁపులను మానసము చిగిరించుసమయమందే మనము వ్రతపీఠములం దాసీనులము కావలెను. ఈ మహత్తరవ్రతవిధానమున, ఈక్రమనిష్ఠయందు మన కాచార్యుఁడు కాఁజాలు విద్యావిధానమే నేఁడు దృగ్గోచరము కావలెను.

## 'ఓం నమః శివాయ'

శైశవసమయమున బోధనకు తగినవ్యక్తి తల్లిగాని, కొఱడాను చేఁగొని ఎందుండియో ఊఱుకు భయంకరమూర్తి కాదు. అడలుపాటునకుఁగాక ఆదరమందును, అనురాగమందును పెంపొందు శైశవమే చక్కని సంరక్షణమందిన మొలకలీల, కాలక్రమమున నున్నతజీవనోర్వీరుహమై వెలయును. ఈ యాదరమును కుంభవృష్టిగఁ గురియించు ఘనహృదయము మాతృదేవిది గాక మఱెవ్వరిది ?

మనుష్యజీవనము ప్రేమస్పర్శ నంది ప్రేమమహత్త్వ మున పెంపొందినపుడే విజయకేతనమును చేతఁబట్టఁగలదు. ప్రేమయందే ఆశయజ్యోతులు వెలుంగును. * పురుషకారము నకు వలసిన ఉత్సాహము వీని వెలుంగునందే మెఱయుచు నుప్పొంగును. ఈప్రేమకు పెన్నిధానము తల్లి. తల్లి కడుపే ఆనంగమునకు గంగోత్తరి. ఆనందానురాగముల మధురశ్రుతి తోడైనపుడే 'ఓం నమః శివాయ' యను పవిత్రమంత్రము మంజులరవమున నుప్పొంగి శైశవమును తీపితలఁపులచే నిండించును.

---

* "Love is the ultimate meaning of everything around us. It is not a mere sentiment; it is truth; it is the joy that is at the root of all creation." (Vide Rabindra Nath Tagore's "Sadhana", Chapter on "Realisation in Love", Page 107).

మహితాదర్శములనన్నిటిని గోరుముద్దలుగఁ దినిపించు దేవి తల్లి. మహాపురుషుల సంఖ్య జనని శిక్షణ మందినవారి యందే పెద్దదై యున్నది. 'తల్లికర్తవ్యము గృహపాలనమే కాక, పృథ్వీపరిపాలనముకూడ' నని షల్కెదను. ఊయెల నూఁపుచేయియే కదా వసుమతి నూఁపును. ఇట్టిచేయి వెనుకఁ బడినపుడును, బండచేయి సాక్షాత్కరించినపుడును చెఱుపు కాక మేలు చేఁజిక్కునా? చల్లని తనచేయి తనయుని జీవనమున నానందపుష్పులు వెలారించు విశాల వియత్తలము సుమా యని కన్నతల్లి గ్రహింపవలెను. తనకర్తవ్యము గురుతరమైన దనియు, గురుగంభీరమైన దనియు నాయమ గుర్తింపవలెను. ఇట్లు గుర్తించిననాఁడు కర్తవ్యనిర్వహణమునకు వలసిన విద్య నామె యంది తీఱును. మల్లెకు మొల్ల దూరమందుండదు; తల్లికి విద్దెయు దూరమున నుండదు. తల్లికి తండ్రి తోడగుతఱి, గృహము విజ్ఞానప్రదీప్తమై, శిశువుల కాదర్శ శిక్షణాస్థలమై వెలయును. *

జనయిత్రీహృదయము సౌందర్యోపేతమైనది; మాధుర్యమయ మైనది. సౌందర్యమాధుర్యములు కలయుచోటునందే విజ్ఞానమును గలయును. ఈ త్రివేణీక్షేత్రమును మాతృహృదయమునఁ గాంచి అందు బుడుంగు మనువాఁడు ధన్యుఁ డగును.

ఆదర్శమాత, ఆదర్శగుణముల నాత్మభూషలఁ గావించు

---

* "If parents do not themselves instruct, guide, shape and discipline their children, education in any true sense becomes almost impossible" Dr. Butler.

కొనుటకై ఎంతో తపము చేయును. అంతరంగస్థ దివ్యసింహాసనమును గుఱుతించుటకే సుందరసువర్ణాలంకృత సింహాసనము నామె తన పూజాగృహమున దడికొనును. స్త్రీ అలంకారములను కాంక్షించును. లో నలంకారములు లేనివ్యక్తి అవ్వలిన గల నెఱుఁగనేయెఱుఁగదు

ఈమెను పోలువాఁడు కవి. వీనిమాటలందు కాంతిలు నగలెవ్వరివి? ఇవి కవిహృదయమున నృత్తగీతములఁ దేలుభావ సుందరి తాలుచుభూషలుకావా? మంచుమంచిముత్తెములందు ఆత్మహృదయమును కాంచి ప్రభాత ముప్పొంగునట్లు, ప్రభా కలితము లగు తన రచనలందు అలంకారశోభిత మైన నిజ హృదని విలోకించి కవీంద్రుఁడు ముదితచిత్తుఁడు కాఁడా ?

ఉద్బోధనమునకు అలంకారము ప్రధానము. ఉన్న దున్నట్లు మోటురీతి నేకరువుపెట్టు శ్రోత్రియులపల్కులకు చెవి యొగ్గువా రెందఱుందురు? చిత్రమును,అలంకారమును పుట్టువు తోడనే మానవమానసము తాలుచు కవచకుండలములు. ఇంపుసొంపులను, సొగసు సొబగులను ఎఱుఁగని భౌతిక శాస్త్రము మేధాపటుత్వమున వృద్ధి నందినవారికే గ్రాహ్య మగునుగాని, సామాన్యులకును బాలకులకును గాదు. కావు ననే తల్లియుఁ గవియు నలంకారము లందు నింపియే తమ బోధనలను చదువరుల కందించెదరు.

రామమోహనుని తత్త్వామృతమును గ్రోలిన పృథు కవీంద్రుఁడు 'విగ్రహారాధనమేల పుష్పపూజయేల?' అనును.

కాని రవికవిపల్కులు సుందరమూర్తులతోను, సుగంధసుమ ములతోడను శోభిలు విచిత్ర దేవాలయములు. విగ్రహముగల మాటనుగాని, అలంకారముగల అక్షరమునుగాని ఉపయోగించుట నిర్గుణోపాసకుఁడైన బ్రహ్మసామాజికునకు తగదనియు, మల్లుబట్టనుబోలి, సుద్దముక్కకైనట్టి నుసుపులనే ఉపయోగింపక తప్పదనియు రవికపని నిర్బంధించితిమేని, అతఁడు తన కలమును విఱుచుకొని, కన్నీటి కాల్వలందు లోఁగల కవితను పిండివైచి, తాను వట్టి యెమ్మెలప్రోవైన నగును; లేకున్న దేవేంద్రనాథునితనయుఁ డయ్యు తాను సగుణోపాసకుఁడైన హిందువు నని యొప్పుకొనినను, నొప్పుకొనును. గీతల నంజలి నిడికొనుట, అలంకారములను చేఁబూనుట కాదా ?

సౌందర్యమును, శాంతియు, చల్లఁదనమును, ఆనంద మును కైత నెలంతయందును, కన్నతల్లియందునుగూడ రాజిలు చుండుట నెఱుఁగుదుము. కవితామతల్లి ప్రకృతికి, కన్నతల్లి ప్రకృతి వేఱుకాదు. మహితభావములును, మహత్తరజీవనము లును కవిత్వమై కాలవిహాయసమున వెలుఁగొందును. ప్రతి మహావ్యక్తియు కవిత్వఖని యని నా యభిప్రాయము. రామ కృష్ణులు కవులు కాకున్న, వాల్మీకి వ్యాసుల హృదయముల నెట్లాకర్షింపఁగలరు? ప్రకృతినిచూచి కవి యేల ఉప్పొంగును? ప్రకృతియందలి భావభాగ్యము, కవిభాగ్య మగుటవలనఁ గాదా? మహితాశయ విలసిత జీవనములుకూడ కవి నలరించుటకు కారణ మవి కవికాంక్షించు నైశ్వర్యమున కాంతిలు చుంట కాదా? భగవతి సీత, ఇట్టి విభూతితో వరలి రామా

యణమును హృద్యమైన పద్యముఁ గావించివైచెను. వాల్మీకి కలమున కెంతో తేజ మొసఁగెను. పాదాంగుష్ఠమందలిచుట్టును మాత్రము గుర్తుపట్టఁజాలిన సౌమిత్రి సీతనగలను జూచి, మొఱకువలె నిలిచె ననినకవి రెండుమాటలం దెంతభావము నిమిడ్చినాఁడు! లక్ష్మణు నట్లు నిలిపి, అశ్రుసంసిక్తమైన నగలమూట నెదుటఁ బెట్టి, ఘోరాపత్కాదంబినిని దలపై మోపి, పృథ్వి నొకచేతితో కదపివైచి, — సన్నిహితబంధువైనను ఒక యోఁడుదానియెడల వర్తించు రీతిని,— స్త్రీపూజయందలి గభీరతత్త్వమును రెండవచేతితోఁగుడువఁబెట్టి ఒకపరి పాఠకుని విషాదమున ముంచినవాల్మీకితోడనే ఆతని నానందమునఁ దేలింపలేదా? ఉన్నతాశయము లెఱుఁగనితల్లి తల్లి కానట్లు ఉన్నతాశయములను చిత్రింపనిసారస్వతము సారస్వతమే కాదు. మహితగుణపూరితమంజూష కాని కవిత్వము కవిత్వమే కాదు. ఉన్నతాశయములను, గంభీరభావములను, సుందరసాహిత్యమును, మధురకవనమును గనిపెంచునది హృదయము కాని మేధ కాదు.

హిమాచలముపగిది మేదస్సుకంటె, రత్నాకరముంబోలు హృదయమే మహత్తరమైనది. గగనచుంబి మేదస్సున నిలుచు నరుఁడు గుభాలున లోఁతులోయలోఁ బడి నరకజ్వాలలను నాల్కపై రాచుకొనినను రాచుకొనును. గభీరరత్నాకరమందు మునుఁగునాతఁడు చిరవిరాజితమైన శాంతిని గని, తేజోవంతములైన భావరాసులను దోసిళ్లకొలఁది పడయఁ గలఁడు. హృదయైశ్వర్యమున స్త్రీకి పురుషుఁడు చాలఁడు.

రాగమాలికయగు స్త్రీ హృదినుండియే, — స్త్రీ హృదంగాల వ్యక్తినుండియే గుణగణములును, కవితాకళలును నుదయించును.

తల్లిచే శైశవహృత్ఫలకమున చిత్రవిచిత్రరీతులఁ జిత్రింపఁబడు తలఁపులే కాలక్రమమున స్వర్ణాక్షరములై, జీవితచారిత్రము లగును. మాతృహృదయమందలి అనురాగము, తూరుపున చిందు కెంపురాగమున కెనయైనది. అరుణకాంతిని గ్రోలి,సమధిక తేజ మంది తనశక్తిశౌర్యములచే దినలక్ష్మి దిగంతములకు మిఱుమిట్లు కొలుపుచు నగ్రసర యగునట్లు మాతృస్తన్యమున మాతృప్రేమ నందిననిసుంగు క్రమాభివృద్ధి నంది దశదిశలను దశహాయములు చేసికొను మహారథికుఁడై అనంతకాలమునఁ జరచరపోవును. జనయిత్రీ హృదయమే దుగ్ధధారలనుండియు, ప్రబోధధారలనుండియు దిగి శివాజీయందు ప్రవేశించెను. తల్లిశిక్షణమున తనరినపుడే నెపోలియను తన భావిభాగ్యమును కాంచఁగలిగెను! సద్గుణచ్ఛటాసముద్భాసితమైన కన్నతల్లి యెడఁదను పుడికిననాఁడే గాంధి, భావప్రభాకలితమైన తన భావిజీవనమును కనులారఁ గాంచఁగలిగెను !! కళకమ్మ పునఁ బుట్టియే రవీంద్రుఁడు కవీంద్రుఁ డాయెను !!! గురుగంభీరాశయములును, మహత్తర జీవనచారిత్రములును, కనదారు భావముల సీను కవిత్వములును, మిహిర తేజమును చిమ్ము సాహిత్యములును, సుధామాధుర్యమును చిలుకుగీతములును, మానవసముద్ధరణమునకు తోడ్పడు ఆనందోత్సాహములును మాతృహృదినుండియేకదా ఉప్పొంగును !

# కల్యాణగీతి

సంపూర్ణజీవితమును, ఉన్నతాశయగోష్ఠియును నేఁడు శుద్ధపూజ్యములు. కారణము? నేఁటి చదువున వీనికి తావు లేకుండుటే! నేఁ డనేకమేధావులదృష్టిలోనున్నవి మానసశరీరములే! భౌతికవృద్ధి, ఐహికోన్నతి వీరి యారాధ్యదేవతలు. ఆత్మను తలఁచి, ఆత్మశక్తిపై మనసుంచువారు వీరిలో నరుదు.

ఆత్మశక్తి (Soul force) వలనఁగాని నేఁటి ప్రపంచ పరిస్థితులు తిన్నపడవు. వ్యక్తిగతజీవనమందే కాక, విశాల మానవ జీవనాంగణమందుఁగూడ సూర్యకిరణమట్లీ శక్తి ప్రసరించిననాఁడే, దివికాంతులు చిఱుతరఁగలట్లు వసుంధరపై దృగ్గోచర మగును. దివిమర్త్యములకు చుట్టఱికము కుదురుట ఈ శక్తివలననే!! ఈ శక్తినుండియే ఈశ్వర తేజము వివిధ రూపముల నవతరించును.

ఆత్మశక్తివృద్ధికై ప్రాచీనభారతీయులు వివిధశిక్షణా విధానములను నిర్ణయించిరి. ఇది యలవడవలెనని కాంక్షించువారు దీని మహత్త్వ మెఱిఁగి దీనిపై కన్ను వేయవలెను. వేసినంతన ఇది 'నీదాన'నని తెలుపదు. పరాక్రమశాలిని వరించు రాచముద్దియవలె యోధప్రవరునిఁ జేరి అదృశ్యశమంతకమై ఆతని హృదయమం దిది విరాజిల్లును.

ఈశక్తి ద్రౌపది. ద్రుపదుఁ బుట్టి, జ్ఞానప్రదానసముద్భవయైన భారతాంతర్గ్గమున బాధలుగుడిచిన వా రెఱుఁగుదురు. శాంతిపూర్ణమును హృదయమునఁ బోయున దీశక్తి; నరుని చేతికి విజయకేతన మందించి ఆతని జీవనమునకు జయమంగళ మనున దీశక్తియే! మానసమత్స్యయంత్రమును పడఁగొట్టు నరునకే ఇది లభించును.

మత్స్యమట్లు మానసము నిలుకడలేనిది; అది యగోచరము. క్రిందిపృథ్వియందు దానినీడ చూపట్టును. మత్స్యముయొక్క నీడను, జాడను చూచియే కదా దానిని గొట్టి సవ్యసాచి ద్రౌపదిని చేఁబట్టఁజాలినాఁడు' ఈశక్తినందిన యోధుఁడు పరమార్థమును పడసినాఁడు; కావున ధనంజయుఁ డైనాఁడు. ఆధ్యాత్మికోన్నతి నందినవాఁడే మహాయోధుఁడని 'ధమ్మపదము'న బుద్ధుఁడు పలికినాఁడు. నరుఁడు ఆదర్శయోధుఁడు. శాంతికి, ఆత్మశక్తికి వేఱువేరైన సీత నందిన రాముఁడు ఆదర్శయోధుఁడు. సీత శాంతి కావుననే ఆత్మారాముని వరించినది; అశోకవనమున రామస్మరణ మొనరించినది. శోకరహితమైన హృదయమే కదా ఈశ్వరస్మరణమునకుఁ దగియుండును!

ఆదర్శవ్యక్తులందు ఆత్మశక్తి భాసమానమైనది. ఇట్టి వ్యక్తుల సంయుక్త జీవితవిధానములు ఆదర్శనాగరకతా నిర్మాణమునకు అక్కఱైన సామగ్రి.

మానస మిచ్చునది సుఖము; ఆత్మ యొసఁగునది ఆనందము. సుఖము ఐహికమైనది. ఆనంద మాధ్యాత్మికమైనది. క్షణికమైన సుఖమునకు దిగఁబడు పని మహాయోధులును, మహాయోగులును ఆనందమును కాంక్షించిరి. ఆనందమును తనివారఁ గ్రోల నుద్దేశించువా రాత్మశక్తి నందితీఱవలెను; మానసమును జయించి తీఱవలెను; దశదశలఁ బర్వెడు నింద్రియములను స్వాధీనపఱచుకొనవలెను. జీవనకురుక్షేత్రమున శరీరస్పందనమును తగురీతి నడుపవలెను.

మానసికవృద్ధికే అంజలియెత్తు నేఁటినాగరకత, — భౌతికోన్నతిపై పూలుచల్లు నేఁటి నాగరకత తన దృక్పథమును మార్చుకొనవలెను. నవజీవనము నందవలెను. ఆనందశాంతులు వసుంధరయందు గోచరింపవలె ననిన, పృథ్వీవాసులు నూతన జీవనవిధానముల ననుష్ఠింపవలెను.

వివిధాశ్రమములందు ప్రాచీనభారతీయులు క్రమానుష్ఠాన క్రమశిక్షణములకు వలసిన వ్యవస్థలు కావించిరి. నాఁటి యాశయములు నేఁడును, రేపునుకూడ ననుకరింపఁదగినవి. వెనుకటి విధానవిశదములను తూచాతప్పక నేఁడు లేవనెత్తుట సాధ్యము కాకపోవచ్చును. కాని వానికి పునాదులైన గురుగంభీర నిబంధనలు అర్వాచీనసభ్యతకు మూలబంధము లైనఁగాని, మానవజాతి పునరుద్ధరణము నందఁజాలదు వివిధాశ్రమములందుఁ దొలియాశ్రమము ప్రధానమైనది; బ్రహ్మచర్యము వ్యక్తిగతజీవనవృత్తికిని, జాతీయజీవనవృద్ధికిని, ప్రధాన

మైనది. దివ్యభావములనీను విజ్ఞానము బ్రహ్మచర్యశిక్ష నెఱపు జిజ్ఞాసువున కందఁబాటగును. సంయమజీవనమునకు శిక్షణాంగ ణము బ్రహ్మచర్యము. దీనికతన మనుష్యశక్తులు క్రమాభి వృద్ధి నందును. ఆత్మశక్తి అరచేతిపండగును; సంపూర్ణజీవనము నకు రహదారు లేర్పడును. ఇట్లని ప్రాచీననాగరకత సహస్రా బ్దులకు మున్నె రూఢిచేసినది. * విద్య (పురుషవిద్యయనుఁడు, స్త్రీవిద్యయనుఁడు) పెంపొందఁజాలుట బ్రహ్మచర్యమందే!

బ్రహ్మచర్యము ననుష్ఠించినవారు అసాధ్యములను సాధించిరి. పిడుగులు తలపైఁ బడినపుడు, గోళీలట్లు వానిని రువ్విరి. హనుమంతుఁడు కొండలను చెండులనట్లు విసరువాఁ డని వింటిమి. మహోదధులను నీటిగీఁతలట్లు దాఁటువాఁడని చెప్పుకొనుచుందుము. అసంఖ్యాకులైన రక్కసులను నిముస ములో గుండచేయువాఁడని చదువుచుందుము. బ్రహ్మచర్యము వలన కొండంతలైనపనులు గోరంతలగుననియు, మహోన్నత క్రియ లరచేతి యుసిరిక లగు ననియు నిరూపించుటకే వాల్మీకి ఈయద్భుతసంఘటనముల నుల్లేఖించినాఁడు. మహత్తర సత్య ములు పండితులకుమాత్రమే హృదయంగమ మగును కాని

---

* "At the basis of the old Aryan system was the all-important disciplin of Brahmacharya.........the foundation of the Structure they have to build, can only be the provision of a fund of force and energy sufficient to bear the demands of a continually craving activity of the memory, judgement and creative power .. ..one of the chief processes which they used for the increased storage of energy, was the practice of Bramhacharya" (vide Aurabindo Ghose's "The Brain of India" pages 18, 20, 24).

పామరులకు కాదని యెఱింగి, వ్యాసవాల్మీకులు వానికి రూపు లొసంగి, వానివి పాత్రలు చేసి, కథలందుం జొనిపి పఠితల మనశ్చక్షుస్సమక్షమున నిలిపిరి. అలంకారములు నున్నవాని నున్నట్లుగం గైకొనరాదు. ఇవి గంభీరసత్యముల నవలీలగ మానసగోచర మొనరించుటకై సృష్టింపంబడిన సాహితీ పరికరములని గుర్తించి, వీనిలోని పరమార్థమును పాఠకులు తమసొమ్ముం జేసికొనవలెను. ముగ్గినపండని మరున్నందనుండు రవివెస నెగసినాండంట! సూర్యుండు జ్ఞానమొసంగు వేలుపు. సూర్యు నుద్దేశించి, గాయత్రి జపించి భారతజిజ్ఞాసువులు జ్ఞాన మందుచు వచ్చిరి. *బ్రహ్మచారియై, సూర్యోపాసకుండై, జిజ్ఞాసు వైనవ్యక్తి కోంతియై పుట్టినను, మహావీరుండై, అపర రుద్రుం డనిపించుకొనినాండు. పావని జ్ఞానపిపాసువు కావున, జిజ్ఞాసను సూచించు కపిధ్వజమును నిర్గుణోపాసకుండై ఈశ్వరునిం జేరం గాంక్షించిన అర్జునుండు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున సామరిక చిహ్నముగం గైకొని విజయుం డైనాండు.

ముదుసలియైన తనతండ్రి కామేచ్ఛమోల నానకట్టు కట్ట సమకట్టక తాను బ్రహ్మచర్యదీక్ష వహించి, మహాజ్ఞానులం దొక్కరుండై, మహావీరుండై ముక్కంటి నోడించిన సవ్యసాచికికూడ భీష్ముం డజేయుండై నాండు. కావుననేకదా కృష్ణభగవానుండు "కుండలంబుల కాంతి గగనభాగంబు గప్పి కొనంగ," తేరునుండి "కుప్పించి యెగసి" ఆతని నెదుర్కొని

* వేదముల యంతరార్థము గాయత్రియందుం గల దని రవీంద్రు రాధా కృష్ణ లనుచుందురు.

నాఁడు! తాఁజచ్చువెరవును పాండుసుతులకుఁదెలిపి, ధర్మార్థ మీాఁదఁ డాత్మత్యాగము సలిపినాఁడు. భీష్ముఁడు అసాధారణ పురుషులందు అసాధారణపురుషుఁడు. చెప్పినది చేసిచూపువారు అసామాన్యులు. చేసి చెప్పుట అసామాన్యులలో నసామాన్యులపని. ఒకఁడు కర్మవీరుఁడైనంతనె పరిపూర్ణత్వము చేతికందిన పండుకాదు. జ్ఞానోపాసనము, భక్త్యుపాసనము కర్మయోగమునకు తోడుపడవలెను. కర్మవీరుఁడై భీష్ముఁడు రణోర్వి నలంకరించెను. అంపశయ్యమీాఁది భీష్మునివాక్కులనుండి అనంతకాలము జ్ఞానులును, భక్తులును, యోగులును, గృహస్థులును తనుపు అద్భుతసత్యములు వెడలినవి! దేవదేవుఁడైన శ్రీకృష్ణుఁడే ఈతనినుడువులను తనమానసమంజూషయందు దాఁచుకొని వానినే పదంపడి ఉద్ధవునకు ప్రసాదించి, తన భక్తునెడల నసమానమైనగౌరవమును జూపినాఁడు. దేవతలకుఁగూడ భీష్మజీవితము నోజబంతిఁజేసినది ఆతఁడు నెఱపిన బ్రహ్మచర్యనిష్ఠ గాక మఱేది? తన జీవితపరిమితిని చిత్తమువచ్చిన తెఱఁగున దీర్ఘముగావించుకొనుట కీతనికి శక్తియుండెడిది. ఈశక్తి యీతనికి కన్నకడు పొసఁగినది కాదు. మఱి ఈతని వ్రతచర్యయొసఁగినదని నాయభిప్రాయము. భారతసంయములు పల్వురీరీతి వ్రతనిష్ఠ కతననే బహువర్షములు మృత్యువును దూరముగ నెట్టివేసి ఈశ్వరసృష్టికి ప్రతివచ్చు సృష్టిసలిపి, ఈశ్వరసము లనిపించుకొనిరి.

మన ఋషిపుంగవుల మేధాశక్తి నేఁడు మనకు దురూహ్యము. మెకాలే మహాశయుఁడు, మిల్టను కవీంద్రుని గ్రంథ

ములు మఱుమాయ మైనను, వాని నన్నింటి నేకరువు పెట్టఁ జాలుదునని పలికినాఁడు. గ్లేడ్‌స్టన్ ఇలియడ్ మహాగ్రంథమును కంఠస్థము గావించుకొనినాఁడు. వీరి మేధాశక్తి అద్భుతమైనదని ఆంగ్లేయు లుబ్బుచుందురు. ప్రాచీన భారతసీమయందు బుద్ధిబలమున నిమనీషులకు తాతలును, ముత్తాతలునైనవార లసంఖ్యాకులై యుండిరి. వేదవేదాంగములను తమ కంఠములం దిముడ్చుకొని, ఒక్కగ్రుక్కలో జ్ఞానభవనములను వెలిగింపఁ జాలిన బ్రహ్మచారులు మన నేలలో వెలసిరి.

బ్రహ్మచర్యమును కొంతకాలమైన ననుష్ఠింపనివాఁడు సంయమగుణము నలవఱుచుకొనలేఁడు. మహోన్నతమై, స్వర్గపీఠము నంటుచరిత్రమునకు సంయమగుణమే కదా పునాది యగును ఈచరిత్ర మెన్నటికిని శిథిలముగాక వేలుపులనడుమ నుండు విష్ణుదేవునివలె, యుగములనడుమ భాసమాన మై యుండును. సచ్చరిత్ర నెఱుఁగని ప్రజ్ఞాధురీణు లెందఱో భీషణ మారుతోద్ధూతమగు నేకుముక్కలవలె ననంతకాలమున నెందో యెగసిపోయిరి. సచ్చరిత్ర నెఱిఁగి విశేషప్రజ్ఞ నెఱుఁగనివారు కాలవియత్తలమున చక్కనిచుక్కలై వెలుఁగొందుచున్నారు. సచ్చరిత్రుఁడుకాక, ప్రజ్ఞాశాలి యైన థెమిస్టకిల్స్ స్వీయసీమ యందు దిక్కుగానక లాతివారి నాశ్రయింపవలసివచ్చెననియు, అంతప్రజ్ఞ నెఱుఁగక, న్యాయవర్తనుఁ డని బిరుదునందిన అరిస్టిడిస్ తన దేశీయులపూజల నందె ననియు గ్రీక్ చరిత్ర తెలుపుచున్నది. ఇతిహాసములను, పురాణములను నెమకితిమేని ఇట్టి దృష్టాంతములు బహుళముగ చూపట్టును. నేఁటిగాంధి? దశ

దిశలకు మిఱుమిట్లు గొలుపుచున్న ఈతనిగురుగంభీరచరిత్రయే కదా! విద్యాదృష్టియందు జగముకన్నువలె వెలుఁగవలయున దిట్టిచరిత్రయే! మనప్రజ్ఞకు నిర్మలగుణమును తోడుచేసినవ్యక్తి తావిగలబంగారువలెనొప్పును. బహుసద్గుణములు రివ్వురివ్వున మననేలనుండి దివిభువి కెగయఁ గలుషవాతూలమందు నిష్ట విహారము సలుపుచున్నదికదా! ప్రాచీనౌన్నత్యమును పునరుద్ధరణమొనరింపవలెననిన, ప్రతిభారతీయుఁడును కొంతకాలము కఠినబ్రహ్మచర్యము ననుష్ఠింపవలెను. దీక్షాజీవి కానివాఁడు విద్యార్థి కాఁడు సరికదా మనుష్యుఁడే కాలేఁడు. ఈయుపదేశము మన యుపనయనప్రక్రియయందు నిహితమైయున్నది. మన విద్యాసంస్థలన్నియు నుపనయనవేదికలై, దీక్షాగృహములై, వ్రతమందిరములైననాఁడు మనవిద్యార్థులు బహుళశక్తుల నంది, పాండుసుతులట్లు శంఖములు పూరించి తమకర్మక్షేత్రములను ధర్మక్షేత్రములు గావించుకొని జయపతాకలను చేతులఁ బూని అష్టదిక్కులను వందమాగధులుగఁ జేసికొందురు.

పద్ధతులును, పరిస్థితులును నేఁడు పరివర్తన మందినను, భారతీయుఁడు నేఁడు పతితుఁడైయున్నను, ఈతఁడు తన ప్రకృతిని నిర్మూలముఁ గావించుకొనలేదు. నాఁటిప్రతిభ అంతఃసలిలలీల భారతహృదయమున స్రవించుచునేయున్నది. భారతమారుతము భావగర్భిత మైనది. భారతసలిలము కవితాపూరమునకు మాఱుపేరు. భారతనభమునుండి తాత్త్వికభావములు పూలవానయట్లు కురియుచుండును. భారతమృత్తికను పట్టి చూచితిమేని, పుష్యరాగములట్లుండు మహత్తరాశయములు

త్తుచుంట చూతుము. భారతావనియందలి వనస్పతులు
మహాకవి తెలిపిన green-robed senators వలెను, భావ
న తాత్త్వికులట్లును చూపట్టును. ఈ కుజముల ఛాయ
దు మనశాస్త్రములు తల్లిసీడయందలి డింభకులయట్లు
ందినవి. నేడును నైమిశారణ్యమున నెనుబదినాలుగు
మారమందలి వృక్షములు పూజింపఁబడుట నేను చూచి
మన యడవులు మనవిజ్ఞానమును తమచేతులం దిడుకొని
సముద్ధగ పెంచినవి.* భారతసీమయందలి జడములే
వసుంధరయం దింత ప్రాముఖ్యము నందియుండ, భారతో
ంతయు తత్త్వచింతచే, నాధ్యాత్మికవిభూతిచే తోలుకాడి
, ‡ భారతవాసుల మనసులు భావమణుల పేటిక లనుట
్తికాదు. కొంతకాలమునకుమున్ను చెన్నపురిలో నుపన్య
ము, మేక్ఫర్లేన్ సతి యను పాశ్చాత్యయువతి "భారతీ
భావతత్పరులు. అమెరికనులు ఆటపాటలందు సమయము
మంప భారతీయులు యోచనానిమగ్నులై యుందురు.

---

"Even in the heyday of its material prosperity, ‹art of India ever looked back with adoration the early ideal of strenuous self-realisation, and the y of the simple life of the forest hermitage, and its best inspiration from the wisdom stored there." Rabindra Nath Tagore's "Sadhana" Page 5).

"India, the motherland and eteranal mine of ‹uality is a beacon of hope to everyone in search of ‹vho is the only real Existence in a universe of ‹ing shadows."

Swamy Vivekananda.

మేధాశక్తియందు సాధారణఅమెరికావాసికంటె భారతీయుఁడే అధికుఁడని మేము విశ్వసించుచుందుము." అని పలికినది. భారతప్రకృతి సముచితకృషి నందెనేని, పెక్కు మందార ములకును, పారిజాతములకును కన్నతల్లి కాఁగలదు.

భారతప్రకృతికి అనుకూలమైన విద్యావిధానము నేఁ డింకను కలస్వప్నములందే మినుకులు చిమ్ముచున్నను, భారతీయుని ప్రాణను మీాటి మధుర మంజుల రవములు లేపు దివ్యశక్తి నేఁడింకను దృగ్గోచరము కాకున్నను, కృష్ణమేఘుని కరుణాధారకై ఆతురపాటున గళమెత్తు వానకోయిలవలె, చంద్రికావృష్టికై కుతుకనొడ్డు చకోరము చాడ్పున, మధుర ఝుంకృతిచే కుసుమసీమంతినిని లేపి ఆమె హృదగంత రాళమందలి అమృతప్రవాదమునఁ గ్రుంకులిడఁ గాంక్షించు మత్తద్విరేఫము కైవడి, కుముద్వతీశశాంకులపొందుఁ జూచి, పులకితశరీరమై ప్రాణపతి కరస్పర్శకై తపించు కమలినికరణి భారతయువ కుఁడు యశశ్చంద్రికలకై నేఁడు తన కన్గవ నొడ్డుచు, లెనిన్ కార్యతత్పరతను, రోమెయిన్‌రోలండువిజ్ఞానమహత్త్వమును, కెమెల్‌పాషా నిరుపమానధృతిని, జగుల్‌పాషా స్వాతంత్ర్య కాంక్షను, సన్‌యాట్‌సెన్ దేశభక్తిని, బెర్‌నార్డ్‌షా మేధాశక్తిని, ముసులోని యిచ్ఛాశక్తిని, హిట్లరు నిశ్చయశక్తిని, రవీంద్రుని భావనాశక్తిని, రాధాకృష్ణుని విజ్ఞానశక్తిని, గాంధి త్యాగశక్తిని అచ్చెరుపాటున విలోకించుచు, ఈ మహాపురుషు లందు తానొక్కఁడు కావలె నని మిక్కిలి మక్కువపడు చున్నాఁడు. ఈ కోరిక చక్కని విత్తనము ట్లీతని మానసకేదార

మునఁ బడియుండ, దానిని తనపు వారివాహూలాలోకములు మన నిక్షిప్తస్వస్థానమునుండి వీడవలెను. యువకుఁడు యాత్రికుఁడు. సముద్రమును కుక్షి నిడికొనిన అగస్త్యునివలె, రత్నాకరమును దగ్ధమింగవలెనని ఈతఁడు కాంక్షించును. ఈతని యుత్సాహము, ఈతనిజిజ్ఞాస నిరుపమానములు. ముందంజ వేయవలెననియే కాదు, మేఘవీథులందు విద్యుల్లతల లైగయ నీతఁ డాశించును. నేఁటిపరిస్థితుల నిజరూపములను పరికించి నంతనే, నూతనాకారములందు వానిని నిలుప యువకుఁడు మక్కువపడును. * ప్రపంచచరిత్రలను పరికింపుఁడు. నిజము కనులఁ బడును.

"ఓహో మణిపూసలారా! మాణిక్యములారా! మీరు మా భావియాశలు. మీపూనికపై స్వరాజ్యభిత్తికలు నిలువంబడును." అని యువకుల నుద్దేశించి జలదగంభీర స్వరమున నుపన్యసించు నాయకులు నేఁడు పలువురు గోచరించుచున్నారు. కాని యువకప్రజ్ఞను సముచితపథములందుఁ బాలించి, యువక సమస్యలపై చాతుర్యపుఁజూపు ప్రసరించు పెద్దలు నేఁడాకాశ కుసుమములై ఎందో వికసించుచున్నారు. తనవిద్యార్థిజీవన

---

* ఇట్టికాంక్షనే మహాకవి ఉమర్ ఖయ్యాము ఎట్లు వ్యక్తీకరించినాఁడో చూడుఁడు.

"Ah Love! Could you and I with Him conspire
To grasp this sorry scheme of Things entire.
Would not we shatter it to bits—and then
Remould it nearer to the Heart's desire?"
(Vide Fitzerald's translation of Omar's poems)

మును ముగించి, తన సర్వస్వమును తన విశ్వవిద్యాలయము నకు నైవేద్యముగ సమర్పించి, కొన్నిడిగ్రీలను తలకు చుట్టు కొని, నేఁడత్తాఁకలిచే మాఁడిచచ్చు యువకునియెడల సాను భూతి చూపు పుణ్యాత్ము లింకను ఎందో దోబూచు లాడుచు న్నారు. హరిజనసమస్యవలె యువజనసమస్య సత్వరపరిష్కా రము నందవలె నని మనమహాశయు లింకను గుర్తింపకుండుట దురదృష్టము. ఇపుడిపుడు స్త్రీప్రామనీపి ఈ సమస్యనుగుఱించి ఏమో పలుకుచున్నాఁడు. తనదృష్టియందు చిత్రకాంతులు నింపుకొని, ప్రభాకలితమైన తన గమ్యస్థానమును మహోన్నత భావికాలకుధరశిఖరముపై విలోకించి, ప్రఫుల్లహృదయుఁడై దానిని జేర నాతురతపడుచు, దుఃఖదారిద్ర్యముల నెదిరించి, ఇక్కట్టులను ప్రతిఘటించి, నేఁటియువకుఁడు విద్యార్థిజీవన మును ముగించునప్పటికి సమ్ముఖమున మరుభూమిని వీక్షించు చున్నాఁడు. విద్యుత్తువలె తళ్కొత్తిన వీని యాశయము వీని కనుల యెదుట లోఁతుగోతిలోఁ గూలఁబడినది! ఇఁక వీనిబ్రదు కేమగును? చిరకృషి బుగ్గియైనపుడు యువకునిహృదయము శ్మశానవాటికవలె భయదముకాదా? పిశాచముల ట్లందు నిరాశాదుఃఖము లిండ్లు కట్టుకొనవా?

యువకప్రజ్ఞ దేశపురోభివృద్ధికై, మానవాభివృద్ధికై తోడ్పడవలె ననిన, నాగరకత నేఁటితో నంతరింపక రేపును బ్రదికి యుండవలె ననిన, మనుష్యసంఘ మచిరములో నుష్ణ కుండమునఁ గూలఁబడరాదనిన, భావికాలము కారుమబ్బుచే, కటికిచీఁకటిచే కళంకితము కాఁగూడదనిన జగత్కల్యాణనిర్మాత

కాంజాలు యువకునిర్మష్టియందలి భాస్వరాశ తున్కతున్కలై రాలకుండుటకై తగురక్షణ వ్యవస్థ తలసూపవలెను. ఈరక్షణ వ్యవస్థ నేటి విశ్వవిద్యాలయముల పురోభాగమందే పొడ సూపవలెను. విశ్వకళాపరిషత్తులలోని శిక్షణము * బహుళ ప్రయోజనగర్భిత మని యెఱింగి, దానిపై కన్నుంచినయువకు నకు చేయూత నిచ్చి, భావిభారత భాగ్యమునకై వాని జీవన మున రంగారు బంగారుపైరును పండింప నాతురతపడుచు మన నాయకులు ముందంజ వేయవలెను. భావమననమునకు ఆదర్శ స్థానములగు 'శాంతినికేతనము'లును, భావానుష్ఠానమునకు గురుతరదృష్టాంతము లగు'(శ్రీ) నికేతనము'లును, సమస్తవిశ్వ మునకు నాత్మ హృదయములందు స్వాగత మొసఁగు విశ్వ భారతీసంస్థలును,బహుళములై,రవీంద్రునింబోలు నాచార్యులు పల్వురై, భారతావనిం దోఁచిననాఁడు, భారతవిద్యార్థు లాత్మ శక్తి నారాధించుదీక్షాపరులై, ప్రజ్ఞాధురీణులై, ప్రతిభా శాలులై, అపూర్వకల్యాణగీతి నాలపించుకవీంద్రులై అవని తలము నేలు మహాపురుషులై వెలయుదురు.

---

* "University training aims at raising the intellectual tone of society, at cultivating the public mind, at purifying the national taste, at supplying true principles to popular enthusiasm, and fixed aims to popular aspirations, at giving enlargement and sobriety to the ideas of the age, at facilitating the exercise of political power and refining the intercourse of private life."

Cardinal Newman

# పరంజ్యోతి

భావము ఆత్మ! భావము సారథి! నరుని నడపు ఆధ్యాత్మికశక్తి భావము! తురగముల నంటి సారథిచేతులం దిముడు కళ్లెము చిత్తము! ఇంద్రియములు విచిత్రహయములు—ఈ హుమాయులందు పొందు హుళిక్కి. రథికునకు ప్రాగు భావము బలవత్తరమైనది కానిచో, మనసును పడలాగి వారువములు నరుని లోఁతుగోతిలోఁ గూల్చును! తన కురుక్షేత్రమున విజయుఁడు కాఁగోరు పురుషుఁడు తేరును బారుగ దశతేజుల స్వచ్ఛందలంఘనమునకు విడువక పటుత్వసిద్ధి నందిన భావముపై నాధారపడును. మనుష్యకర్మను ధర్మమునుగావించునదే యీభావము! పంచభూతాత్మకమగు శరీరమున (నిదియు నొక విశ్వమే) దివ్యమరీచుల నీనునది భావము. ఇది లేనియంతరంగము చీఁకటికోణము; ఇది లేనిహృదయము శ్మశానవాటిక; ఇది లేనిశరీరము కట్టెమోపు. భావము లేకున్న బ్రదుకే లేదు. నైతికదార్ఢ్యమునకును, ఆధ్యాత్మికవిభూతికిని, మేధాసంపదకును, శారీరకశక్తికిని—దీనికిని దానికిని అన నేల? సర్వతోముఖమైన ధర్మనిర్వాహణమునకు అనివార్యమైనది భావము!

భావము భగవంతునివంటిది. అగుటయు నిది భగవంతునివలెనే అదృశ్యమైనది. అదృశ్య, అఖండ, అపరిచ్ఛిన్న,

నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, సర్వవ్యాపి, సచ్చిదానంద ఘన స్వరూపమును నిజహృదయమందు గుర్తించి ధ్యానించుట ఆఱితేఱిన అర్జుననకే సాధ్యము కాని వృకమట్లు అనవరతము మెక్కువానికిఁ గాదు. విశ్వవ్యాప్తమయ్యు నీశక్తి వడ్లగింజకంటె చిన్నదియై మనుష్యహృదయమం దిమిడియుండు నని ఛాందోగ్యోపనిషత్తు వాకొనుచున్నది. అద్భుతమైన యీయాధ్యాత్మిక శక్తి నలవఱచుకొనుట కెంతేని సాధన మవసరము. ధర్మనిష్ఠాగరిష్ఠుఁడగు యుధిష్ఠిరుఁడును, సగుణోపాసనమందు అద్వితీయ శక్తిసంపన్నుఁడైన వడముడియు, మూర్తీభవించిన త్యాగ తితిక్షులైన నకులసహదేవులును పరమార్థమును జయించి, ధనంజయసార్థకనామ మందిననిర్గుణోపాసకునకు సాటి రారు. కనుల యెదుటఁ గానంబడునది, చేతి కందునది, చెవులఁ జొచ్చునది, నోరూరించునది, దశేంద్రియములు మానసాగారమందు ప్రోవొనరించునదిమాత్రమే,—పరిమితి గల భావరాశిమాత్రమే సామాన్య మానవ సాధ్యమైనది. ప్రత్యక్షానుభవఫలములను కబళింపఁజాలునేకాని కర్మేంద్రియములును, జ్ఞానేంద్రియములును ఎచ్చటికో యెగసి భావైశ్వర్యమును కొల్లగొట్టుకొని రాలేవు. శరీరావరణమును దాఁటిన, వీనికి తెరువు లేదు. సొంతయింటినుండి, ఏదో కొంత భావఫలసాయము నివి కొంచఁ బోసికొనఁజాలును; కాని, దూరస్థమై, అదృశ్యమైయున్న భావైశ్వర్యమును కనులారఁ గాంచ గలుగుట కల్ల.

ఉన్నదానితో మనసు నింపుకొని కాలక్షేపము చేయుటకు ఏకోరిక లేని—ఏయాశలు లేని పల్లెవాసి యెప్పనుగాని

తెక్కలుకట్టుకొని పదునాలుగుభువనములందు నెగురఁజూచు విజ్ఞాని యొల్లఁడు. సంతృప్తిపడి సంతసంపడుటకంటె, అసంతృప్తియందుఁ బడి సంతపించుట కీతఁ డీయకొనును అసంతృప్తి యతఁ డీడులాడురత్నాకరము. మునిఁగిమునిఁగి యాతఁడు మిఱుమిట్లుగొలుపు జ్ఞానరాశిని చేఁబట్టును. సంతృప్తి నందు సన్యాసికంటె అసంతృప్తిని గను పాపియే పెక్కువమధుంగు లధికుఁ డని నేఁడు తత్త్వశాస్త్రము ఘోషించుటలేదా? అసంతృప్తి కింత ప్రాముఖ్య మే లని చే యెత్తుదురా ?

అసంతృప్తినుండి ఆనందము నూతౌమడలుపర్వెత్తును. ఇది దూరీకృతమగుట అదృశ్యమై యంతరంగమున ప్రవేశించు టకే! ఆనందము ఏసువంటిది. తనయెడల విముఖులైనవారిపై నిది చల్లని యాశీస్సు కురిపించును. తమోగుణమున దిగఁబడు నాతఁడు సుఖమునకై చెవిఁ గోసికొనును. కన్ను గుట్టుచున్న దని, కనుసన్నలు చేయుచున్నదని, చిఱునవ్వులు రాల్చుచున్నదని, పాడుచున్నదని, ఆడుచున్నదని, రానున్న ముసల మెఱుఁగక, నిండుప్రేమ నీమూర్ఖుఁడు దానిని కవుంగిలించుకొనును. నిష్కర్మయందు వీని యిహాపరములు నక్కియుండును. ఎద్దువలె తిని, యీ పలుగాకి మొద్దువలె పరుండును. బ్రదికియుండియు నీమహానీయుఁడు చచ్చుదాఁక చచ్చినట్లేపడి యుండును. బురదగోతిలోఁ దిగఁబడుబట్టెవలె, దుర్గంధమందు మునిఁగితేలుపందిపగిది ఈతిండిపోతుమనసు క్రుళ్లుతలఁపులందు పొరలాడుచుండును. తనలోఁ దాను చీఁకటికై దీయై నిద్దురలో నీతఁడు కూలఁబడియుండును. ఇఁక సత్త్వగుణసంపన్నుని పరి

కింపుఁడు. ఇతఁడు సుఖ మపేక్షించుసోమరి కాఁడు. రజస్తమములు అవసరమగునపట్ల వీనికి దాస్య మొనరించునుగాని, యీతనిపై స్వారిచేయవు. ఈతఁడు శాంతిమయుఁడు. భగవతి, సీత యీతనియం దనారతము విరాజిల్లుచుండును. శాంతిభగవతి యున్నచోటనే కదా ఆత్మారాముఁ డుండును! జ్ఞానద్రవము కనినశాంతి, ద్రౌపది వీనియంతరంగమం దాసీనయైయుండును. బాహ్యదృష్టి కీతఁడును, తమోగుణబద్ధుఁడును శాంతిమయులట్లు గానంబడుదురు. కాని యితఁడు మరీచి—ఆతఁ డంధకారము! ఇతఁడు స్వర్గము — ఆతఁడు శ్మశానము! ఇతఁ డింద్రియములను జయించిన మహారథుఁడు! ఆతఁ డింద్రియములను జయింపనిచ్చిన జయద్రథుఁడు! ఇతఁడు వాంఛలు విసరివైచిన మహేష్వాసుఁడు! మహత్తరాశయము చేఁబూనిన ధృష్టకేతువై, చేతనశక్తి నందిన చేకితానుఁడై, అంతశ్శత్రువుల నిర్జించిన పురుజిత్తై, దృఢప్రజ్ఞగల కుంతిభోజుఁడై, జ్ఞానచ్ఛటలఁ జిమ్ము కాశీరా జీతఁడు! కలుషభావకురుసేనకు రాజై, చిరనిరయమున మ్రగ్గు మనుష్యాధముఁ డాతఁడు! కర్ణావస్థనుండి కడచి, శల్యశక్తిని వృద్ధిఁ గావించి, వికర్ణస్థితి నంది, అద్భుత మాయాశక్తి—అవిద్యాశక్తి—భీష్మశక్తి నదృశ్య మొనరించి ధృష్టద్యుమ్న (ధృష్టం ద్యుమ్నం యస్య సః) శక్తి, సాహసశక్తి నాయకత్వమును నిలిపి, సకామావిద్యలుకడచి నంతన నిష్కామ కృపుఁడై, వీర్యవానుఁడైన నరపుంగవుఁ డీతఁడు! దురాశయగు ధృతరాష్ట్రునకుఁ బుట్టి, దుశ్చరిత్రుఁడైన దుర్యోధనుఁడై అరిషడ్వర్గమునకులొంగిన నరాధముఁ డాతఁడు! చూపులందును,

రూపులందును గుణనిర్ణయమగుచో, నిరయకూపమునుండి సుందరాకారులు పరుగిడి దేవత్వ మధిష్ఠింపఁగలరు. నరాధముఁడు సుందరుఁడు కావచ్చును. నరోత్తముఁడు రూపరహితుఁడు కావచ్చును. ఇరువురును సురూపులు కావచ్చును; కురూపులు కావచ్చును. బహుయత్నలబ్ధమైన పున్నమిరాత్రి — బహుజన్మలందు దొరలుచు, వసుమతికి దాపురించిన పాప మూర్తఁడు! ఈతఁడు చిరజీవి!—నిముసనిముసము తనలోఁదాను చచ్చుచు, నోరులను చంపఁదలఁచు చెనఁటి యాతఁడు! సుఖ మపేక్షింపక యీతఁడందు సచ్చిదానందమునకును, సుఖము నే వలచి, స్వార్థమునే ఆరాధించి, అహంకారమునకు అర్ధాంగియై, అఘమునకు దాసియైన ఆతఁడందు సంతసమునకును భేదము లేదా? సంతృప్తి నెఱుఁగక నిరంతరపరిశ్రమచేసి కర్మవీరుఁడై, భక్తితత్పరుఁడై, జ్ఞానమయుఁడై సత్యకి (సాంఖ్యాంకం యస్య సః) యైన పురుష శ్రేష్ఠుఁ డీతఁడు!—సంతృప్తిని గోరి చిరమహాక్ష్యమున మునిఁగి యున్న పీనుఁగు రాయఁ డాతఁడు! అసంతృప్తిలేకున్న చిరమగు సంతృప్తి యేది? పరిశ్రమ యేది? పురుషార్థ మేది? పరమార్థ మేది ? ఈ పరమార్థమే మహత్తరమైన భావధనము కదా ! ఈధనము నందిననరుఁడేకదా నరుఁ డనిపించుకొనఁగలఁడు !

అసామాన్యమైన ఈ భావధన మెందు లభించును ? పృథ్వికిని మనకును సంబంధబాంధవ్యముఁగూర్చు ఇంద్రియము లీధనము నావిష్కరింపఁ జాలకున్నయెడల చదువులనేమి, నీతులనేమి, ఉద్యమములనేమి, సాధారణ వివిధవైనిక క్రియలనేమి దేని నుద్దేశించి నడపుచుంటిమి ? ఇవి యన్నియు వట్టి

బొమ్మలాట లని తత్త్వజ్ఞు లేల నగుచుందురు ? వెదకివెదకి వేసారినను, కానంబడని ఈవిభూతి యెం దుండును ? ఈ ప్రశ్నముల కుత్తర మొసఁగవలె నన్న, ప్రాచీనప్రస్తుతప్రపంచ విజ్ఞానమును గ్రుమ్మరింపవలెను. బహుజీవ బహుజన్మయత్న ఫలితమును కన్నులయెదుటను ప్రదర్శింపవలెను.

ఇంద్రియము లందిపుచ్చుకొనుపదార్థములందు పెనఁగు లాటయే లేదు. ఇవి యిచ్ఛాభావమును తనివారఁ గ్రోలి తల తిరిగి నేలఁగూలుట కెంతకాలము పట్టును ? ఇంద్రియము లిచ్చు గంజిమెతుకులకై జన్మపరంపరలం దూయల లూఁగి, మాఘ ఫాల్గునముల మాటలనాలింపక, మా + అఘు; ఫల్గు + న నరక నాకములను "దూ! దూ!!" యనవలెనా ? అనిత్యసుఖమును గాంక్షించితిమేని, స్వీయకురుక్షేత్రమును ధర్మక్షేత్ర మొన రింతుమా ? నారాయణునిమ్రోల విషాదపూరము వెడలఁ గక్కుదుమా ? విజ్ఞానికృషికిని, భౌతికశాస్త్రజ్ఞునికృషికిని భేద మెంతేని కలదు. ఎదుటిదృశ్యమును భేదించి భౌతిక శాస్త్రజ్ఞుఁడు తనకు వలయుజ్ఞానమును చేఁబట్టఁగలఁడు. కవి కార్యమందు క్లేశము లేదు. పాలకునిపనియందు ఎంతో చిక్కు లేదు. ఇంద్రియములకు సాధ్యమైన పనికై బహుజన్మము లెత్త నక్కఱలేదు. బహుజన్మము లెత్తినను లభింపని పరమధన మెట్లు చేఁబడును ?

ఎదురరుగు నింద్రియములను వెనుద్రిప్పవలెను. "వెనుకకుఁ దిరుగుటపనియైన, ప్రపంచ మేల? జన, సంపర్క మేల?" అనుసంది యము కలుగవచ్చును. ముందులకు లంఘించు నింద్రియము లకు ముంగలపని మనము చూపనక్కఱలేదు. చాకచక్యముతో

వర్గములను చేఁబట్టి దశాశ్వములను నడపితిమేని, ప్రపంచక్షే త్రమున నెంతేని యభ్యుదయము నందఁజాలుదుము. మహత్తరమైన దయ్యు, కర్మక్షేత్ర మొక్కటియె జ్ఞానపిపాసువును సచ్చిదానందములతోఁ దనియింపఁజాలదు. అనంతశ్రుతితో బాగులు విజ్ఞానికి కర్మక్షేత్ర మెంత భిక్షపెట్టును? బుద్ధిశ్రమకై ఆతురత పడునాతఁడు భక్తిమార్గమున విడియుటకు మక్కువపడునా ? భక్తికి దీర్ఘయోజనగాని, పెనఁగులాట కాని యక్కఱలేదు. భక్తున కెంతేని ఎన్నిక కలదు. భ్రమరకీటకన్యాయము సాధ్యాతీత మగుచో మర్కటకిశోరన్యాయమును, మర్కటకిశోరన్యాయము అడలు పుట్టించుచో మార్జాలకిశోరన్యాయమును వీని మనుగడ నడపునేడుగడయై యుండును. తన్నుఁగన్నతల్లి —జగన్మాతకడుపుఁబట్టి వ్రేలాడుభక్తుఁ డెట్టి యరిష్టములనైన నతిక్రమింపఁజాలును. కష్టముకాని, ప్రజ్ఞకాని అనివార్యమై యుంట జ్ఞానమార్గావలంబికే!

ఇంద్రియములను వెనుద్రిప్పఁజాలువాఁడు విజ్ఞానిమాత్రమే. మూలభావమందలి పరమార్థమును, పరమార్థమందలి మహత్త్వపటుత్వములను కరతలామలకములు గావించుకొనఁజాలు ప్రజ్ఞాధురంధరుఁడు విజ్ఞాని. విజ్ఞాని యనిన గుట్టలకొలఁది గ్రంథములను దిగమ్రింగిన అద్భుతభోక్త కాఁడు. తమకును, తమ విజ్ఞానమునకును సంబంధములేని విజ్ఞానులు కొల్లలై ప్రపంచమున పుట్టిరి, గిట్టిరి. విద్వాంసులయ్యు, వేదవేదాంగపారంగతులయ్యు, పల్వురు మనుష్యరక్తమును గుటకలువైచిరని ప్రపంచ చరిత్రలు కన్నీరు జాలువార్చుచుఁ దెలుపుచున్నవి. ఇట్టివిజ్ఞాను

లను మట్టుపెట్టుటకు సాధారణులు తలక్రిందులైరి. అఖండుఁడైన భగవంతుఁడు, స్వీయమథనము గావించుకొని, మధురయందుఁ దోఁచి సాధారణబాలునివలెనిది గోకులమున నింద్రియములను పెరుఁగనిచ్చి, (ఈయర్థము 'గోకుల' శబ్దమందేయున్నదికదా!) బృందావనమున వర్ధిల్లి, నిజశరీరద్వారక కధీశ్వరుఁడై, ప్రభాసమందు భాసమానమైన తనువు వీడువఱకు నెందఱెందఱు పలు గాకులను దునుమాడలేదు? అవతారమూర్తులచే వధింపఁబడిన దుష్టులు విద్వాంసులు కారా? నేను లక్ష్యించు విజ్ఞాని యీ ప్రోవులోనివాఁడు కాఁడు. తన విజ్ఞానము తానై, తాను తన విజ్ఞానమై, తన జీవనమును తనభావము గావించుకొని, తన భావమును దనజీవన మొనరించుకొనినవిజ్ఞానియే విజ్ఞాని కాని ఒరుఁడు కాఁడు. ఇట్టి విజ్ఞాని పుస్తకపఠనమందు మాత్రము పుట్టఁడు. తన కర్థముగాని ఘోషయందు బ్రదుకీడ్చువాఁడును, నిరక్షరకుక్షియు వేఱు కారు. కొండ చిల్లులుపడునట్లు పనసల నఱచినంతన విజ్ఞాన మలవడునా? నిక్కమైనవిజ్ఞాని ప్రతిపదమునునుండియు, ప్రతిపదార్థమునునుండియు జ్ఞానసుధను పీల్చి తన మనసునందు, తన బుద్ధియందు, తనయాత్మయందు, తన ప్రాణమందు, తన జీవనమందు దానిని ప్రవహింపఁజేయును. శరీరస్థ దేవత లైదింటిని (జ్ఞానేంద్రియము లైదింటిని ఉపనిషత్తులు దేవత లని పేర్కొనినవి) అల్లన నవ్వలికంపి, దక్షిణామూర్తి వలె సింగవలనను, దోమవలనను, పుర్వువలనను, చెట్టు వలనను నీతఁడు విజ్ఞానమును సంపాదించును. వేయేల? కమాఱు ఇంద్రియములను లోనికిఁ ద్రిప్పి, హృదయకోశాగారమునఁనిండి

యున్న సచ్చిదానందములనుండి అమూల్యమైనమూలభావము సీతఁడు నెమరువేయును. దేహధారి లోఁగొను అన్నపుముద్ద రక్తమై, వీర్యమై, మణిపుష్పకమై, సుఘోషమై, అనంతవిజయమై, పౌండ్రమై, దేవదత్తమై, పాంచజన్యమై, ('అపాంత స్త్వమ్ దరవరం, సుదర్శనం తేజస్తత్త్వమ్') శరీరస్థములైనవిపైదులను దనిపి, (పిండాండము బ్రహ్మాండమును జేరుచున్నట్లు) విజ్ఞాని భావము అంతరంగమందు మహోత్కృతాభివృద్ధినంది, దివ్యశక్తి నిఁ బడసి తుద కాతని భగవంతునియందు నింపివైచును.

మనుష్యజన్మ దేవజన్మకంటె మహత్తరమైనదని మహాత్ముఁడు శుకయోగి ఏల వాకొనెను? పశువులయందువలెనే దేవతలయం దభివృద్ధిలేదు. దేవతలయందు సుఖమే వారి ప్రారబ్ధమై నిలుచును. పశువులు దుష్కర్మ మనుభవింప, నిలింపులు సుకర్మ లనుభవింతురు. ('నాభుక్తం క్షీయతే కర్మ జన్మకోటిశతైరపి'). సుకర్మవలని ఫలము ముగిసినంతనే యని మిషులు నేలకు రావలసిన దే! మనుజుఁడో పుణ్యమును గోరక పాపమందుఁ జొరఁబడక, కర్మము క్షీ నంది, పరమార్థమును చేఁబట్టి, పరమాత్మయందుఁ గలయఁగలఁడు. కావుననే శుకయోగి మనుష్యజన్మ కట్టిమాధిక్యము నొసఁగెను. సంచితమైన కర్మము ప్రారబ్ధమై ప్రస్తుతజన్మముతో బారుగ విడిపోవుటకు ఆగామికర్మ చేరకుండవలెనుగదా! నేఁటి యాగామికర్మ రేపటి సంచితకర్మమై, రేపటి సంచితకర్మ మామఱునాఁడు ప్రారబ్ధమై సంకెలకు సంకెలఁజేర్చి, జన్మపరంపరల కంతు ఉండు టెట్లు? 'సంచితాగాము'లను మటుమాయ మొనరించి ప్రారబ్ధమును

చితిచిచ్చులో చిటచిటలాడించితిమేని, కర్మపంజరముననుండి ఎగసి జీవాత్మ పరమాత్మను చేరఁజాలును. పరమాత్మను చేరఁజాలుట పరమార్థము నందుట.

ఆధ్యాత్మికమగు ననంతృప్తివలననేమి, కర్మనిష్ఠాగరిష్ఠత వల్లనేమి, సగుణనిర్గుణోపాసనలమూలమున నేమి, భక్తితత్పరత చేనేమి జ్ఞానపథావలంబనమువల్లనేమి, జితేంద్రియత్వముచే నేమి, పరమార్థసాధనమును, పరమభావహృదయంగమమును సాధ్య మగును. కురుక్షేత్రయుద్ధమున విజయధ్వానము బోరు కలంగును !! నాఁడే నరుఁడు నారాయణుఁ డగును !!! అఖండ స్వరూపు నందిననాఁడే మానవుఁడు శిఖండి యగును !!!!

ఈపరమార్థము ప్రాచీనభారతసీమయందు తాత్త్వికుల కనులందుమాత్రము కాంతిలినదని మన మూహింపరాదు. పరమార్థకాంక్ష ఋషులస్వార్థకాంక్షయని తలఁపఁజెల్లదు. ప్రాచీన విజ్ఞానులు పరమాశయములను చేరువ్యవస్థల నెన్నో రోసిరి. ఇవి వ్యక్తిగతప్రజ్ఞ ననుసరించినవి. ప్రజలు నడపు దైనికవృత్తులందును, కడపు దైనికజీవనములందును ఈ వ్యవస్థలు నెలకొలుపఁబడినవి. ఇవి భిన్నము లయ్యు, వీని గమ్య స్థానమొక్కండే! వీనియన్నిటిదృష్టియందును పరమాశయములు పరంజ్యోతినై వెలుఁగొందినవి. వివిధమానవులు వివిధవృత్తులందు అక్షరాభ్యాసము చేయుతటి నీజ్యోతినుండి వెడలినద్యుతి వీరి కనులయందు తళ్కొత్తినది.

ఈవెలుఁగును వెలారించు దివ్యప్రదీపకళికదెస పదపడి

వీరు నడచిరి. కలమును చేఁబూనిన విజ్ఞానియు, హాలమును చేఁదాల్చిన కృషికుఁడును నాఁడు ముముక్షువు లనిపించుకొనిరి.* మునులకుమాత్రమే కాక పామరులకుఁగూడ ముక్తిని ముంజేతికంకణముఁ జేయు జీవనవిధానము ప్రాచీన భారత సీమయందు కలదు.

కర్తవ్యములలో డిగ్రీలభేద మున్నది. కాని వీని హృదయములందు ప్రవహించు భావఝరి యొక్కటియే. అల్పశక్తి గలిగి తనకర్తవ్యమునకు ఆత్మార్పణము గావించునాతఁడును, ఘనకార్యధురంధరుఁ డగు మహావీరుఁడును జగదీశుని దృష్టియందు సమానులే. ఆతఁ డధికుఁ డనియు, నీతఁ డల్పుఁ డనియు ననుభావము ప్రాచీనభారతసంఘమున పొడసూపలేదు. నాఁటిభారతీయులు తమతమపనులన్నింటి నాధ్యాత్మికదృష్టితో పరికించి రనుటకు నేఁడును మనపల్లెలందు ముఖ్యముగ వంగ సీమయందు బహుళదృష్టాంతములు కలవు. ఒక్కొక్క వంగీయుఁడు తన దైవతమునకు ధూపదీపముల నర్పించియే తన వైనికక్రియకుఁ గడఁగును. ఇది మూఢభక్తి కాదని నాతలంపు.

---

* "......Do thine allotted task!
Work is more excellent than idleness;
The body's life proceeds not, lacking work.
There is a task of holiness to do,
Unlike world-binding toil which bindeth not
The faithful soul; such earthly duty do
Free from desfre, and thou shalt well perform
Thy heavenly purpose."

"*The Song Celestial.*"

పాపభయమును, పున్నెమునెడం ననురక్తియు, జగ
భక్తియు సీతనిక్కృపి నున్నతపథమున నిలుపుచుండు
యెడం బ్రసన్నయగు లక్ష్మి సీతం దన యింటం గై
పక ప్రజాభ్యుదయమునకై నియోగించుచుండును. వ
పరమాశయము దృష్టియం దుండుటచేంగదా ఈతండ
కార్యములకు కడంగుచుండును. రాజన్యుడై తన క
నెఱుకొని జగదీశుని నొసలు నుండి తన చూడ్కి
లింపని జనకునివలె, సీతండును ఈశునివలె మహాత్
సంప్రదాయము ననుసరించి చనువీని సైదోడులును
ష్టియందే తమకర్తవ్యముల నెఱుకొనుచుండుట
*ఉపనిషత్తులందలి యుపదేశము నొడంబడి దాల్చి
పయోధనులు సలిపినను వీ రీశ్వరార్పణ మనుచుండు
తమ క్రీడాంగణములయందు మధుర కృష్ణగీతికను
యుందురు. ముందంజవేయుచు పురోభాగమున
శోభను విస్మయపరీతచేతస్కులై విలోకించుచుండు
బంధురవాతూలమున నీశ్వర ప్రేమస్పర్శ నందుచు

వర్డ్సువర్తు కవీంద్రుండు వర్ణించిన భరతపక్షి ముందు నెగయుచున్నను, తనదృష్టిని భూమీతలము నక్షత్రమట్లు మిట్టక కవీంద్రుండు అద్భుతభావనావీ మసలినను, తనమనసును మన్నన నిలిచిన అభాగు నాండు. దివిమర్త్యములపొందును గుఱితించి, ఐహి-

* "Whatever works thou doest consecrate Brahma."

చింతలను సమన్వయించి, ఇహపరప్రయోజనములను గంగాయమున లయట్లు సంధించి, ఆత్మదృష్టినుండి స్వార్థమును దూరముగ నెట్టి, ఫలకాంక్షను* తఱిమికొట్టి సకలమానవుఁడు అనాగడుగున జేగంటలు మ్రోఁగించి పరంజ్యోతిని చేరఁజాలును.

మనుజుఁ డందు విద్యకు, ఆతనిజీవనవిధానము బాహ్యావ్యక్తీకరణము. కావున తమ గమ్యస్థానమును చేర్చు వివిధ గతులందును వివిధమానవులు ప్రాచీనభారతమున సముచిత శిక్షణ మందుచువచ్చిరి.

మనుష్యశిక్షణమునకును, మనుష్యజీవనమునకును అవినాభావసంబంధ మున్నదను సంశము నాఁడు గుర్తింపఁబడినది కాని నేఁడు కాదు. పాడుపడినగుడియందలి విగ్రహామట్లు నేఁడీ యంశము పూజ నందకున్నది. అధునాతన నాగరకతారాధకుల దృష్టి కిది రోఁత పుట్టించుచున్న దేమో? నేర్పినదానిని చేఁతయందు వ్యక్తపఱుపవలె ననికాని, ఉత్కృష్టమైన కొండొక చేఁతకు వలసినశిక్షణము నందవలె ననికాని మక్కువపడువారి సంఖ్య నేఁడు మిగుల నల్పము.

జ్ఞానపిపాస లేదుగాని నేఁడు కీర్తిపిపాస వర్ధమానముగుచున్నది. తొమ్మిదినెలలు మోసినతల్లియే పనసపండువంటి బిడ్డను చూడఁగలదు. శీతవాతూలమునకు కొన్ని నెలలు తల యొగ్గియేగున్న మావి వసంతసమయమున ముగ్గినపండునుకనఁ

* "కర్మజం బుద్ధియుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛం త్యనామయమ్"
(శ్రీభగవద్గీత, అధ్యాయము, 2, శ్లోకము 51)

జాలును. మొగ్గలై తపించియేకదా మల్లెలువిడిచి, కుంజవాటిపై జల్లున రాలిన నక్షత్రపుంజమట్లు కనులకువిందొనరించును! కృష్ణపక్షమున నెందోయుండి, ఎంతో తపించియేకదా శుక్లపక్షమున జాబిల్లి క్రొంగ్రొత్తకళలఁ దేజరిల్లును! మనుష్య హృత్ఫలకమున నాటుకొనిన విజ్ఞానాంకురమే కాలక్రమమున కల్పకమై, మంచుతుంపురులయట్లు తన కొనరొబ్బలనుండి కీర్తిసూనములను దిక్కామినులచేతులయందు రాల్చును. గురుగుణములు విత్తులై యొకని జీవితకేదారమున రాలెనేని, సమయము కడచినంతన కన్నుకుట్టు కీర్తిపైరై దశదిశల జోహా రందును. పైకమిచ్చి వందిమాగధులను కొనువారును, బత్తె మిచ్చి బిరుదులను, కుండలములను, సాలువులను పడసి పెద్దగద్దెల నెక్కువారును, మెఱుపుప్రకటనలందు ప్రవేశించి పదుగురకళ్లఁ బడువారును, సంభావనలిచ్చి బట్రాజులకు స్వాగతమనువారును, సమయమునకు తగినవేషములు వేసి, గజ్జె గట్టి మేజువాణి చేసినను, ప్రశంసకుఁ గాక జుగుప్సకే కొంగు పట్టవలెను.

రేఁబవళ్లనుదిర్దిరఁ దిరుగనిచ్చి, నిద్రాహారములను బానిసలట్లు వెనుక నిలిపి విజ్ఞానమునకై తపించువారును, మహాత్తర నియమములకు వంగి జోహా రొనరించి, తమ సర్వస్వమునైన వానికి నైవేద్యముగ నర్పించి, ఆత్మవిభూతి నందువారును నేఁడెందఱున్నారు? హృదమైశ్వర్యము నిండుసున్నయైనను, జ్ఞానరాశిగాక స్వార్థభావరాశి కుక్షియందు కుదురైయున్నను, గెడగంతులు వేయుచు, రంగస్థలములందేమో ఘోషించుచు, పత్రికలందు, పెద్దక్కరములందు తళతళలాడువారు నేఁడెందఱు లేరు?

ప్రాచీనాశయము ముగ్గుబుట్టవలె తెల్లఁబడినదని రోఁతపడువారు కనులయెదుట నేయాశయమును గాంచక, విలాసామోదములం దల్లాడుచున్నారు. "భావోన్నతి" "నిరాడంబరజీవన" మను శబ్దములు వెనుకటిగ్రంథములందు స్వర్ణాక్షరములతో మెఱసినవి. వీనిని చెదపురుగులకు సమర్పించినమహానీయు లీ మహత్తరపదములను దొంగలనట్లు తమ నిఘంటువులనుండి తఱిమివేసిరి. ఆదర్శజీవనముఁ గడపఁ గాంక్షించువా రేకొలఁదిమందియో ఏమూలలనో గోచరించుచున్నను, పులిగుంపులోని మేఁకపిల్లలవలె వీరు గడగడలాడుచున్నారు. అనుకూలవాతావరణములేనితావున నెంతచక్కనిమొక్కయైనను తలసూపఁగలదా? కాలపరిస్థితులందు కారుమొయిళ్లుక్రమ్ముకొనియుండఁ దేజోనిధులు కనులఁ బడుదురా? సంఘమందు విషవాయువులు లేచుచుండ సువాసనలువెడలించుసుచారిత్రు లెట్లువెల్వడుదురు? మహాపురుషులను కనునవి సీతారాములఁబోలు సమయములు కాని, రాక్షసదంపతుల కెనయైన సమయములు కావు.

గొప్పయూహాలు కలవారందఱును గొప్పవారనితలఁచుటకు నేఁటి వసుంధరయందు వీలులేదు. జీవనవిధానమందును, దానికి పునాదియగువిద్యావిధానమందును పరదేశీయులవెన్క 'తందానతాన' యనుచున్నాము. పైపై మెఱుఁగులను తళుక్కొత్తించుచు, భామవలె తెయ్యిమను నాగరకతకుఱఁగల నిలిచి, దాని యాలాపనాభినయములకు సరిపడులీల తాళమువేయుచు 'తధికిణతోం' అని మెగురుచున్నాము. అంతియ కాదు; ఉత్తమాశయములను కనులులేని అవ్వలని వెక్కిరించుచున్నాము.

కాలపథమునందు క్రుళ్లి కంపుగొట్టువస్తువు లుండును; అక్కఱకుమాలిన సరుకుకూడ దానియందు చేరుకొనును. దుర్గంధమయము లైన ఆచారములను, ఎందుండియో వచ్చి కంటకములట్లు మన సంఘమందు చేరినసంకటములను మనము తొలఁగించుకొనుటపాడి. కాని పారిజాతమునుబోలు నాశయమును,దివియం దుదయించి ప్రజలపాలఁ బడిన ఆశయమును, స్థలకాలములందు కట్టువడని ఆశయమును, ముదిమి నెఱుఁగక చిరకాలము నవనవోన్మేషమైయుండు ఆశయమును, రమాసుందరియట్లు సర్వసమయములయందును, సౌందర్యసందీప్తమైయుండు నాశయమును గుర్తింపక, దాని కెన్నెన్నియో పేళ్లు పెట్టి దాని యాలోకమందు మనలు టెఱుఁగక మనగొప్పను గోపురమట్లు మహోన్నత మొనరించుచుంటి మని మురియుచు, తిఱునిచెఱుపుఁ దెచ్చుకొనుచున్నాము.

మహత్తరజీవనములు కడపవలె ననిన, మహత్తరవిద్య నంది, మన మావిద్యను మెదటియందే యిఱికించియుంచక దైని కానుష్ఠానమున వ్యక్తీకరింపవలెను. మననమునకును, అనుష్ఠానమునకును మన తొల్లింటి గురుకులములు ఆటపందిరు లైయుండెడివి. ఇందలి శిక్షణమును, అభ్యాసమును జీవనము కడ ముట్టువఱకును క్రమవృద్ధి నందినవి.

మన ప్రాచీనవిద్యావిధానమునకును, గురుగంభీర మైన నాగరకతకును మనగురుకులములు జన్మస్థానములైయుండెడివి. ఇవి వనశృంగారమందు వఱలినవి. ప్రకృతిదృశ్యములయందు వర్ధిల్లినవి. తలిదండ్రులను వీడి, కలమాన్నమునకు స్వస్తిచెప్పి,

హిరణ్మయ కుట్టిమమును నెట్టివేసి కౌపీనధారియై నాఁటి జిజ్ఞాసువు నగస్థలియందలి గురుకులమును చేరినంతన

"చ. అతిరుచిరాగమం బయిన శాంతినికేతన హృద్యయప్రమోద మా
తతి గుగ నవ్యనంబునలతాలలనల్ మృదులానిలాపవ
ర్జితతరుణ మాకరొపళులు సేసలు పట్టినయట్టి దైరి సం
పతదళినీనినాదమృదుభావముల దీవన లొప్ప నిచ్చుచున్."

(మహాభారతము)

అనంతసౌందర్యమున, ననంతానురాగనిధానమున, ననంతానందమున తన జీవనమహత్తరోద్దేశమును ప్రాచీనభారతీయుఁడు గుర్తించినాఁడు. ఎల్ల ప్రాణులందే కాక ఉపనిషత్తులు వాకొనినట్లు ఓషధులయందును, చెట్లయందును ("ఓషధీషు" "వనస్పతీషు") ఈతఁడు తన పరమాశయమును గాంచినాఁడు. అగ్నియందును, జలమందును, సమస్తవిశ్వవలయమందును జగదీశునిగాంచి రాగాదులనుండి విడివడి ("వీతరాగ") అంతరంగమున చల్లఁదన మంది ("ప్రశాంత") పరంజ్యోతికి చేతులు మొగిచి (నమో నమః") సమస్తవిశ్వజీవనమందును కలయువాఁడు. ("యుక్తాత్మ") సర్వభూతములందు నీశ్వరుని గుర్తించి ("భూతేషు భూతేషు విచింత్య") ("సర్వవ్యాపీ" "తస్మాత్ సర్వగతః శివః) జీవనము మిగుల విశాలమైన ("ప్రాణో విరాట్" దని గ్రహించువాఁడు. "తేజోమయుండు", "నమృతమయుండు"నైన "పురుషుని" చక్కని ప్రకృతిదృశ్యములందు పొడగాంచువాఁడు. "అవిద్య"ను డి "మాయ"నుండి విడివడి "అమృతస్య పుత్ర"యనుగంభీరవాక్కు తనకుఁ జెల్లు నని

గ్రహించి "శాంతం, శివం, అద్వైతమ్" లందుఁ గలయువాఁడు.

హృదయమును విప్పి, అందలి యనంతశోభను ప్రకృతి కాంత క్రుమ్మరించినచోటులందే జిజ్ఞాసువులు తమ గురుకులములను నిలుపుటకు హేతువు అంతరంగస్థ దివ్యశక్తుల * నాకర్షింపఁజాలు అద్భుతశక్తు లందు విరాజిల్లుటే! ఈ దివ్యశక్తులనే మనము తఱచుగ సహజశక్తు లనుచుందుము. మనము చదువు

---

* ఈ శక్తులను వెలుపల విజృంభింపఁజేయునదే విద్య యని తొలుతనే తెలిపియుంటిని. "విద్య", సంస్కృతధాతువు "విద్"నుండి పుట్టినది. శబ్దార్థముయొక్క పుట్టుపూర్వోత్తరములు ధాతువులోనే దృగ్గోచర మగుచుండును కాదా?

మనుష్యహృదయము సచ్చిదానందములకు ఆలవాలము — భవపరంపరలచే నేమి, దుర్భావగుప్తకర్మములచే నేమి మానవుఁడు తన యంతరంగస్థ మహత్త్వమును గుర్తింపలేకున్నాఁడు. సహజములుగాని భావము లెన్నో ఈతనిహృదయముపై దాడి వెడలును. కూడెనిమడ్డి ఈతని మనసు నంటును. క్రొత్తగ చేరిన ఈపదార్థమును మాపుచేయుట జిజ్ఞాసువుయొక్క కర్తవ్యము. నిక్కంపుజ్ఞానముపై నీతఁడు దృష్టి సారించుతట్ ఈయవిద్య సూర్యకిరణస్పర్శవలన నదృశ్యమగు మంచు తెరవలె నదృశ్య మగును. జ్ఞానమూర్తియు, సత్యమూర్తియు నగు కృష్ణమూర్తిపై మన సుంచువ్యక్తి అజ్ఞానమునుండి తొలఁగు నని మనీషు లందురు. మనుష్యహృదయమున క్రొత్తగ చేరిన (నవనీతము) పదార్థము నపహరించువాఁడు కావున శ్రీకృష్ణుఁడు నవనీతచోరుఁ డనఁ బరఁగుచుండెను. ప్రాచీనభారతవిజ్ఞానులు జగదీశుని "చోరశిఖామణి!" యని సంబోధించుటకు కారణము అతఁ డజ్ఞానము నపహరించువాఁ డగుటయే!

ఆంగ్లపదము (**Education**)కూడ ఇట్టియర్థమునే సూచించుచున్నది. (**E—Out ; Ducere—To draw**) అంతరంగమందు నిహితమైనశక్తిని అవ్వలికిఁ దీయుటయే విద్యయొక్క కర్తవ్య మనికదా ఈ శబ్దము సూచించుచున్నది.

గ్రంథములును, వినుచుండు నుపదేశములును ఈ శక్తులను లేపుట కేర్పడిన నిమిత్తములుమాత్రమే!

ఒక రిచ్చినసగయట్లు ఒక రిచ్చినజ్ఞానము అంతగా గణనీయము కాదు. చక్రనిశమంతకము ప్రసేనున కలంకారము కాఁగలిగెనా? సహజకవచకుండలములే సౌందర్యసందీప్తము లగునట్లు, సహజశక్తిసముద్భవజ్ఞానమే విజ్ఞానిజీవనమును భాసమాన మొనరించును. ఈశక్తి యెవ్వానికలమును సవ్యసాచిని గావించుకొని "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అనునో ధర్మక్షేత్రమైన సాహిత్యక్షేత్రమున వానిని విజయుని చేసి వదలును. సహజశక్తికి జనకుఁడు జగదీశుఁడు. గులాబికుసుమమును పరిశీలింపుఁడు. పూవు రేకుమీఁది రంగు నెవరు పులిమిరి? అది మనుష్యుఁడు పూసినది యగుచో, మంచు తుంపురులయందు తనయొడలు కడుగుకొని కుసుమము వెల్లనై యుండును. పువ్వును కఠినశిక్షకు గురిచేసినను, తాను మడిసిన మడియునేమో కాని, తనరంగును వదలకయేయుండును. వస్తువునుండి దాని నాశ్రయించుసహజగుణమును విడఁదీయుటకును, మానవహృదయము నంటియుండు సహజశక్తిని మాపుచేయుటకును ధాతకైనను వానితాతకైనను తరము కాదు.

ఎరువుసొమ్ము బరువుచేటు. దొంగసొత్తు ముప్పును దెచ్చును. సొంతవిత్తమో ? సహజభూషణమో ? శ్రీకృష్ణుని యెడందమీఁది కౌస్తుభమట్లు మనుష్యహృదయమున నజస్రము కాంతిలుచునే యుండును. కావుననే సహజశక్తిసంపన్నుని రచనలయందు కౌస్తుభకాంతులు తళ్కొత్తుచుండుటఁజూతుము.

మనుష్యలోకమునం దెందఱో రచయితలు పుట్టిరి. వీరియం దెరుపునగలవారు, దొంగసొమ్ములవారు పలువురున్నారు. వీరి నగలు నేలరాలంగనే, వీరియబద్ధపుసోయగము బట్టబయలైనది. వీరికనులయెదుటనే వీరిరచనములు డుల్లిపడినవి. సహజరచనాధురంధరుల సృష్టిలోని అక్షరములు నిలింపులట్లు చావునెఱుంగక సాహితీవియత్తలమున నక్షత్రములై వెలుంగొందుచున్నవి.

సహజశక్తి నెవ్వరును అంతరంగముననుండి యవ్వలికి బరబర లాగంజాలరు. చిరతపముకతన జగద్ధాత్రివలె నిది ప్రసన్న యగును. శ్రీరాముని చూచి పరవశుండై పర్విడివచ్చు పావనివలె సౌందర్యమును చూచినంతన, మాధుర్యము మనసును సోకినంతన ఈశక్తియవ్వల విజృంభించును. కృష్ణగీతికను వినినంతన జిజ్ఞాసాపిపాసలచే పొగులు గోపికలమాటయటుండ, మృగములుకూడ మఱుంగుచోటులనుండి, యమునాసరిత్తీరమునకు పర్విడి వచ్చెడివట! భగీరథుని వెన్నంటి కదురయమున భూతలమున నవతరించిన సురాపగచాడ్పున, తపస్వియైన విద్యార్థిరచనము నాశ్రయించుటకై అంతరంగకైలాసమున నుండి అద్భుతభావపూరము వెడలును లోంగల దివ్యశక్తి ప్రసన్నత నందిననాండే ప్రతిభాశాలి యగును. ఇతండే ఆదర్శకళోపాసకుం డగును. వసుమతీహృదయమున మణుల ట్లీతండు పరియంబోయునక్కరములందు సృష్టిచిత్రములు తళ్కొత్తును. గర్భాలయమందలి వేదవాక్కుల ట్లీతం డుచ్చరించు పల్కులు విశాలవిశ్వకుహరమున ననంతకాలము ప్రతిధ్వనించును.

ఒక చేతూఁగుటుయ్యాలయం దూఁగు సురదంపతులట్లు ఈశ్వరునిగూడి భావనావీథులం దీతఁ డుఱ్ఱూఁత లూఁగును. వనశృంగారమున జగదీశునితో సయ్యాటలాడుచు, వేడుకతోడ నీతఁడు వేళ గడపును. హృదీశ్వరికై ప్రాణపతి, తనతనువును, తనమనసును, తనయాత్మను సమర్పింపఁడా? తన కర్ధాంగియైన జిజ్ఞాసువుప్రేమాల భగవానుఁడు "ఇది నీయది" యని జ్ఞాన భాండారమును నిలుపఁడా? "నాథా! నాథా!!" యని శ్రీ చైతన్యుఁడు పొగులువాఁడు. కవుంగిలింతనుండి ఆకస్మికముగ నదృశ్యుఁడైన పతికై గోపిక యారాటపడువడువున, కృష్ణ సంశ్లేషమునకై గౌరాంగుఁడు వాపోవువాఁడు. పాలకడలియందు తేలియాడునట్లే తనకనులందుఁ దొలుకాడు బాష్పవారియందు సర్వేశుఁడట్టె తోఁచినంతనే పరవశుఁడై ఈతఁడు నృత్యము చేయువాఁడు. శ్రీ చైతన్యునింబోలు కళోపాసకుఁడును, ఇట్టి చేష్టలకుఁ గడంగునుగదా! తన రచనలయందు తాను దూఱి, చూపఱమనసుల నద్భుతానందములతో నింపునుగదా! తన వక్షఃస్థలి నాశ్రయించిన తీవయిల్లాలికి నుర్వీరుహము తననీడను, తనపొందును ప్రసాదింపదా? స్ఫాటిక రత్నవక్షఃస్థలమును ప్రాపు గావించుకొనిన జిజ్ఞాసువునకు లభింపని దేమి? ఈతనికి ధర సింహాసనము కాదా? నభము గొడుగు గాదా? దేవతలు భృత్యులు కారా? నారాయణు నాశ్రయించిననరుఁడు జ్ఞానోప దేశ మంది, ధనంజయుఁడు కాలేదా? నారాయణునకు నరుఁ డర్ధాంగి కాఁగలిగిన నపుడే, ఆతనితో నొకకంచమునఁ దిని, ఒక మంచమున పన్నుండి, వానిపొందున పరవశుఁడై, ఆపొందు

కతనసద్భూతభావములనుకనఁగలఁడు. కృష్ణభగవానునర్జునునకు బావమఱఁదిఁగాపించినకవి ఎంతగడుసువాఁడో యోజింపుఁడు. "బావమఱఁదులలో చిన్నవాఁడు పెద్దవానికి పెండ్లామువరుస" యని కొందఱు హాస్య మాడుచుందురు. 'ఇది వట్టిహాస్యము కాదు, పరమార్థగర్భిత' మని కంఠ మెత్తి వచింతును.

అత్తింట నానందించునాలుమగలవలె వనలక్ష్మియింట జిజ్ఞాసు వీశ్వరుని గూడి యానందించును. రమ్యారణ్యమందే కదా శైలసుత నిజేశునిఁ గాంచినది! తనతపముకతనఁ బార్వతి కాఁజాలు సారస్వతోపాసకుఁడు ముక్కంటిపొందు నవలీలగ నందఁగలఁడు. ఇట్టిదాంపత్యమందేకదా వినాయకునిబోలుమహోత్తరభావ ముదయించును! వ్యాసుఁడు భారతము చెప్పుచుండ గణపతి వ్రాయువాఁడఁట. పురాణవాక్కు నున్న దున్నట్లు అర్థము చేసికొనరా దనికదా తెలుపుచుందును. అక్కరములు వెలువఱుచునది భావమేకాదా? భారతాక్షరములను లిఖించిన వినాయకుఁడు దివ్యభావమే సుఁడీ! వనలక్ష్మియింట నీశ్వరున కిల్లాలైకదా వ్యాసకవి యీ భావమును గనెను!

అనంతసౌందర్య మెందు వెలయుచుండునో, అనంత శాంతి యెందు విరాజిల్లుచుండునో అనంతశక్తియందే ప్రత్యక్షమగును. ఈ శక్తియందుఁ గలయఁ గాంక్షించిరి కావుననే భారత మహావిజ్ఞానమునకు తలిదండ్రులైన కవులును, మునులును సౌందర్యనిధానములను తమ సదనములు చేసికొనిరి.

సౌందర్యోపాసనమున విద్యారంభము చేయువిధిని భారతీయులకడనుండి గ్రీకు లలవఱచుకొనిరి. బాహ్యసౌందర్యమున కలరి, నైతికసౌందర్యమును ప్రశంసించి,వీ రాత్మసౌందర్యమానకు నంజలిఘటించిరి. తమదైనికజీవితముననుండి దుర్గుణములను తఱుమఁగొట్టి, దాని ననురాగానందములచే నింపిరి. తా మారాధించు దేవతలకును, తాము వసించు గృహములకును, తాము ధరించు దుస్తులకును, తా ముపయోగించుదైనికపదార్థములకును చక్కనిరూపు లొసఁగిరి. వీనస్మున్నగు గ్రీక్ప్రతిమలు నేఁడును మన ధనికుల గృహాంగణములయందు తావు నందుచున్నవి.ఆటలందును, పాటలందును,ఉత్సవములందును, వేడుకలందును కనువిం దొనరించుదశ్యములను వారు నిలుపుచు వచ్చిరి. గ్రీక్సారస్వతము సౌందర్యనిధానము. ప్రాచీన కాలమున గ్రీస్సీమ కళలకు నాటపందిరి యైనది. ప్లేటోసోక్రటీస్, అరిస్టాటిల్సులాది తాత్త్వికులును, హోమర్, ఎయిస్కైలిస్, సోఫకిల్సు మున్నగు మహారచయితలును, సోలన్, పెరిక్లిస్సు మున్నగు నేలికలును, డెమొస్తనీస్ను బోలు మేటి వక్తలును సౌందర్యోపాసకులే! గ్రీస్లోని ఒలింపిక్శిఖరము, పర్నాసస్ కుహరము మన పర్వతములయట్లు, కళలకు పుట్టిండ్లయినవి.

ఈశ్వరదృష్టియందే తమక్రియలను సలిపి, ఆత్మజీవనములను సౌందర్యసముద్భాసితము లొనరించిన భారతీయులకును, గ్రీకులకును ఒకప్పుడు వ్యత్యాసమే యుండెడిదికాదు. పామరు

లేమి, పండితులేమి నాఁడందఱును పరమాశయములను నారాధించి తరించినవారే. *

సత్యము నారాధించిన తాత్త్వికులును, సౌందర్యము నుపాసించిన కవులును ఏకైకదృష్టి గలిగిన సైనికులై పృథ్వియందపుడపుడు గోచరించిరి. తక్షశిలయందు కొంత కాలము విద్యార్థులై గ్రీకులు బౌద్ధమతమందు ప్రస్ఫుటించిన ఈ యాశయములకు కను లప్పగించియే వాని నారాధించిరి

---

* కాలక్రమమున గ్రీకులు తమ సౌందర్యగుణమును గోల్పోయి, కృత్రిమతలకు మనసు లొగ్గి, దుర్వృత్తులకు జీవనము లప్పగించిరి. తమ యున్నత స్థలినుండి జారి, రొంపిలోఁ గూలఁబడిరి. గ్రీకులవెనుక సభ్యజగతియందు గిరిశిఖరము నధిష్ఠించిన రోమనులుకూడ ఆత్మశక్తిని పోనాడి, యింద్రియలోలురై వెండాల్సు, గాల్సు మున్నగు పరదేశీయుల దండయాత్రలకు లొంగిరి.

"*Age*, Thou art sham'd !
Rome, thou hast lost the breed of noble, bloods!"
(Shakespeare's "*Julius Caesar*")

† "బుద్ధుఁడు భారతీయుఁడు. విష్ణువుయొక్క తొమ్మిదవ యవతార" మని అపుడపుడు గర్వపడుదుము గాని ఆతని తత్త్వమ్మును గ్రోల నన్యదేశీయులు మక్కువఁ జూపినట్లు మనము చూపలేము. ఈశ్వర నామము నీతఁడు చ్చరింపకున్నను, నీశ్వరప్రాప్తికిఁ గారణములు పరమాశయములపై దృష్టి నిలిపి తన ప్రబోధములందు వీనిని దివ్వెలు చేసినాఁడు. పాళీ భాషలోని "ధమ్మపదము"ను "ధమ్మచక్కపవత్తన సూత్తమ్"ను పరిశీలించుతఱిని ఈ యంశము స్పష్టముగ గోచరించును. ధర్మమే సత్యమనియు, సత్యమే ధర్మమనియు ఉపనిషత్తులు వాకొనుచున్నవి. ధర్మప్రతిష్ఠకై ఆత్మ జీవనమును ధారవోసిన శాక్యముని సత్యాన్వేషియే కదా! సత్యాన్వేషియే

గ్రీక్ సంప్రదాయమున కంజలి యెత్తిన ఆంగ్లేయులును, జర్మనీసీమకవులును ప్లేటో ప్రభృతులవలె సౌందర్యము నుపాసించిరి. స్పెన్సర్, బైరన్, షెల్లీ, కీట్స్ ప్రభృతులు సౌందర్యమును వెలారించుపరంజ్యోతికి జోహా రనిరి. ప్రకృతినిజూచి ఆనందపరవశు లైరి.

---

సౌందర్యోపాసకుఁడు ; ప్రేమమయుఁడు. కవు లట్లు భిక్షుకులు సుందర దృశ్యములయందు మనసులను వసుమతిని కనఁగంటఁ జూతురు. బుద్ధప్రబోధ మందలి పరమాశయములు పింగళి కాటూరిమహాకవుల దృష్టి నెట్లాకర్షించినవో విలోకింపుఁడు :

"గీ. క్షేమకన్న సత్యము లేదు భిక్షుకులకు
పరమసత్యముకన్న సుందరము లేదు ;
లభ్య మైతి సౌందర్య లాలసుఁడ వీవు,
రసమయము లౌను వనవిహారమ్ము లింక."

"గీ. తీయతలఁపులు మొదలంటఁ ద్రెంపు మనుచు
హృదయమూనమ్ము త్రుంపు మం చే వచింపఁ
ప్రేమశూన్యము గాదోయి భిక్షుగణము
జీవకారుణ్యమే మాకు జీవగఱ్ఱ."

(సౌందరనందము ; సప్తమసర్గము)

తథాగతుఁ డుపదేశించిన సేవాధర్మము సుప్రసిద్ధ క్రైస్తవుల దృష్టిని గూడ నాకర్షించినది

"Buddha was more lucid upon our individual importance in service than Christ, and less ambiguous upon the question of personal immortality."—H. G. wells.

"I looke at last upto that Soveraine Light
From whose pure beams all perfect beauty springs"
(Vide Spencer's "Hymn to Beauty".)

(See also Shelly's '*Hymn to Intellectual Beauty*").

బైరను నెంతయో కొనియాడిన గెటే కవీంద్రుఁడు ("The English may think of Byron as they please but this is certain that they can show no poet who is to be compared with him. He is different from all the others, and for the most part greater") ఆతని వలెనే సౌందర్య ప్రవర్తకుఁడై, సౌందర్యముతోఁ దక్కిన ఉదారాశయముల నెట్లు విలోకించినాఁడో గమనింపుఁడు: "We shall live in the Absolute, in the Beautiful, and in the Good."

భారతాశయములు పాశ్చాత్యుల దృష్టి నాకర్షింపక మున్నె ప్రాచీపృథ్వియందంతటను విజృంభించినవి. బౌద్ధ యాత్రికులు తమ దివ్వెలను చేఁబూని జపాన్, టిబెట్, చైనాసీమల కరిగి తమధర్మము నందు స్థాపించిరి. వీరు నాటిన భావాంకురములు కాలక్రమమున పెరిఁగి, ఆసియాసారస్వత క్షేత్రములందు తమ పూవులను, పండ్లను జలజల రాల్చినవి. జపాన్, చైనా దేశ గ్రంథములను పరికించితిమేని, భారత విజ్ఞానసౌరభమును వానియందుఁ గాంచఁగలము. ఇటీవల భారతయాత్ర సలిపిన జపాన్ కవీంద్రుఁడు యోనెనోగూచి పంక్తులను పరికింపుఁడు:

"Is there anything new under the sun?
Certainly there is.
See how a bird flies, how flowers smile!"
'To face only the sky and forget the land,
O! to become a rider of the winds!
What a joy to find a greater song amid
the clouds!"
"Is it a fallen leaf?
That's my soul sailing on
The Silence of life."
"My lover's lengthened hair
Swings o'er me from Heaven's gate;
Lo, Evening's shadow!"
"She in her velvet sandals
Stepped airily
As the stealing yellow steps of the young moon
Toward an ancient forest of love.
I heard her eloquent violet eyes
Whispering love, but from the heaven
Gazed down the stars in gathering tears"
"Playing the unseen strings of love and
I heard the unheard song of Beauty in
the moonship."

(Vide Yone Noguchi's two volumes
*The Eastern See* and *The Pilgrimage.*)

ప్రాచీసాహితియందలి మహత్త్వకవిత్వ పటుత్వసంపద యెట్టిదో పరికించితిరా ? ఉత్తమాశయము లిందు కోటివత్తుల వలె నెట్లు వెలుఁగొందుచున్నవో విలోకించితిరా ?

ప్రాచీవిజ్ఞానముయొక్క గురుగుణములను గుర్తించియే ఎమర్సను మహాశయుడు "I look for the hour when that Supreme Beauty which ravished the souls of those Eastern men, and through their lips spoke oracles to all time, shall speak in the West also" అని నాడు. కార్లైలువలె నితడు మన భగవద్గీతయొక్క అనువాదమును శ్రద్ధతో పఠించినాడు తమ రచన లీ పఠనముపై నాధారపడియున్న వని ఈ గురుశిష్యులు వచించిరి. భగవద్గీతయందలి మహత్తర తాత్త్విక భావవాతూలము వీరి మనసులను సోకుటచేతనే వీరిరచనలు తాత్త్వికసౌరభముతో తొలుకాడుచున్నవని సాహిత్యవిశారదు లెఱుంగుదురు. ఆదర్శవిద్యార్థులందొక్కరుడై, భారతవిజ్ఞానమందలిపరంజ్యోతికి జోహారనిన మఱొక పాశ్చాత్త్యమేధావి మేక్సిములరని జగతి యెఱుంగును.

తాత్త్వికసంపద, మతమహత్త్వము జిజ్ఞాసువుయొక్క ఆత్మశక్తిని వృద్ధిచేయును; మనుజునకు సర్వతోముఖాభివృద్ధిం జేకూర్చును. కావున నివి ఉత్తమవిద్య కనివార్యమని తెలుపుట నాయుద్దేశము. ఇట్టివిద్య సౌందర్యనిధానములైన తావులయందు, ప్రకృతివిభూతితో నలరారుచోటులందు, ప్రశాంతమైన ప్రదేశములందు, మనుష్యాత్మతో గుసగుసలు సలుపు తావలములందు సాధ్య మగు నని వాకొనుట నాయాశయము.

ఈ యాశయసిద్ధికై నడుముగట్టు ఆచార్యుల ప్రబోధ దృష్టాంతములు మన కక్కఱయైయున్నవి.

ఇట్టి మహాచార్యులు భారతసీమయందు తఱచుగ పుట్టు చునేయున్నారు. శంకర, రామానుజ, రామానంద, మధ్వ, వల్లభాచార్యులును, చైతన్యకబీరాదులును విజ్ఞానభాస్కరులై, తమ జ్ఞానమయూఖములచే సర్వజనుల మనసుల నాలోకిత మొనరించిరి.

"నిజాత్మ నెఱిగి, ప్రతిమానవుని ఆత్మయందు దాని నవలోకించునాతడే విద్వాంసు" డను గంభీరవాక్య భారత ధరిత్రినుండి వెడలి సర్వదిక్కులందు ప్రతిధ్వనించినది. అధునాతనభారత వైజ్ఞానికప్రతినిధులై, రాయబారులై సభ్యజగతి దృష్టినాకర్షించిన రవీంద్ర రాధాకృష్ణులీవాక్యను పలుమాఱువచనన మొనరించుకొని దీనిఛాయలను తమరచనలందు ప్రవేశపెట్టిరి. (Vide Rab ndranath's '*Man*' and Radhakrishnan's S r George Eirdwood Memorial Lecture, h s "*Hındu View of Life*", *The Heart of Hindustan*," etc., etc , etc.)

భారత విద్యావిధానమున కెప్పుడు పునాదులైనవి ఉపనిషత్తులందలి సత్యములే! పొట్టకూటికై గంజిమెతుకులకై నేర్చినదే చదువని మనసీమయం దీవఱలో నెవ్వరును అపోహపడలేదు. పరంజ్యోతిని పూజించి, "ఆత్మవత్సర్వ భూతాని" యను వాక్యనందలి సత్యము ననుష్ఠించి పరార్థజీవులై, పూర్వమునీషులు సర్వసమయములందు, సర్వ సీమలందు పూజింపఁబడిరి.*

---

* గర్వ ముడిగి యోల్లుంచిన
నిర్వాణుల కేమియొగ్గు నీతిగ "విద్యాక

మనదృష్టినుండి తరలి చాలకాలమైనను, మనయాచార్యులు నేడును నేటియాదర్శవిద్యార్థుల పూజాపీఠములందు భక్తిపుష్పాంజలిని బడయుచునేయున్నారు. "నేను భారత పథికుఁడ"నని కబీరు చెప్పుకొన్నాఁడు. ఈ విజ్ఞానయాత్రికుఁడు స్థానస్థానములందును సంచరించి, ఎందఱియాత్మలనో జ్ఞానామృతముచే తనిపినాఁడు. ఇట్టిమహాత్ముల ప్రేమతారకమునకు మనసు లొగ్గుటకై బహుజాతులవారు మనసీమ కరుదెంచిరి. వివిధభావములకు, వివిధమతములకు, వివిధజాతులకును మన నేల యాత్రాస్థల మైనది. వ్యక్తులు వేఱైన నేమి, ప్రకృతులు వేఱైన నేమి, ప్రేమసూత్రముచేఁ గట్టువడినపుడు పారస్పర్యములు తలసూపునా? సంఘీభావమంత్రము తారకమైనపుడు, ఉఱుములును, పిడుగులును నేలరాలినను, ఈమంత్రసూత్రము పుటుక్కున తెగిపోవునా? నేఁడును నలందానవద్వీపములకు పోయి చూడుఁడు. మొహెంజొడారొహారప్రసారనాథుల కరిగి, భూమినుండి లేచు దృశ్యములను పరికింపుఁడు. తక్షశిలభూగర్భమునినుండివెల్వడు విహారములను, విశ్వకళాపరిషత్తులను విలోకింపుఁడు. నాఁటి మహత్తరభావసూత్రము లీ పవిత్రస్థలములందు విరాజిల్లుటఁ గనులారఁ జూచి యానందించితిని. విశాలతక్షశిలాస్థలమున సిరికప్, చిడితోప్ మున్నగుచోటులందు గ్రీక్ దేశస్థుల జిజ్ఞాస నేఁ డింకను చిమురుచున్నట్లు

---

సర్వత్ర పూజ్యతే" యన
నుర్వి న్విద్యాధికుండు యోగ్యుఁడు సభలన్.

(కుచేలోపాఖ్యానము)

తోఁచుచుండును. ఈ జిజ్ఞాస, ఉద్యోగములకు సంబంధించినదా? ధనసంపాదనమునకు సంబంధించినదా? ఇది పరంజ్యోతిని విలోకించుటకై, పరమార్థమును చేఁబట్టుటకై నాఁటి విద్యార్థులం దుదయించిన విజ్ఞానదాహము కాదా? ఈ దాహముఁ దీర్పఁజాలు నాచార్యులు ముక్తిదూతలై, ప్రత్యక్షదైవతములయట్లు మనపుణ్యభూమియందు గోచరించుటచే వివిధ దేశీయులు మన గురుకులములఁ జేరుచువచ్చిరి.

ఆధునికయుగమందుఁ గూడ నిట్టియాచార్య లపుడపుడు భారతావనియందు గోచరించుచున్నారు. రామకృష్ణ, వివేకానంద, రామమోహన, కేశవచంద్ర, దేవేంద్రనాథ, శివనాథ, విద్యాసాగరాదులు దివంగతులైనను, వీరివాక్కులింకను ప్రపంచమందు ప్రతిధ్వనులు లేపుచున్నవి. ప్రకృతిసౌందర్యముతో నలరారు దక్షిణేశ్వరమందే రామకృష్ణుఁడు పరంజ్యోతిస్సందర్శనమునకై తపించినాఁడు. ఈతఁ డేమానవునికడ నక్కరములను నేర్వలేదు. రామకృష్ణునిచే నక్షరాభ్యాసముఁ జేయించినది "అమ్మా!" యని ఈతఁ డనవరతము అశ్రుపూరితనయనుఁడై సంబోధించుజగద్ధాత్రి. కాళికరుణచేత మూర్ఖుఁ డొకఁడు కాళిదాసైనాఁడు. కాళి కారుణ్యముకతన నిరక్షరకుక్షి దివ్యాక్షరములను దివిజకల్లోలినీపూరమట్లు వెడలఁగ్రక్కినాఁడు. ఈ యక్షరములు భావభువనములతో నిండియుండుట గుర్తించిన యువకుఁడు నరేంద్రనాథుఁడు. పరుసవేది తాఁకినంతన యేవస్తువైన పసిఁడి యగునట్లె వడి పరమహంస స్పర్శచే నరేంద్రనాథుఁడు వివేకానందుఁ డైనాఁడు. ఆచార్యుఁ డిచ్చిన

దిక్కైను చేఁబూని, వివేకానందుఁడు దానిచే సమస్తక్షాత్రిని ఆలోకిత మొనరించినాఁడు. భారతహృదయమందలి అద్భుత శక్తిని నవయుగమున వీరికతన నన్యదేశములెఱుఁగఁజాలినవి. పశ్చిమదేశములనుండి రివ్వురివ్వున వీచు ప్రతికూలవాతూలములు వీరివలనఁ గొంతకాలము వెన్కకు తరలినవి. కుబుసము విడిచినపామువలె భారతమానసము తనపై పెరిఁగినపొరను వీరి యుద్బోధనముకతన నేల రాల్చి, నూతనశక్తి నందినది.*

పశ్చిమావనియందలి మనీషులు కొందఱు వీరి బోధనలందలి పరమార్థమును గ్రహించి, ప్రపంచవిద్యావిధానమున కది యమృతసేచనము కాఁజాలు ననియు, వసుమతియందు చెలరేఁగు సెగ లిట్టివిద్యావిధానమువలన నీగిపోవు ననియు వచించిరి. వీరిలో ముఖ్యుఁడు రోమెరోలండు. "రామకృష్ణమతావలంబి" నని ఈతఁడు తెలుపుకొనుచుండును. ¶

---

* భారతస్వాంతమును రామకృష్ణపరమహంసప్రబోధనము సోఁకిన రీతిని పరిశీలించుచు, ఈతని శతవార్షికమహోత్సవసమయమున "హిందూ" పత్రిక యిట్లు వ్రాసినది :

"It was this sublime confidence in the truth of his own experience that made the earnest and troubled minds who came into contact with h m hold on to him as to a rock in the sea of uncertainty: and this simple countryman speaking out of the profundity of his own being, evoked a sure response in the national soul covered but not smothered by the veneer of alien civilisation. He merely restated the fundamentals of Indian faith in the idiom of his own times."

¶ "The misfortune of the world comes from its want of knowledge. Let us then teach it to know. Let us enlighten it by preventing it from doing harm—from harming itself. For he who harms his neighbour, does not know that it is himself whom he is harming...It is the supreme miracle of Rama Krishna that in him "thou" is "I" that the whole world is not only reflected but also incarnate in a man's heart,—God is realised on earth, in His universality and His multiplicity."—Romain Rolland.

ఆంగ్లవిద్య భారతదేశమున నావిర్భవించినపిదప, నాంగ్ల విద్యార్థులందు హిందూమతము నెడల ననురక్తిఁజూపినకొలఁది మందిలో ప్రథముఁడు వివేకానందుఁడు. "ఇది యిరువదవశతాబ్దము. ఈ కాలమునకు వెనుకటివిజ్ఞానము కూడదు. దానిని గుఱించి వచించుట ఛాందసులకే చెల్లును" అనువారి సంఖ్య నరేంద్రునకు నలువలంకులఁదను పెరిఁగియుండెను. హిందూ సంఘమం౯ అవిద్యచేఁ గొందఱుకొందఱు అవలంబించుచు వచ్చినదురాచారములు హిందూమతమునుండి జనించినవేయని దానిపై కారములను మిరియములను నూఱిపోసినవా రెందఱో ముందులకు వచ్చిరి. బ్రహ్మసామాజికుల ఉద్దేశములు గంభీరము లయ్యు, వారియుద్బోధనములు విశేషముగ నుపనిషత్తులతో సన్నిహితములై యుండినను, భిన్ననామములు భిన్నాభిప్రాయములకు చోటొసఁగి వానిని హిందూమతముపై నుసిగొలిపినవి. సంఘస్థదురాచారము లొకదరినుండి, భిన్నాభిప్రాయము లింకొకదరినుండి, ఇంగ్లీషు సగము నేర్చి, మాతృభాషను మఱచి, సంస్కృతమును స్వప్నమందైనఁ జూడక యే మతమునకును జెందని అభాగులయవిశ్వాసము, జుగుప్స, పరిహాసము వేఱొకదరినుండి, తమమతముకతన ముక్తిమూఁడు నిముసములలో చేఁబడు నని చెప్పి పలువురను తమలోఁ జేరుచుకొనుచు విజృంభించుచున్న మిషనరీల యత్నము * లింకొకవైపున నుండిఅభిమన్యునిఁదాఁకిన నూర్గురుకౌరవులట్లు హిందూ

---

* క్రమనిష్ఠవలనఁగాని, మానవుఁడాత్మసంయమ మందఁజాలఁడనియు, నాత్మోన్నతిఁ గనులఁ జూడలేఁడనియు, ముక్తికై యత్నములు చాఁపఁజాలఁడనియు హిందూమతము జలదగంభీరస్వరమున వాకొనుచున్నది. ఒక్క నాఁ

మతముపై దాడివెడలినవి. మతమునకును, విజ్ఞానమునకును, జీవనమునకును అవినాభావసంబంధ మున్న దొక్క భారతసీమ యందే! హిందూమతము నేల కూలినపుడు భారతవిజ్ఞానము గోతిలోఁ గూలఁబడును. భారతజీవనము శ్మశానమందలి నిస్తబ్ధతవలె భయద మైయుండును. భారతనాగరకత నిముస ములో నింకిపోయి, పాతాళమునఁ గాఁపుర ముండును!

గభీరకూపమున గుభాలునఁ గూలనున్న హిందూవిజ్ఞానమును కాపాడిన మహాత్ములు రామకృష్ణ వివేకానందులు.

---

టితోఁగాదు, ఒక్క జన్మముతోనైన నీనిష్ఠ కడముట్టదు. అర్జునుఁడే ముక్తినందుటకు మున్ను బహుజన్మము లెత్తవలసివచ్చె నని భగవద్గీత తెలుపుచున్నది. మానవుఁ డొకతూరి చచ్చినంతనే, చిరనరకమో చిరనాకమో వానికి ప్రత్యక్ష మగు ననియు, హిందువులు వాకొనుకర్మసిద్ధాంతము వట్టి బూటక మనియు క్రైస్తవమహాశయులు సెలవిచ్చుచుందురు. కర్మసిద్ధాంతమందలిసత్య మిటీవల శాంతిదేవివలన రూఢియైనది. 1935 డిశంబరు 4 తేదీని ఢిల్లీయం దీ బాలికను గలసికొని, ఈమెను పరీక్షించి, యీమెనుగురించిన ఉదంతమును ప్రజల కెఱింగించితిని. (1935 డిశంబరు 14 నాఁటి ఆంధ్రపత్రికను చూడుఁడు) హిందుమతమును జూచి వెక్కిరించువా రెవరైన నేఁ డెదుర గనుచో, ఈ మతమహత్త్వముయొక్క ప్రత్యక్షదృష్టాంతమైన శాంతిదేవి నొడిఁ జేర్చుకొని, వారివాదనలను తుత్తునియలు చేయఁజాలుదును. హిందూ మతమునకు స్వస్తి చెప్పి ఏసు నాశ్రయించినఁగాని మనకు గతి లేదఁట! ఏసు రెండు వేలేండ్లక్రితమువాఁడు. బహుయుగములమాట దేవుఁ డెఱుఁగును. అంతకుమున్ను నాలుగువేలేండ్లలో (సృష్టి ఆఱువేలేండ్ల దనికదా క్రైస్తవు లందురు!) పుట్టిచచ్చిన బహుసంఖ్యాకులు చిరనిరయమున మ్రగ్గుచున్నారు కాఁబోలు! నాలుగువేలేండ్లు నిద్దురపోయి, మ్రగ్గుచున్న ఆత్మల చిటచిటలకు లేచి, మానవులకు ముక్తిదాత కాఁగలుగునాతఁ కరుణామయుం డైన జగదీశుఁడు సృష్టించినాఁడుకాఁబోలు! ఈ యంశములనుగురించి కొంత

దుర్విమర్శనలు చేయు విద్యాధికులను వివేకానందస్వామి "మీసములు కల పసిబిడ్డ"లని గర్హించినాఁడు.

నిండుగ నొడలున బూడిద పులుముకొని, ముక్కు-మూసికొని మూలఁబడియుండు మని మానవునకు హిందూ మతము ప్రబోధించుచున్న దని పలువురు అపోహపడుచుండిరి. దీనిదృష్టియం దున్నది స్వాంతముక్తి యని వీరియూహ. వివేకానందుఁడును, మన రాధాకృష్ణుఁడును * ఈ యూహను తుత్తుని

కాలమునకు మున్ను "The spirit of Co-operation" అను నాంగ్ల వ్యాసమం దిట్లు తెలిపియుంటిని :

Self-discipline is the *Open Sesame* of untold Treasures of the Spirit, involving as it does the complete repression, at its very threshold, of any unwholesome complex, termed by Mr. Freud the greatest psychologist of the Present Era, as the constellation of ideas of the unconcious mind. Self-control invests the life of man with the halo of Royalty. His strength is his forte. His conquest over himself is the glory of his life. He has nothing to fear. His march is majestic. Temptation and Tragedy bark and recede, filled with the shame of defeat before his potential detachment. The man of self-control and self-realisation is an asset to Humanity. He is the effective expression of *Dharma* or of what the Germans say *Sittlichkeit*. His precept has the perfume of Elysium and his example the sincerity of God. He is the strength and solace of the needy and virtuous. He is a Colossus that stands above the jarring elements of life. He is a lion that strikes terror in the heart of chicanery and falsehood.

* "These sannyasins do not cut themselves off from the world and let it go to rack and ruin. The greatest of their class, Buddha and Sankara, Ramanuja and Ramananda, and scores of others have entered into the life-blood of the nation and laid the foundations of its religion. Their names are today a part of the national heritage." (Vide Sir Raadhakrishnan's "The Heart of Hinduism", Page 20)

యలు చేసివదలిరి. పైన నేఁబేర్కొనిన ఆచార్యులు పరముక్తికై తమజీవనములను ధారపోసినవారే! పరముక్తికై తాను నరకమున ప్రమగ్గవలసివచ్చినను, ప్రమగ్గెదననినాఁడు వివేకానందుఁడు. అభాగులను సేవించుటకై జన్మపరంపరల నాహ్వానించెద నని యీ మహాపురుషుఁ డనినాఁడు: "Would that I could be born and reborn again and suffer a thousand miseries, provided that I might adore and serve the only God that exists, the sum-total of all souls and, above all my God the evil-doers, my God the unfortunates, my God the poor of all races". ప్రపంచమునెడల విముఖుఁడై

The world that runs adrift in the poisonous flood of greed and violence is prevented often by one man of lofty character from falling head-long in the whirl-pool of annihilation. Man is man if he is the embodiment of sterling virtue, if he is the expression of Spirit. He is worse than devil if he is Pretence or Insincerity moving in flesh and blood. We have it from Shakespeare and Tagore that the exterior does not reveal the inner man. The exterior of a God-man need not exhibit the flush and glow, the smile and beam of Heaven. An Iago may have a fine skin. The gold in his skin does not say a word about the hell-fire blazing in his mind. He is not recognized soon in his true colours. The evil wrought by him in Human Family is horrid and death-like. "The motive-hunting of motiveless malignity," as Coleridge puts and Bradley endorses it, flings angelic beings in the vortex of terrible tragedy. (*Vide* Criticism of Shakespeare's Tragedies by Coleridge and Bradley).

But the inner man is not the growth of a single day or a single life. Man will have perforce to pass through a process of rigorous *tapas* before he can school himself into submission or gain perfect mastery over the malcontents which invade his mind.

The bounds of mind are conterminous with the bounds of the universe. The training of mind is the life-long endeavour of great men. A passing emotion, however lofty, can invain lift a man to the Empyrean of Perfection. Ceaseless toil and steady evolution embracing—may be—several births are indispensable for the harmonious development of Cognition, Emotion and Volition, for the adjustment of *Satva*, *Rajas* and *Tamas*, for the adaption of Amba, Ambika and Ambalika, for the concomitant play of *Trimurties* within human breast, for the simultaneous

సంతతధ్యానమందు జీవనముఁ గడపెదనని వాకొనినసన్నిహితు నొకని నుద్దేశించి, పవిత్రాగ్రహమును వ్యక్తపఱచుచు వివేకానందుఁడి ట్లనినాఁడు : "Put off to the next life, the reading of the Vedanta, the practice of meditation. Let this body of today be consecrated to the service of others!" మన విజ్ఞానము నించుక చవిచూచిన ప్రతీచీ మేధావులు తమ గ్రంథములందును, తమ జీవనములందును మన ధోరణిని వ్యక్తపఱచిరి.* సుప్రసిద్ధ పాశ్చాత్త్య రచయిత

---

practice of *Karma, Upasana* (*Saguna* and *Ntrguna*) and *Gnana Yogas,* for the beatific realisation of the Father, the Son,. and the Holy Ghost, and for the attainment of *Satchitananda* (*Sat, Chit* and *Ananda*) which constitute the Divine self of man. Eternal Hell or Eternal Heaven after the sojourn of a single life on Earth are not in the province of Hindu Conception. Whatever might be the contentions of Modern Christian brethren with regard to the fate of Non-Christians, the Bible is there and Jesus is there to tell you in unequivocal language that Ibrahim reached Heaven long before the birth of the Son of Man. The Karma Theory of Hindus is the most effective exposition of the evolution of soul. Even Arjun, the great devotee that he was, fell below the mark. His lofty wish of becoming an ideal saint was turned down by his Divine Charioteer since his warring flesh, his bubbling blood, his birth and breed, his practice and predilection,—in a word his nature and nurture couldn't be out-flanked in a trice to station him on the lofty pedestal of a selfless seer. The limitations, which still weighed on Partha could not—the divine sight vouch-safed unto him then notwithstanding—suffer him to see *Akhanda Aparichinna Sarvavyapa Moolaswarupa* but allowed him to gaze only at *Viswarupa* (*vide* Chapter XI Geeta) and shriek for the vertigo that seized him at the very appearance of superb, stupendous, superhuman Phenomenon. (*vide* The Madras Journal of Co-operation, July 1933 )

* ఈ వాక్యములోని ఛాయను గనుడు :

" I am a man, and I cannot be in " different to anything human" (*Homo sum, humani nihil a me alienum puto*). Terence.

Victor Hugo తన కెఱ్ఱుదలంచిన కొండొకవ్యక్తి నుద్దేశించి, "Oh! fool, who thinkest that thou art not I" అనినాఁడు.

ఆధునికయుగము దుర్భావగర్భిత మైయున్న దని నేఁటి ప్రతీచీమనీషులే వాకొనుచున్నారు.* ఈ యుగవాతావరణమున దివ్యశంఖారవమట్లు వివేకానందునివాక్కు ప్రతిధ్వనించినది. "పరోపకారార్థ మిదం శరీర"మ్మను భారతవచనము పశ్చిమవాసుల హృదయకవాటములను దట్టినది.❡ ఈవాక్యమొకప్పుడు భారతావనియందు ప్రతిజిజ్ఞాసువునోటను దారకమంత్ర మైయుండెడిది. మన జ్ఞానోపాసకులు కర్మవీరులుఁ కూడఁ గారా? మనవిద్య గ్రంథరచనమందును, ప్రత్యక్షజీవనరచనమందును, భావమందును, వచనమందును, క్రియాంగణమందును వ్యక్త మయ్యెడిదికదా! ప్రాచీనజిజ్ఞాసువులదృష్టియందెట్టిశక్తి యుండెనో కాని, ఉత్తమాశయములు ప్రకృతిగ్రంథమున దివ్యాక్షరములందు సువ్యక్త మైయుండుటఁ బరికించి

---

* "This is an age of increasing mental uneasiness, of forced beliefs, hypocrisy, cynicism, abandon and impatience."
—H. G. Wells.

❡ మన విజ్ఞానము నెఱిగిన మహామనీషి రోలండు భారతమాత కత నసే మానవజాతికి ముక్తి కలుగునని తెలుచుగా వాకొనుచుండును. ఇటీవల నీ మహనీయుడు పలికినసుడువును పరిశీలింపుడు :

"In a world crisis it is in India that I repose my absolute faith for the emancipation of the human race." (Vide Romain Rolland's letter addressed to Mr. Shyama Prasad Mukherjee, Vice-Chancellor, The University of Calcutta in June 1938)

తనివార వానిని పఠించువారు. సూర్యచంద్రాదులనుగూడ నాచార్యుల గావించుకొని పరార్థజీవనమందలి మహత్త్వ మును వారివలన నెఱుంగుచుండువారు.

" ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయుఁ
సుముఁ హర్షంబు గావించు నమృతసూతి
అర్థితుఁడు గాక జల మిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు దారె పరహితాచరణమతులు. "

ప్రస్తుతసమయమున ప్రపంచదృష్టి నాకర్షించిన ఆచా ర్యులు రవీంద్రరాధాకృష్ణులును, స్వామి భగవాన్‌దాసు లును, అరవిందగాంధులును. వీరు ముందంజవేయఁ గాంక్షించు మహాసీయులు. కాలపథమున క్రొంగ్రొత్తదృశ్యములను చూడ వలె నని ఆతురతపడుయాత్రికులు. సముచితసందర్భములందు సంస్కరణ మవసర మని దానికై పాటుపడు మహాపురుషులు.

వీరికి మార్గదర్శకుఁడు రామమోహనుఁడు. ఆధునిక యుగమున కీతఁడు కన్నతండ్రి; బహుమతములను మథించిన దిట్ట; వివిధసారస్వతములందుఁ గ్రుంకులిడిన ప్రజ్ఞాధురీణుఁడు. సంస్కర్తలకు నోజ్జబంతియై భారతాంబను నవయుగద్వార మునఁ బ్రవేశపెట్టినయాచార్యుఁడు.

ఆధునికవిద్యావిధానమున కంకురార్పణ మొనరించిన వ్యక్తి ఈతఁడే! ఈతనికిఁ జేయూఁత నొసఁగినవారు డేవిడ్ హేర్, రాజారాధాకాంతదేవ్, బుద్ధినాథముఖర్జీ యను బుద్ధి శాలులు. పర్షియన్, ఆరబిక్, సంస్కృతభాషలు వెనుక

నిలువంబెట్టఁబడినవి; నవయుగ సింహాసనమునం దాంగ్లము పట్టాభిషేక మందినది.

ఆంగ్లవిద్యకతన మనము కొంతలాభము నందితిమనుట నిస్సంశయము. దీనివలన మనము ప్రపంచకముతో చుట్టఱికమును గలుపుకొంటిమి. అధునాతన రాజకీయ, ఆర్థికవిధానముల నెఱిఁగితిమి. కాని గిద్దెఁడులాభముతో కుంచెఁడునష్టము మనకు ముట్టినది. భక్తులపైఁబడిన దెబ్బ భగవంతునకు తగిలినట్లు మాతృభాషలకును, సంస్కృతమునకును దగిలిన దెబ్బ భారతజాతీయత్వమునకు తగిలినది.

ముందంజవేయఁ గాంక్షించువారిలో నే నొక్కండను. వివిధభాషలతో నాంగ్లము నారాధించువారిలో నే నొక్కండను. మూఢవిశ్వాసమును తుత్తునియలు చేయ నెంచువారిలో నే నొక్కండను. ఉచితసంస్కరణమునకై చెవి గోసికొను వారిలో నే నొక్కండను. కాళ్లకు తిరుగళ్లు గట్టుకొని, ముఖమునజస్రము వెనుకకు త్రిప్పి నిలుచువారిని గర్హించువారిలో నే నొక్కండను. యువకుఁడనై నడచినడచి, దిగ్వలయమున క్రొంగ్రొత్తకాంతులను చూడవలెనని మక్కువపడువారిలో నే నొక్కండను. కాలపథమున కదలిపోయి నూతనగీతికలకు వీనుదోసి ల్లొగ్గ నాతురతపడువారిలో నే నొక్కండను. ప్రపంచజాతులతో, ప్రపంచదేశములతో, ప్రపంచమతములతో, ప్రపంచభాషలతో వియ్యమంది నెయ్యమున మసలవలెనని కాంక్షించువారిలో నే నొక్కఁడను. బాహువులుచాఁపి భూగోళమును కవుంగిలించుకొని "ఇది నాగృహము;

యిది నాయిహము; యిందలివారు నా కుటుంబమువారై నాకు మిగులఁ గూర్చువారు" అనిపలుకుటకై ముచ్చటపడెదను. ఇతర జాతులవారిని, ఇతరమతములవారిని తమ మతములను మంటఁ గలుపుఁడనియుఁ, దమజాతులను గంగపాలొనరించుఁడనియు, నా మతమునకు నమస్కరింపుఁడనియు, నాజాతి నేడుగడఁ జేసికొని మనుగడఁ గడపుకొనుఁ డనియు నేఁ గోరను. నన్నుఁగన్న తల్లి భారతమాత విశాలహృదయ. సర్వజాతులకును, సమస్తమత ములకును, వివిధభాషలకును, విభిన్నప్రకృతులకును స్వాతం త్ర్యమొసఁగి, లింగభేదములు కలిగి రంగుభేదములు కలిగి మా నసిక సంపదయందు వ్యత్యాసములు గలిగిన బిడ్డల నొకచే దృష్టిఁ జూచుతల్లివలె వానిని విలోకించు లోకపావని భార తాంబ. అన్నిమతములు, అన్నిజాతులు గుండగొట్టఁబడి ఒక్క టేయుండవలె, తోఁచినఁగాని యైక్యభావము విరాజిల్లనేరదని మనతల్లి యెన్నఁడును తలఁచియుండలేదు. వివిధరుచులను, వివిధ ప్రకృతులను, వివిధ శక్తులను తెగఁగొట్టుట సాధ్యము కా దని యెఱిఁగి, పెక్కుమణులం దొక్క కెంపుదారమును జొనిపి చక్కనిమాల్యము గ్రుచ్చునట్లు వ్యత్యాసములందు ప్రేమసూత్రమును చొప్పించి అపూర్వదామముచే నాత్మ గళము నలంకరించుకొని, దిక్కామినులకు మిఱుమిట్లుగొలిపిన లోకమాత భారతమాత. Unity in difference అనువాక్కు వివిధరాగములతో నొక్కండై రాజిలు నింద్రధనువువలె నొప్పి నది మనసీమయందే! జగదీశుని తోఁటయందలి మల్లెపూవుల వలె గగనతలమునఁ గాంతిలు పెక్కుచుక్కనెచ్చెలు లొక్క

నిస్తబ్ధగీతికచే తమవనమాలివీనుదోయికి విందు సేయుటేల, పెక్కుజాతులు మననేలయందు వఱలి ఏకగ్రీవముగ జాతీయ గీతిక నాలపించినవి; పెక్కుమతములు మధుర మంజుల ప్రణయ గీతిక నాలపించినవి. దివ్యసరోవరమున స్మితవదనలై జలక్రీడ లాడు దేవాంగనలచందమున భారతవాతావరణమున బహు మతములు కడువేడుకతో కాలము గడపినవి. సూర్యచంద్రుల నొక్కరోటియందు దంచిదంచి,అందలిపిండితో నొకపెద్దగ్రహ మును తయారొనరించి "దివానిశల నీవే యేలు"మని సృష్టి కర్త దానిని నియోగించుచో, వానిసృష్టి యెంతకాలము నిలుచును? ఏకైకదృష్టి గలిగినవైనచో, నేకైకగమ్యస్థానముదెస సాగిపోవుచో మానవసంఘమున వ్యత్యాసము లున్న నేమి? భారతీయులను గాక అన్యదేశీయుల నెవ్వరినైన నుద్దేశించి, "మీభాషలను, మీజాతిని, మీమతమును మూటగట్టి, మూలఁబెట్టుఁ" డని ఆనతిచ్చుట సృష్టికర్తకైన సాధ్యమా? "క్రైస్తవమతమునకు స్వస్తి చెప్పుఁ" డనియు, "నాంగ్లజాతీయత్వమునకు సెలవిం" డనియు, నాంగ్లేయులను సంబోధించి పలుకుట కెవ్వరికైన నెన్ని వేల గుండె లుండవలెను? ప్రపంచ సంబంధమునకై, నూతనసారస్వతసంపాదనమునకై మన మాంగ్లమును నేర్చుకొనక తప్పదు. వివిధ మతస్థులను గుర్తించుటకై, విశేషపరిజ్ఞాన మందుటకై భిన్నమతతత్త్వములను గ్రహించుట మనవిధి. కాని మనభాషకు, మనజాతికి, మన మతమునకు నెగ్గు రాకుండురీతిని రోయుట మనకర్తవ్యము. అమ్మరొమ్మును, పాలిచ్చినరొమ్మును, జీవనము నిలిపిన రొమ్మును, స్వర్గమును బురుడించురొమ్మును పడఁదన్ని పొరు

గింటిపొలంతులపెంపుడుబిడ్డ కాఁగోరువ్యక్తిగర్హితుఁడు కాఁడా? మనజాతి, మనమతము, మనవిజ్ఞానము, మననాగరకత కంపుగొట్టు పెంటప్రోగులగుచో, వానిని దుడిచి పాఱవేసి పరమతములను, పరజాతులను ఆశ్రయి చుట మనకర్జము. భారతవిజ్ఞానము రత్నపుఖని యనియు, భారతజాతి శుక్రతారను బోలునదనియు, భారతభాషలు శారదవలచిన దివ్యభూష లనియు, భారతమతము భావమణిపూరితమంజూష యనియు విదేశమనీషులే వాకొనుచున్నారు. వీనిని విసరికొట్టుట కూడని తెగువ కాదా? కాలము కడచినకొలఁది మనసంప్రదాయములందు, మననాగరకతయందు కలుషు కొంత పెరిఁగినచో, దానినూడఁబెఱుకుట మనకర్తవ్యము. భారతవ్యక్తిత్వమునకు, భారతజాతీయత్వమునకు భంగముఁ దెచ్చునాచారములను మనము “దూ! దూ!!” యని పిలుచుచుంటిమి. మన విజ్ఞానమును జ్ఞప్తికైనఁ దేఁజాలనివిద్యావిధానమును పట్టి ప్రాఁకులాడుచున్నాము. ఈ విధానమం దెన్నో లోపము లున్న వనియు, తగుమార్పు లిందు తలసూపవలె ననియు మనవిశ్వవిద్యాలయములతో సన్నిహితసంబంధముగల పల్వురు పెద్దలే వచించిరి. * ఉద్యోగములను సద్యోగములను తద్దివాయనముల

* "...But it is a healthy sign that there is a remarkable agreement among educationists today that the system of education requires drastic revision from the foundation to the flagpole. It is out of date and unsuited to modern conditions and involves a colossal waste of intellect and energy. In all its stages, Primary, Secondary and University, a reorientation is necessary. (Vide Sir Radhakrishnan's splendid Convocation Address delivered at the University of Allahabad on 13th November 1934).

ట్టిన మన చేతులఁ బెట్టుటలేదు కావుననే దోషగర్భితమైనదని నేను తెలుపను. ప్రపంచమందు చెలఁరేగు ఆర్థికదుస్థితులకును భారతార్థికపరిస్థితులకును అవినాభావసంబంధ ముండుటచేత రాబందులట్లు మనపై నిపుడు క్రొత్తచిక్కులు వ్రాలుటచేతను, ఇపుడు చెల్లుబడియగుచున్న రాజకీయార్థిక పాలనావిధానములు మనకంతగా ననుకూలమై నిలువకపోవుటచేతను, దేశీయపరిశ్రమలను గాని, ఉన్నతపరిశ్రమలనుగాని అధునాతన పద్ధతుల ననుసరించి, మన దేశమందు నెలకొలుపుటకును, వీనివైపు విద్యాధికులదృష్టి నాకర్షించుటకును తగుయత్నములు పొడసూపకపోవుటచేతను, తగురక్షణ మెఱుఁగక మన వ్యవసాయవాణిజ్యము లట్టిటు లాడుటచేతను, సేద్యమును ప్రధాన వృత్తిఁ గావించుకొనిన మన గ్రామవాసులు నవయుగరీతుల నెఱుఁగక వెనుకఁబడి యుండుటచేతను, దుర్వ్యయభూయిష్ఠమైనఆచారము లింకనుహిందూసంఘమునపరఁగంగలట్లువికృతనృత్యము సలుపుచుండుటచేతను, దేశమునకు తీఱని చెఱుపుఁ దెచ్చు దురంతదోషములు విజృంభించుట విలోకించి అవి మనవిద్యావిధానము కనిన రక్కసిబిడ్డలనివచింపను. రోగమును కుదుర్చుటకుమాఱు రోగి నే కడముట్టింపవలెనను సిద్ధాంతమును లేవఁదీయు మహాశయులవలె, లోపములు గల వని మనవిశ్వవిద్యాలయములను తుదముట్టించి శంఖమును బూరింప దొరఁకొనను. సంస్కరణమునకు లొంగని వ్యక్తినిగాని, సంస్థనుగాని వసుమతియందుఁ గానమని నాదృఢవిశ్వాసము. ఉన్నదోషములను దుర్బినుయంత్రములతో పరికించి "అమ్మో!" యనను.

సముచితసంస్కరణము నొందునో, మన విశ్వకళాపరిషత్తులు స్వర్ణదేవాలయములు కాఁగలవనినాయాశ. మనవిజ్ఞానమును, మన జాతీయతత్త్వమును,మనమత మహత్త్వమును, మనయున్నతాదర్శములను మనవశముఁ జేయువిద్యావిధానము మన విశ్వకళాపరిషత్తులందు 'శంకుస్థాపనము' గావలెను. ఆంగ్లభాషాభివృద్ధికి తావొసఁగి, మాతృభాషలును, పాళీ, ప్రాకృత, సంస్కృత, పరిష్యన్, అరబ్బు మున్నగుభాషలును పునరుద్ధరణమందిననాఁడు ఈ యాశయము ప్రత్యక్షదైవతమువలె మన కనులఁబడును. తూరుపుకొండపై జగమూకన్ను తోఁచినంతన చీఁకట్లు పటాపంచలగునట్లు భారతదిగ్వలయమున సియాశయముదయించినముహూర్తమున మనయందు నేఁడు చెలరేఁగు అంతః కలహములును, అరిష్టములును అదృశ్యమగును. మరల భారతాంబ ఆచార్యపీఠము నధిష్ఠింపఁగలదు.

వివిధవిజ్ఞానములు పెంపొందిననాఁడే దివినుండి భువికి నిలింపులు దిగినట్లు మహత్తరభావములు భూతలమున నవతరించును;మనుష్యహృదయమున నిహితమైయున్న ఆధ్యాత్మిక శక్తి ప్రజ్వలితహుతభుక్కువలెఁ దేజరిల్లి దిగంతముల నంటు జ్ఞానశిఖలను వెడలించును. రవికరస్పర్శ నందినంతన పులకితగాత్రియై, ప్రకృతి సుందరప్రసవములను ప్రసవించున ట్లేశక్తి నుండి వెడలు నద్భుత తేజము వసుమతిని తాఁకినంతన దివ్యసౌరభము నీను ఉత్తమాశయములందుఁ గుసుమించును. పైరుగాలివలె వసుంధరాదేవిని ప్రేమభావము స్పృశించును. సహకారసంఘభావములు జయవిజయుల యట్లు గోచరించును.

భ్రాతృత్వ సౌహార్ద్యభావములు కృష్ణార్జునులట్లు తోఁచును; శాంతిసుఖములు రామలక్ష్మణులట్లు సాక్షాత్కరించును. నేఁటి నాగరకత సంపూర్ణముగ నాంతరంగికపరివర్తన మంది పరంజ్యోతిని గుర్తించి దానికి జేజేలు పాడును.

'The Spirit of Co-operation" అను నాంగ్లవ్యాసమున గొన్నేండ్లకు మున్ను విద్యను, దాని దృష్టియందుఁ గాంతిలు ఉన్నతాశయములను ఇట్లు విమర్శించియుంటిని :

Education that reveals the glories of Idealism, that supresses the selfish and rebellious element in man turns evil-mongers into seers who hunger after God, puny humans into lofty beings. Inspiring ideas alchemize ugliness into holiness, iron blackness into golden splendour. The three Rs are not *Sat*, *Chit* and *Ananda* which reveal the Great Being enthorned in human heart, which explain the Immanence and Transcendence of God Cart-loads of text-books do not garner the students' mind with the wealth of spiritual ideas. Religious instruction is under taboo in our universities. The Madras University, which produced a Radhakrisnan, in a way took the cudgel against phylosophy. An *Alma-mater*, which expatriates philosophy from the curriculum of its subjects, presents the spectacle of a Temple bereft of its Deity yet filled with the miscellany and medley of devotional paraphernalia. Religion and Philosophy are the Sun and Moon of culture. No culture invites the enquiring gaze of the scholar if it reveals the absence of the spirit

which rains its delicious blessings from its boundless firmament.

Ideas which count most in the uplift of humanity, which give life and light to all and sundry are not cooked in testitubes or manfactured in workshops. The wheel that recieves no spiritual grease is a gibbet which kills humanitarian civilisation. Civilisation void of the light of spirit grows grossly material. Pampered witn inordinate capitalism, it develops plethora and chuckles over the enormity of its heartlessness. Science which does not heed human values and which jettisons the wealth of character during its eliminating process strives to attain malign victory at the expense of benign forces. The Induction and Deduction with which the scientist is buzy within his laboratory, design the destruction of humanity if they do not proceed in the light of human spirit. Poisonous gasses and ingeniou implements of wholesale murder are among the worst—they say the best—achievements of science. The paradox of peace-talk amidst sabre-rattling, of distress in plenty, is the upshot of science uncontrolled by spiritual considerations,—of civilisation unmanned by religious thought,—of materialism unbound by moral principles,—of education untouched by idealistic injunctions. An irreligious civilisation militates against co-operation and multiplies disintegrating forces.

Civilisation is the sum-total of human character. What is true of a man is true of a nation. The distemper of an individual cannot be the salutary symptom of a nation any more than the pestilence

that seizes a whole people can rain luscious drops of health on an individul. The welfare of nations is in fact, nourished in the overflowing peace of human breast. It is not difficult to know why the repercussions of ubiquitous selfishness are now evident in the world. The atmosphere filled with venom has perforce to receive the sun of lofty idealism before the world becomes a fit place for human habitation, before humanism and humanitarianism become the milk and honey of daily sustenance. The moment spiritualism is rehabilitated, the world will have, as it were, a rebirth as selfishness yields place to co-operation. What is true of the co-operation of nations is true as well of the co-operation of individuals. No co-operation is possible unless man feels that he is a member—not a limb that can safely be amputated—of the human family and he cannot feel thus unless he cherishes love and fellow-feeling which are the light of human spirit.

Idealism, however great, unless acted up to becomes the precious coin that gets incrusted within the safe of miserly brooding. It must needs be the Transcendental Realism which "keeps true to the kindred points of Heaven and Home"; to theory and practice. Without love, co-operation becomes a rabble, a caucus that is lost in hurly-burly, that is out to set a man against the throat of another, that bursts into smithereens as the magazine of its evil propensities receives the match-touch of an untoward event. Good-will and mutual trust are the ventricle and auricle of human co-operation.

Co-operation in *toto*, has universal connotation. The earnest endeavours of its hierophants could thrive only in the light of human spirit which beams forth the beautiful ideals of life.

విజ్ఞాన మొకరి సొంతసొత్తు కాదు. కొండొకచోట నది పుట్టినను, అవతారపూరుషునివలె వసుమతీవాసు లందఱ కును జెల్లును. గగనచుంబిమహాద్రులుకూడ విజ్ఞానగమ మును నిరోధింపఁజాల వనిన, టారిఫ్‌గోడలు దీని నడ్డుకొనఁ గలుగునా ? నేఁ బలుకుచుండు విజ్ఞానము భారతావనియందే యుద్భవించినను, సర్వదేశములవారికిని, సర్వకాలములవారికిని దానిపై హక్కు కలదు. కావుననే ప్రాచీవిజ్ఞానవిభవముపైఁ గొందఱు ప్రతీచీమనీషులు సమయసమయములందు కన్ను వేయుచున్నారు.

ఎట్టిలోపము గలది యయ్యు, పాశ్చాత్త్యనాగరకత మనుష్యమానససముద్భవ మైనదే! బైబిల్ తెలుపునట్లు దేవునిపైఁగల అక్కసు దీర్చుకొనుటకై శని మనుష్యమాన సముపై దాడి వెడలినను, అతఁ డందు విజయభేరి మ్రోఁగింప లేఁడు. అతఁ డుండవలయుచోటు మిల్టన్ కవి తెలిపిన Pandemonium లోనే! ప్రతికూలశక్తులకు ప్రపంచమంతము లెవ్వియు, ప్రపంచసాగస్వామము లెవ్వియు పట్టముఁ గట్ట లేదు. సూర్యచంద్రులను కబళించినను, రాహుకేతువులు వారిని జీర్ణించుకొనఁగలరా ? తప్పనిసరిగ గ్రక్కివేయవలెనుగదా ! రవిరశ్మి నెదుర్కొను మొగులుమూఁకలు ఎంతసేపు దాని కెదురు నిలుచును ? పరంజ్యోతి వెలుఁగు, ప్రమిద మనుష్య

హృదయము. కూడని "నవనీతము", దీనికిని మానవుని అంతర్దృష్టికిని నడుమఁ గొండొకవడి నిలిచినను, పిడుగుదెబ్బచే వ్రయ్యలగు మట్టిదిబ్బవలె, లోఁజేరిన మృత్తికను బలమైన భావము గుండచేసి అవ్వలికిఁ గొట్టివేయఁజాలును. తమ యంతరంగమందలి పరంజ్యోతిని గుర్తింపక తిన్ననైన తెరువున నడచు టెఱుఁగక, మయసభయందొకవైపున దుర్యోధనుఁడు పరాభవమునఁ గూలఁబడినట్లు, ప్రకృతి నంటిన మాయను గుఱుతింపక మోహావాగురయందు కూలఁబడు పామరునిపగిది పాశ్చాత్యసోదరులు పంకిలముపై బోర్ల పడుచు నందుండి విషవాయువులను వెడలించుచున్నారు. ఈ వాయువులు నేఁ డెంత విజృంభించుచున్నను, విజయకేతనము నెత్తలేవు. నేఁడు గాకున్న రేపైనను వీనికి చావు తప్పదు. అవిధేయుఁడై యిల్లు విడిచి, తననేరసు గుర్తించి తుదకు తండ్రిని జేరుకొనిన (బైబిల్‌లోని) యువకునివలె దారి తప్పి ప్రవర్తించునిరంకుశప్రవృత్తులు రేపు ఆంతరంగికపరివర్తనమును పొంది పరంజ్యోతి నాశ్రయించితీఱుదురు. కలుషమయ మైన ప్రస్తుతకాలమునందుఁగూడ నుత్తమాశయములకై, మానవ ముక్తికై తపించు మహనీయుల వాక్కులు పుణ్యక్షేత్రము లందు పొంగిపొరలు ఉత్తాలభావతరంగములయట్లు మనహృదయములను దట్టుచునేయున్నవి. కొండంత చెత్తను తగులఁ బెట్టుట కొక్క నిప్పునెరసు చాలదా ? బ్రహ్మాండము నలము కొనిన అంధకార మొక కిరణశాబకము సోఁకినంతన చచ్చి, నరకమును జేరుకొనదా ? పేగులను పెల్లగింపఁజాలు దుర్గంధ

మొక్క యత్తరుబిందువుచే మడియదా? భూమ్యాకాశము లను కబళింపఁజాలు రక్కసులు స్వల్పవయస్కులైన దాశరథుల వాఁడితూపులవలన తున్కలు కాలేదా ? మానవుఁడొక్కరుండు తపసుచే బుద్ధుఁడై, తన యాత్మశక్తికతన నొకప్పు డొకమహాఖండము నాలోకిత మొనరింపలేదా ? (Vide : "*Light of Asia*") విజ్ఞానిభావ మొకటి విద్యుత్తుకంటె జవోపేతమై జగతిపై ప్రాలి తన వాఁడితళ్కులచేత నజ్ఞానసంతమసమును చీల్చి చెండాడదా? మృత్యువు నెఱుఁగక, స్థలకాలపరిమితులను దాఁటి బ్రహ్మాండమున నిది చిర సామ్రాజ్యమును నిర్మించుకొని, పూవులయట్లు చంద్రతారా ర్కులను తన సింహాసనమున కద్దుకొని వేల్పులను వంది మాగధులను గావించుకొనదా? ఈభావము విజృంభించెనేని, దీనిని ప్రతిఘటింపఁజాలు ప్రతికూలశక్తు లేవీ ? ఇచ్చగించినచో, నిది ప్రపంచమును తలక్రిందులు చేసినను, చేయఁగలదు. కావుననే కాఁబోలును ఎమర్సన్ మహాశయుఁడు "Beware when the great God sets loose a thinker in this planet, then all things are at risk. It is as when a conflagration has broken out in a great city and no man knows what is safe or where it will end". అనినాఁడు. జ్ఞానధనులు ప్రపంచమం దేకడఁ బుట్టిన నేమి ? యొకటేదృష్టి గలిగి, యొకటేగమ్యస్థానముదెస సాగిపోదురు. విశాలకుధరతలమున జనించిన వివిధధునీమతల్లులు వేర్వేఱు చోటులనుండి స్రవించి వాహినీపతిని చేరుకొనవా ?

చిరసంసర్గముకతన నద్భుతభావశక్తిని భాషకూడ నలవఱచుకొనును. తేజోధనునివాక్కులు, యుగయుగముల

యందును ప్రతిధ్వనులను జెలరేఁగింపఁజాలును. పాల కృష్ణునివలె నివి చిన్నవైనను, పదునాలుగు భావ లను తమ హృదయములం దిడికొని, బహువిధ ప్రజ్వలింపఁజేయఁగలుగును.

రోమెయిన్ రోలండ్ నుబోలు విజ్ఞానులును, లేంక్ పగిద మేధావులును, జాక్సన్ వంటి విద్వాం ఏండ్రూస్ నుపోలు దీనబంధువులును ఉజ్జ్వలభా షించుచుండ, శక్తియుతశబ్దముల నుచ్చరించుచుండ మాశయములకై పరితపించుచుండఁ బాశ్చాత్యనా జూచి యెవ్వరును నిట్టూర్పులు విడ నక్కఱలేదు. దూతలు నేఁడు భారతభూమిపైన నాతురంపుఁజూ నిగుడించుచున్నారు. *"Light of Asia"*ను పఠించిన గోలె భారతమహాత్ముల పూతనామాక్షరములను పు మొనరించును, సండర్ లేండ్ నూతనావనినుండి పైఁ బూలచెండులు విసరలేదా? రోలండ్ మసిపి. కృష్ణగాంధులను దన యాచార్యులను గావించుకొ జీవనమహత్త్వమును దన యుద్గ్రంథములయందు వ్యా లేదా? రాధాకృష్ణుని "గాంగనిర్ఝరసదృశధారాళవా జాక్స గ్రుక్కిళ్లు మ్రింగుచుండుటలేదా? రవీంద్ర వే దాసులకు సేవఁజేయ నేండ్రూస్ ఎంతేని కౌతు జూపుటలేదా? గాంధి యెవరు? రవీంద్ర రామకృష్ణ కృష్ణు లెవరు? ప్రాచీవిజ్ఞానమహత్త్వమునొక్క దృష్టాంతములుకారా? వీరిపై ప్రతీచీమనీషులు దృష్టి

చుటకు కారణము వీరియందు వెలుంగు ప్రాచీవిజ్ఞానజ్యోతి పశ్చిమావనియందలి కారుచీకట్లను తఱిమివేయు నని కాదా? "గాంధియుద్యమవిజయమునకై యెదురు చూచుచున్నాము. ఈ మహోద్యమము భారతసీమకే కాదు; సమస్తవసుంధరకును ముక్తిఁ దేఁజాలు"నని రోలండ్ ప్రభృతులు పలుమాఱు పలుకలేదా? ఈ భారతమహాపురుషులను గనినది నేఁటి విద్యావిధానమా? పావనగుణశోభితమైన జనయిత్రి ప్రబోధము నంది, ఆమెగురుగుణముల నాత్మజీవనమున నింకించుకొనియేకదా గాంధిజీ మహాత్ముఁడైనాఁడు! మహర్షి దేవేంద్రనాథుని శిక్షణ మందికదా రవీంద్రుఁడు నేఁడు భారతఋషికవీంద్రుఁడైనాఁడు! దక్షిణేశ్వరమునందు స్రవించు భావసురాపగయందుఁ గ్రుంకులిడియేకదా రామకృష్ణుఁడు పరమహంస యైనాఁడు! గభీరప్రాచీవిజ్ఞానమున మునుఁగిఁత నీఁదియీఁదికదా రాధాకృష్ణుఁ డందలి భావమణులను నిజమానసమంజూషయందుఁ జేర్చుకొని వసుంధరయందు నేఁడు సాటిలేని తాత్త్వికుఁ డైనాఁడు!

పాశ్చాత్త్యవిద్యయందలి చక్కని యంశములను గైకొని, స్వకీయవిజ్ఞానమును హృదయంగమముఁ గావించుకొనిరి. కావుననే ఈ విజ్ఞానయాత్రికులు నేఁ డవనీతలమునందు పూజనీయు లైయున్నారు. ప్రాచీప్రతీచీవిజ్ఞానములను సమన్వయించు విద్యావిధానము - పల్వురు గాంధులను, రవీంద్ర రాధాకృష్ణులను గనఁగలుగు విద్యావిధానము - ప్రాచీప్రతీచీ ఖండములకు వియ్యమును గూర్చును. ఈ వియ్యము నేఁడు

కవిస్వప్నమం దున్నది. "Federation of Ideas" సాధ్య మైననాఁడే "Federation of Nations" సాధ్య మగును.

ప్రత్యేకవ్యక్తిత్వమునకు భంగమును గలిగింపనికలయి కయే Federation. ఇది శరీరమును బోలునది. శరీరము క్రమగతిని జలింపవలె ననిన, శరీరస్థ అంగప్రత్యంగములు శక్తి సంపన్నము లైయుండవలెను. కొన్ని యవయవములు పక్ష వాతమునకు లొంగియున్నచో, దేహము క్రుంగిపోదా? ఆంధ్రత్వముగాని, భారతజాతీయత్వముగాని అట్టిటు లాడిన యెడల, సంతర్జాతీయత్వము తొట్రుపడదా? మాతృభాష లును సంస్కృతమును కట్టిదెబ్బలు తినుచో, జాతీయత్వము ముక్కముక్కలు కాదా? సంఘసౌఖ్యము తుత్తునియలు కాదా? జాతిజీవనము మోడువంటిది కాదు; వివిధశాఖలు కలది. జాతీయవృక్షమూలమునకు చెఱుపు కలిగినపుడు రాజ కీయ, ఆర్థిక, మత, సాంఘికశాఖలకు చేటు కలిగితీఱును. ప్రస్తుత హిందూసంఘమును పరిశీలించితిమేని, బీతుఁగొలుపు చీడ యెంతో అందుఁ గాననగును.

పాశ్చాత్యము ఘోరరాక్షసిని బోలునది. శ్రీనగరమున నుండి కన్యాకుమారివఱకును నేఁ డిది బారలు చాఁపుకొనియు న్నది. దేవకికడుపునఁ బుట్టిన కృష్ణుఁడు రక్కసులను దును మాడినట్లు, భాషనుండి వెడలిన విద్య పాశ్చాత్యసంతానమును సంహరించును. నేఁడును భారతసంఘముతో సన్నిహిత సంబంధముగల సంస్కృతము మనకు దురూహ్య మైనందున సాంఘికాచారములం దుచ్చరింపఁబడు పవిత్రాక్షరములు

వడగండ్లవలె నేల రాలుచున్నవి గాని మన మనసులయందు ప్రవేశించుటలేదు. సంఘజీవనమున నుచ్చరింపఁబడు మాటలకును, క్రియలకును సంబంధము లేదు. మాతృభాష లించుమించుగ వెలియగుటచే నుత్తరప్రత్యుత్తరములయందును, ప్రసంగములయందును, దైనికాచారములయందును ఆంగ్లము సర్వాధిపత్యమును వహించియున్నది. విద్యకును, భావమునకును, భాషకును, సంఘజీవనమునకును, జాతికిని, మతమునకును, ధర్మమునకును అవినాభావసంబంధ ముండుటచే భాషలకు కలిగిన భంగపాటు తక్కినవానియన్నిటికిని గలిగెను.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్,
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"

అను గీతావాక్కు నేఁడు మనకు బహుయోజనముల దూరమం దున్నది. నిన్న గాక మొన్ననేకదా నాసికమహాక్షేత్రమున హిందూశాస్త్రములు చితిపై చిటచిటలాడింపఁబడినవి! రాజహంస లెందో యెగసిపోయినపుడు, రాబందులు రివ్వురివ్వన నెగిరిరావా? ఉత్తమాశయము లదృశ్యమగుటచే మన నేల నేఁడు జాతిభ్రష్టుల పెడబొబ్బలతోను, మతభ్రష్టుల హుంకరింపులతోను, నీతిబాహ్యుల హాహాకారములతోను, అభాగుల ఆర్తనాదములతోను ప్రతిధ్వనించుచున్నది. మన సంఘమునుండి సంఘీభావమును బహిష్కరించితిమి. మనయాత్మోన్నతికి తోడుపడుజాతీయవిజ్ఞానమును గోలుపడితిమి. ఉత్తుంగభావశిఖరమునుండి కూలఁబడితిమి. హృదయములను తున్కతున్కలు గావించుకొంటిమి. "హా!" యనుచుంటిమి. నేఁడు పతితులమైయుండి ప్రతీచీనాగరకతను మన మెట్లు పునరుద్ధరింపఁగలము?

ఆంగ్లేయులకుమున్ను అన్య దేశములనుండి ఎందఱెందఱో మన దేశ మాశ్రయించిరి. వా రెవ్వరును మనభాషలపై దండ యాత్రలు సాగింపలేదు సరికదా మన భాషలను నేర్చి వాని యం దలి పరమార్థమును గై కొని తమతమ సారస్వతముల కపూర్వ విభూతి నొసఁగిరి. మొగలాయీల కాలమందు పరిష్యను, ఆరబ్బు విద్వాంసులతోఁగూడ జగన్నాథపండితుఁడు మున్నగుసంస్కృ తవిద్వాంసులుకూడ రాజాదరణమంది వర్ధిల్లిరి. భారత భాషలను నేర్చిన ముసల్మాను-ఏలికలుకూడ నుండిరి. వివిధభాషలను నేర్చుకొనుటయందు భారతీయునకు ప్రత్యేక ప్రజ్ఞ కలదు. భారత భాషలపై దాడి వెడలక అతిథియై యరుదెంచిన ఆంగ్లము అతిథియైయుండి తానుండఁదగు తావలమునఁ దానుండి భారత విజ్ఞానాభివృద్ధికి చేయూఁత నీయవలసినది. గతశతాబ్దమున భారతవిద్యావిధానమును నిర్ణయించిన మహనీయు లీయంశ మును గుర్తింపవలసియుండెడిది. భారతభాషలును, ఆంగ్లాది అన్యభాషలును మేథ్యూ ఆర్నాల్డ్ వచించినట్లు,

Ah, love, let us be true
To one another!..."

అని యొకదాని నింకొకటి సంబోధించుకొని, కలసిమెలసి పెంపొందవలసినది.

కాని, ఆ మహనీయులు గుర్తించిన విషయము వేఱు; వారిదృష్టియం దుండిన ఆశయము వేఱు. నవవిధానముపై శుభాశంసలు చల్లినవాఁడు, ఆంగ్లవిద్యాధికుఁడు మెకాలేమహా శయుఁడు. భారత దేశమునం దాంగ్ల విద్యావిధాన మే పాదు

కొని పోవలె ననియు, ఈ విధానము కతన పాశ్చాత్త్య నాగరకత భారతనాగరకతపై దండెత్తి, గజనీమహమ్మదువలె తరలిపో వనియు నాతఁ డనినాఁడు. ఈతనిజోస్యము ఫలించినది. మన విజ్ఞానమును గుఱించి ఈతని మనసున విపరీతాభిప్రాయములు పొడుకొనినవి ("A single shelf of a good European library is worth the whole native literature of India and Arabia." Vide Macaulay's famous Minute dated 2nd February 1835). భారతీయులు నాగరకత లేని వారనియు, భారతావనియందలి జ్ఞానము బండిసున్నయనియు, భారతీయులు కుడినుండి యెడమకు, క్రిందనుండి మీఁదికి వింత యక్కరములు వ్రాయువా రనియు నీమహనీయగుణగరిష్ఠుఁడు సెలవిచ్చినాఁడు. తన దేశీయులు బట్టకట్టు టెఱుఁగక అడవుల యందు, అంధకారమందు అల్లాడుచుఁడిని భారతభూమి విజ్ఞాన మయూఖములచేఁ దేజరిల్లిన దని ఎడ్మండ్ బర్క్ (Vide Burke's Speech on the impeachment of Warren Hastings) మున్నగు పాశ్చాత్త్యమనీషులే వాకొని రనియు, సంస్కృతమున మహాపండితుఁ డైన మేక్స్‌ములర్, తన జీవనముకడముట్టినంతన జాహ్నవియందుఁ గాకున్నమానె భారత పుణ్యభూమియం దేకడనైనను దనయస్థికలు రాల్చఁబడిన యెడలఁ, దనయాత్మ ధన్యత నందు నని పలికె ననియు, భారత దేశమందలి ఒకయశ్వత్థవృక్షమునకుఁగల వయసు తనవిజ్ఞానమునకుఁగాని తన నాగరకతకుఁగాని లేదనియు నీ బుద్ధిమంతుఁ డెఱిఁగియుండఁడు. మెకాలేమాటలను పరికించినపిదప మన యుపనిషత్తులను గుఱించి కొందఱు ప్రతీచీతాత్త్వికు లనిన నుడువులను చదువరులు విలోకింతురుగాక !

"From every sentence deep, original and sublime thoughts arise and the whole is pervaded by a high and holy and earnest spirit. In the whole world there is no study so beneficial and so elevating as that of the *Upanishads*" Schopenheuer.

"The New Testament and the *Upanishads* are the two noblest products of the religious consciousness of mankind" Deussen.

"For fitting men to lead contemplative and quiet lives, I know no better preparation than the Vedanta." Max Muller.

"*Isopanishad* is what Jane Austin would have called a little garden plot which ono can dig deep in a short essay" Siqueira.

మహావిజ్ఞాని రామమోహనరాయలు సంస్కృతము వెనుకఁబడవలె ననియు, నాంగ్లమే ముందు నిలువవలె ననియు పలుమాఱు వాక్రొని * తన యుద్దేశమునకు జేగంటలు కట్టినాఁడు. ఇది మన యదృష్టమో, దురదృష్టమో పాఠకులే యూహించుకొనవలెను.

---

* "We now find that the Government are establishing a Sanskrit school under Hindu Pandits to impart such knowledge as is already current in India. This seminary can only be expected to load the mind of youth with grammatical niceties and metaphysical distinctions of little or no practical use to the possessors or to society......The Sanskrit language is well-known to have been for ages a lamentable check on the diffusion of knowledge. No improvement can be expected from inducing youngmen to consume a dozen of years of the most valuable period of their lives in acquiring the niceties of the *Byakuran* or Sanskrit Grammar......The Sanskrit system of education would be the best calculated to keep this country in darkness." (*vide* Raja Rammohan Roy's famous letter of December 1823, addressed to Lord Amherst). "Should the

వంగరాష్ట్ర విభజనమును గుఱించిన ఆందోళనము విజృంభించిన దాదిగ జాతీయత్వపునరుద్ధరణంబునకై వంగవాసులు విశ్వప్రయత్నములు చేయుచున్నారు. ఈ ముప్పదేండ్లలో తమ విద్యావిధానమున పెక్కుమార్పులను గావించిరి. దేశచరిత్రలం దాఱితేఱినయనంతరమే వంగవిద్యార్థులు విదేశచరిత్రలనుచేఁబూనవలెను. జదునాథ సర్కార్, రమేశచంద్ర దత్తు అధర్ చంద్ర ముఖర్జీలను బోలు మహావిద్వాంసులు వ్రాసిన దేశచరిత్రలే పఠనీయ గ్రంథము లైనవిగాని, మనుష్యులలో శ్రేష్ఠుఁడై ధైర్యసాహసౌదార్యములందుఁ గేసరియైన శివాజీని కొండయెలుక యని వర్ణించియు, "కలకత్తా చీఁకటికొట్టు"అను వింతకథను లేవఁదీసియు ననృతములను, ననుచితోదంతములను కట్టగట్టి మనయెదుట నిలువఁబెట్టిన పాశ్చాత్త్యుల గ్రంథములు కావు. మెట్రిక్యులేషన్ వఱకును సంస్కృతము నిర్బంధపాఠప్రణాళికయందుఁ జేర్పఁబడినది; కాలేజీ తరగతులందుఁగూడ చక్కని ప్రోత్సాహ మందినది. సంస్కృతము విశేషప్రశస్తి నందుటచేతనే

---

Natives receive the same advantages of education that Europeans generally enjoy, and be brought up in the same notions of honour, they will, I trust, be found, equally with Europeans, worthy of the confidence of their countrymen and the respect of all men.'' (*vide* Raja Rammohan Roy's pamphlet on ***Modern Encroachments on the Ancient Rights of Females according to the Hindu Law of Inheritance*** written in 1822)........"India speaking English, India Christian, India socially anglicized, India *possibly* independent, and India the enlightener of Asia." (*vide* The document on settlement in India by Europeans which Raja Rammohan Roy submitted on the 14th July 1832 to the Select Committee of the House of Commons on the affairs of the East India Company.)

వంగసీమలో నన్నిజాతులయందును జగద్విఖ్యాతినందిన వేదవి
జ్ఞానులు పల్వురు బయల్వెడలిరి. హరప్రసాదశాస్త్రి, సతీశచంద్ర
విద్యాభూషణ, హరీంద్రనాథదత్త, సునీతికుమారఛటర్జీ, విధు
శేఖరశాస్త్రి ప్రభృతుల నెవ్వ రెఱుంగరు? నాయనాచార్యుఁడు
అమూల్యచరణ విద్యాభూషణుని సంస్కృతవ్యాసములకై
జర్మనుసీమయందలి వేదపండితులు మిగుల నువ్విళ్లూరుట నే
నెఱుంగుదును. వివిధ పాశ్చాత్త్యభాషలతో పాటు పాళీ, ప్రా
కృత, పరిష్యన్, అరబ్బుభాషలు విశేషాదరణము నందినవి.
వివిధభాషలయందును ఎమ్. ఏ. తరగతులు లేర్పడినవి. వివిధ
రాష్ట్రములనుండి, వివిధదేశములనుండి విద్వాంసు లాహ్వా
నింపఁబడిరి. ఈవ్యవస్థవలన హరినాథదే, అమూల్యచరణ,
విధుశేఖర, సునీతికుమార ప్రభృతులు బహుభాషలయందు
అద్భుతపాండితి నందిరి. కలకత్తావిశ్వవిద్యాలయమున వంగ
భాష అగ్రస్థానమున నధిష్ఠింపఁబడినది. వేయిరూకల మాస
వేతనము గల మాతృభాషాబోధకుఁడు ఇతరరాష్ట్రములందు
స్వప్నమందైనను గానరాఁడు; కాని కలకత్తావిశ్వవిద్యాలయ
మున రూపుదాల్చిన ఉత్తమాశయమునట్లు ప్రత్యక్ష మగు
చున్నాఁడు. కొంతకాలమునకు మున్ను శ్లాఘుకవీంద్రుఁడు
రవీంద్రుఁడు కలకత్తావిశ్వవిద్యాలయమున వంగభాషాధ్యాప
కులలో నొక్కఁడై, సమయసమయములందా భాషనుగుఱించి
యుపన్యాసము లిచ్చుట నే నెఱుంగుదును. బడితరగతు
లందును, కళాశాలలందును వంగభాషావిశారదులు నా
కాచార్యు లగుటచే వంగసారస్వతమందలి రత్నరాశిని
గుర్తింపఁజాలితిని. కలకత్తా విశ్వవిద్యాలయము వంగభాషకు

కేస్ప్రాముఖ్య మిచ్చుటచేతనే సగరపుత్రుఁట్లు వంగభాషా
కులు బహుసంఖ్యాకులై వంగవసుంధరయందు నేఁడు
చరించుచున్నారు. అర్ధశతాబ్దకాలములో దిగంతవిశ్రాంత
శాలులైన వంగరచయితలు తల లెత్తిరి. ఆంగ్లవిద్యాధికు
లో మాతృభాషాపూజకుఁ గడంగినవా రన్యరాష్ట్రము
ను నెంద ఉన్నారు? ద్విజేంద్ర, రవీంద్ర, బంకించంద్ర,
నచంద్ర, గిరీశచంద్ర, ఈశ్వరచంద్ర, శరచ్చంద్ర,
హేమేంద్రనాథ, జలధరప్రభృతులు ఆంగ్లమున చక్కనిపాండి
పడసి వంగసాహిత్యపృథ్వియందు దిగ్గజములై యుండలేదా?
గసారస్వతమును మించిన సారస్వతము నేఁడు భారతభూమి
ం దొక్కటైనఁ గలదా? వంగభా వలె నేఁడే భారతభాష
నను, విదేశవిశ్వవిద్యాలయములందు పఠనీయ మైనదా?
గభాషను నేర్చుకొనుటకై పరుగులెత్తుచు వచ్చుచున్నట్లు
డేయితరభారతభాష నైన నేర్చుకొనుటకు పాశ్చాత్త్యులు
వ్వంజలు వేయుచు వచ్చుచున్నారా? మాతృకయందు "గీతాం
"లోని యమృతమును దనివారఁ గ్రోలుటకై కొందఱాంగ్లే
ు లాతురత పడుచుండుట లేదా?

వంగసీమయం దాంగ్లము హద్దులలో నిలుపఁబడినది.
పన్యాసములందును, ఉత్తరప్రత్యుత్తరములందును, ప్రసంగము
యందును వంగీయులు మాతృభాషనే వాడుదురు. న్యాయ
ాదులందు చక్రవర్తియై వఱలిన రాస బిహారీఘోషు తన
రణశాసనమును ఆంగ్లమందఁగాక తనమాతృభాషయందే
ాసి, మాతృనామము నుచ్చరించుచు దివంగతుఁ డైనాఁడు.
ాతృభాషాభిమానము ప్రతివంగగృహమందును ప్రత్యక్ష

మగుచుండును. కావున స్త్రీవిద్యకూడ నక్కడ చక్కని యభివృద్ధి నందినది. నిరుపమ, అనురూప, సీత, జ్యోతిర్మయి మున్నగు వంగనారీమణులు సారస్వతసేవను జేయుచు యశస్వినులకలైరి. జనసామాన్యమున మాతృభాష ఆరాధ్యదేవతయై యుండుటచే వంగగ్రంథకర్తలు ఆంధ్రరచయితలవలె దురంత దారిద్ర్యమున మాఁడి చావ నక్కఱ లేకపోవుచున్నది.

స్వాతంత్ర్యకాంక్ష రక్షకమైయున్న తఱి మాతృభాషను సంకెలలు చేరఁజాలునా!? జాతీయత్వముపై ప్రతికూల శక్తులు దండెత్తఁగలవా? స్వకీయవిజ్ఞానముపై పులుఁగులు వ్రాలఁజాలునా? మనుష్యత్వమును మార్కొనుట కెవ్వని కైన నెన్ని వేలగుండె లుండవలెను?

మనుష్యత్వము, స్వాతంత్ర్యము, జాతీయత్వము, దేశభక్తి, ఆత్మగౌరవము మున్నగునాశయములు భారతమాత యనుంగుబిడ్డలు. వీనికి కలకత్తా విశ్వవిద్యాలయము, రాజకీయోద్యమము తలయెత్తిననాఁటంగోలె తూఁగుటుయ్యాలయైనది. ఇట్టి యుత్తమాశయములను పెంచు విశ్వవిద్యాలయమే బహుయుగారాధ్య మైయుండును. ఇట్టివిద్యాసంస్థ యెన్నఁడును అస్తమయ మెఱుఁగక కౌస్తుభముకైవడి విశ్వహృదయమునఁ దేజరిల్లును.

ఉపాస్యదేవతగుణగణమును గుఱితించియేకదా సగుణోపాసకుఁడు దానిపై పూలు చల్లును. ఒక్కొకపూవు, ఒక్కొకగొప్పగొనముపై రాలును. పూవు నంటినభావసౌరభమును గ్రహించి, స్వర్గవాసివలె నది మహత్తర మైన దగుట

గు ర్తించి, అది వెడలిన హృదయోద్యానమును జేర నాగానము మిక్కిలి మక్కువపడును. పూజాప్రసూనములనుండి యవత రించు బహుళభక్తిభావములను చెలిమికత్తెలను చేసికొని వజ్రపీఠస్థలిపై ధగధగమెఱయు దివ్యగుణములు ఉపాసకుని హృదయమునం జొచ్చి, అందుం గాంపురముండును. కావుననే ఉపాసకునిహృదయముగురుగుణములకాలవాలమైయుండును.

స్వాతంత్ర్యము, జాతీయత్వము మున్నగునాశయముల నారాధించువిద్యార్థి పూలగుంపువలె వానియందు గోచరించు గానముల ప్రోవును గుర్తింపవలెను. వీనిని గుర్తించిన జిజ్ఞాసువులు వీని నంది, వీనికతన మనుష్యలోకమునందు చిరసందీప్తజీవు లైరి. వీనిపై చూడ్కి నిలుపక, వీనిని గుర్తింపక, స్వార్థముపై కన్నువేసి అదను కలిగినపుడు, అక్కఱ పొడచూపినపుడు వీనిపేరు లుచ్చరించి చెడుచెయిదములకు చేతులు చేసికొనినవా రనేకు లున్నారు. ఈ యంశముల నతిసంక్షేపముగ నీసందర్భమున విమర్శించుట యుచిత మని నాతలంపు.

" విద్య నెఱుంగనివాఁడు మర్త్యుఁడే ?" యని భర్తృహరి పలికినాఁడు. విద్య లేనివాఁడు పశు వనియు, మానవునకు మనుష్యత్వ మిచ్చునది విద్య యనియుఁగదా భర్తృహరియభిప్రాయము !

మనుష్యత్వము, స్వాతంత్ర్యము, జాతీయత్వము, ఆత్మగౌరవము అవినాభావసంబంధము గలవి. ఈనాలుగును విద్యయొక్క అనుంగుబిడ్డలు. విద్యాభూషణుఁడే తలయెత్తుకొని మనుష్యలోకమున మసలఁగలఁడు ; సౌందర్యసందీప్తజీవి

కాఁగలఁడు; ప్రాజ్ఞుఁడు కాఁజాలును; యశస్విలకుఁడు కాఁజాలును.

శ్లో. "విద్యా నామ నరస్య రూప మధికం ప్రచ్ఛన్నగుప్తం ధనం
విద్యా భోగకరీ యశస్సుఖకరీ విద్యా గురూణాం గురుః,
విద్యా బంధుజనో విదేశగమనే విద్యా పరా దేవతా
విద్యా రాజసు పూజ్యతే నతు ధనం విద్యావిహీనః పశుః"

ఆత్మగౌరవము గలవ్యక్తినే యెల్లరును గౌరవింతురు. స్వాతంత్ర్యమును, మానమును ప్రాణముకంటెను మిన్నగ రసపుత్రవీరులును, రసపుత్రరమణులును ఎంచుటకు కారణము వానికి తగులుకత్తిపోటు తమమానవత్వమునకు తగులు నని వారూహించుటే! మాన మెఱుఁగనివ్యక్తి, విద్యకొఱవడిన వ్యక్తివలె ("జ్ఞానేన హీనః పశుభిస్సమానః") పశుప్రాయుఁడై యుండును.

స్వాతంత్ర్యము, జాతీయత్వము మున్నగు నాశయములను మానవుఁడాధ్యాత్మికదృష్టితో పరికింపవలెను. మనుష్యదృష్టి వ్రకమైయుండుతఱి, జాతిప్రకృతి విరుద్ధమైయుండుతఱి నీ యాశయములు నిశితకాక్షేయకము లగును. "జాతీయత్వమును పురస్కరించుకొని ఎందఱెందఱో దౌర్జన్యములకుఁ గడంగి" రని ప్రపంచచరిత్రలు వాకొనుచున్నవి.

"దేశభక్తి" "స్వాతంత్ర్యము" "జాతీయత్వము" లను బురఖాలు వేసికొని వానిమఱుఁగుననుండి దురంతదుష్కృత్యములకుఁ దొడఁగువారసంఖ్యాకులైయున్నారు. ఈదుర్మతులను చూచియే కాఁబోలును Samuel Johnson. "Patriotism

efuge of scoundrels" అనినాఁడు. మతమును,
ంటఁగలిపి, బూడిదఁజేసి దాని నొడళ్లకు నలము
రూపములు దాల్చి, విచ్చుకత్తులు చేఁబూని, ఒరు
ంన్కలు చేసి, తమజాతినొసటను రక్తపుబొట్టు
మహాయోధుల మని గంతులు వేసిన వ్యక్తులు
ర్వ మొకప్పుడు సర్వజాతులందును విజృంభించి
లై అంతరించిరి.

స్వాతంత్ర్యమున కంజలి యెత్తఁగలవాఁడే ఆత్మ
ంను గాపాడుకొనఁగలుగును. ఇతరదేశముల
ఁలవాఁడే స్వీయసీమయెడల నిర్మలానురాగమును
ఒరులజాతీయత్వముపై వేఁడినిప్పులు పోసి, తన
రైచెండులతో శృంగారక్రీడలను సలుపఁగలవ్యక్తి
ఁడు.

జైరో పాఖండమునందుఁ గొందఱు తమజాతీయత్వ
నిచ్చి బండోరులు 'డీడిక్కీ' లాడుచున్నారు.
భౌతికశాస్త్రములను త్రవ్వి, అందలి వెండిబంగా
తులయందు నింపుకొనినవారే! వీరిని చూచియే
Lodge "Man's moral growth has not kept
his progress in scientific and mechanical
అని యుండును.

ము" పే రుచ్చరించుచు మారణహోమములకుఁ
రెండటో ఉన్నారు. థగ్గులను బందిపోటులు
గములకు పోవునపుడును, తిరిగి వచ్చునపుడును

పూజాదులను నెఱపుచుండువారట. విపులచమూసహితు లైన విక్రమసింహులు కొందఱుకూడ విప్లాసరించువారట.

దోషము మనుష్యహృదయమున చెలరేఁగు దుర్వృత్తులధి. స్వాతంత్ర్యమునో, జాతీయత్వమునో, మతమునో ముందు నిలుపుకొని వీరు తూపులు వదలుచుందురు. ఈ యపరాధము ను ఉత్తమాశయములనెత్తికిఁ గట్టరాదు.

పరిశుభ్రమై, సుందరమైన పూజామందిరమందే దైవతము వెలయఁగలుగును. పునీతమైన గర్భాలయమందే పార్వతీపరమేశ్వరులు విడియఁగోరుదురు. ఆత్మహృదయమును వారణాసినిఁ గావించుకొనునాతఁడే విశ్వేశ్వరసందర్శనము నందఁజాలును. హృదయమునకును, నేత్రయుగమునకును అవినాభావసంబంధము కలదు. ఆకాశము నిర్మల మైనపుడే సూర్యతేజము తీక్ష్ణ మైయుండును. అంతరంగము మేఘరహిత మైనపుడే కనుదోయి సూర్యతేజమును వెలారింపఁగలదు. బహువర్షములు తపసుచేసి, ఆత్మహృదయములనుండి కారు మేఘములను తఱుమఁగొట్టి, మహాఋషులు కన్నవలనుండి సహస్రమయూఖములను వెడలింపఁగలిగిరి.

ముద్దుకృష్ణునితొట్టెచుట్టును తియ్యనిజోల లాలసించు యశోదాదులవలె, పూర్వగిరిపైని తళ్కొత్తు తరణికిరణముల కరణి, కౌసల్యహృదయమున తేజరిల్లిన రామునిచుట్టును జేరిన భువనసమూహమునట్లు, లుంబినీవనమున బాలసిద్ధార్థునిపదములను పద్మములం దొడ్డి నలువలంకులందు నృత్తగీతములఁ దేలిన

నిలింపులలీల, నలుకెలంకులందును మధురఝంకృతుల నాల పించుచు తమ్మిరొమ్మును చుంబింప నాతురతపడు గండుఁ దుమ్మెదలట్లు,పరంజ్యోతిచుట్టునుపరుగులెత్తు కిరణశాబకములకైవడి, సూర్యదేవునకు గీతికార్ఘ్య మీయఁ గులాయముల నుండి తూరుపుకొండకొన కెగయు శకుంతసంతానముచందమున,పరంధామునిప్రాపును జేరి చిరభజనము సేయుభక్తవితానముచాడ్పున,నున్నతహృదయము నాశ్రయించి,దానిచుట్టును పరమాశయములు మహోత్సవము సలుపుచు మనుష్య జీవితమున మహితమరీచులను విరఁజిమ్మును.

తమ మనస్సులయందు నిరయకుండమును రవుల్కొలిపి స్వర్గమునుండి రాలు పుష్పాడిని మోముపైని పులిమి, తమ కడుపులందు బొగ్గుగనులునిలిపి మేనులపై పైఁడిపూఁతలుపూసి, తమమాటలనుండి గులాబులను రాల్చి, చేఁతలందు ముండ్లు దూర్చి,తమరచనలయందు కమ్మతావులు లేపి, జీవితములందు దుర్గంధమును నింపి,మనుష్యసంఘమున మేజువాణిచేయువారు సమవర్తికిఁగూడ భీతుఁ గొలుపుదురు. వీరిజావళీలనుండి రాలు అక్కరములు ఉత్తమాశయము లని, వీ రాలపించు గీతికలు కారుణ్యాధార లని,వీరికనులనుండి పఱతెంచుచూపులు అనురాగద్యుతు లని, వీరిచిఱునగవునఁ దళుక్కుత్తులేఁతయొండు పూతభావ మని, వీరినవ్వులనుండి రాలునవి పువ్వు లని, వీరి కనుసైఁగలనుండి కురియునవి ప్రేమబిందువు లని, వీరిచేసన్నలందుఁ దోఁచునవి మధురసూచన లని, వీరిమనసు వివిధరాగములను జిమ్ము ఇంద్రధనువని, వీరితలఁపులు రత్నరుచులనిత్తలఁ

పరాదు. ఉన్నతాశయముల నాధ్యాత్మికదృష్టితో విలోకించు నాతఁడే వానిని పూజించును. పూజించునాతఁడే వాని నాత్మ హృదిలోఁ జేర్చుకొనఁగలఁడు. ఇట్లని యెఱింగియే మనప్రాచీనులు ఉత్తమాశయోత్కారమున కొకరూపు నిరూపించి, దానిని 'శారద' యని పిలిచిరి. శారద నారాధించుటకై భారతీయ లోకమ్మ డెంతో ముచ్చటపడువారు.

కలకత్తావిశ్వవిద్యాలయమునందు "సరస్వతి"ని ప్రతిష్ఠించి, పరంజ్యోతిని నిలిపి, ఆరాధనమునకై యువబంగాళము నాహ్వానించిన ఆచార్యుఁడు ఆశుతోష ముఖోపాధ్యాయుఁడు.

* ఆశుతోషు మనుష్యత్వమునకు మాఱుపేరు; స్వాతంత్ర్యమునకు రూపాంతరము; జాతీయత్వమునకు పర్యాయపదము. భారతమహాపురుషులం దీతఁ డొక్కఁడు; ప్రపంచమహావిజ్ఞానులం దీతనికి నిక్కమైనచో టుండెను. తా నారాధించుసరస్వతిమ్రోలమాత్ర మీతఁడు నతమస్తకుఁడై నిలుచువాఁడు. మనుష్యమాత్రునిసమ్ముఖమున నీతఁ డెన్నఁడును దల వాంచి నిలువలేదు.

---

* కలకత్తావిశ్వవిద్యాలయమున నీతఁ డుపాధ్యక్షుఁడై యున్నపుడును, న్యాయస్థానమున న్యాయమూర్తియై యున్నపుడును, కన్నతండ్రియై గృహమున మసలినపుడును, వివిధరంగస్థలములందు విక్రమసింహుఁడై, ఏలికయై యున్నపుడును ఈ మహాపురుషుని పరికించి, విద్యార్థినై యున్నతటి నీతని యాదరానురాగము లందుభాగ్యము నాకుఁ గలిగెను. ఈ మహాపురుషుని మహత్త్వ మిట్టిదని గ్రహించుటకు నా కెన్నొ తరుణములు లభించినవి.

గణితశాస్త్ర న్యాయశాస్త్రములం దీతఁడు సాటిలేని ప్రజ్ఞ సంపాదించెను. ఆంగ్లవిద్యాధికులం దాషుతోషు సమ్రాట్టయి యుండెను. స్వాతంత్ర్యకాము గావున, విజ్ఞానప్రియుఁడు కావున ప్రాచీవిజ్ఞానమున కంజలిమెత్తి, చిఱుతప్రాయముననుండి దాని నారాధించి తోడ్తోడనే ఆంగ్లముపై నితఁడు చూపు నిలిపినాఁడు. 'సోనార్' బంగ్లాయెడల నీతనికి భక్తి మెండు. తన మాతృభాషయందును, సంస్కృతమందును చక్కని పాండితిని సంపాదించినాఁడు. వంగపల్లెలను పట్టభద్రులతో నింపెద నని యు, విద్యావ్యాప్తికై జీవితమును ధారవోయుదు ననియు నీతఁ డనుచుండువాఁడు. "నా విశ్వవిద్యాలయము" అని వచించువాఁడు గాని "కలకత్తావిశ్వవిద్యాలయము" మని పలుకువాఁడు కాఁడు. ఈతని "నా"యందు స్వార్థము లేదు. ఇది

---

ఈతనితనయులు రామప్రసాద్ శ్యామప్రసాదులును, (శ్యామప్రసాద్ కలకత్తా విశ్వవిద్యాలయమున కిప్పు డుపాధ్యక్షుఁడై యున్నాఁడు.) అల్లుఁడు ప్రమథనాథుఁడును నా యాచార్యులు. చంటిబిడ్డలను జూచులీల అషుతోషు వీరి నతిగారాబముతోఁ గాంచునాఁడు. ఈతనిపై వీరికిఁగల భక్తి నిరుపమానము. వీరిగృహము అనురాగప్లావితమై యుండెడిది. హిందువుల కిది మేలుబంతి కాఁజెల్లును. తనబిడ్డ కమల దురదృష్టవశాత్తు వితంతువై, అకాలమృత్యువున కెరయగుటచే అషుతోషునిగుండె చితికిపోయినది. నలువదియైదు వేల రూకలను కలకత్తా విశ్వవిద్యాలయమునకు విరాళ మొసఁగి దివంగతయైన పూర్మిపట్టిపేరను వార్షికోపన్యాసములు జరుగువ్యవస్థ నీతఁడు కావించెను. గృహమున కవ్వల నీతఁడు సింహమై, గృహమందు మేకపిల్లయై యుండువాఁడు. "Brave as a lion, gentle as a lamb" అను వాక్కు నెల్లెప్పట్లనే కాక అషుతోషునిపట్లఁగూడఁ జెల్లును.

యనురాగగర్భిత మైనది. "నాబిడ్డ" యని తండ్రి తనయుని జూచి ఉప్పొంగఁడా? కలకత్తావిశ్వవిద్యాలయము ఆషుతోషు కనినబిడ్డ. ఇతఁడు నిరంకుశత్వము చెలాయించువాఁడని పలువురయభిప్రాయము. అవును. నిరంకుశత్వమే! స్వార్థముచేత కళంకితము కాక ఈ నిరంకుశత్వము పరార్థకాంక్షచే పవిత్రమైనది. ఈతనియుద్దేశము గంగోదకమట్లు, ప్రభాతసమయశిశిరబిందువువలె, పుష్పహృదయముకైవడి, తరణికిరణముకరణి పూత మైనది. కావున శత్రువులుకూడ నీతని బీఠస్థలిపై నాసీనుంజేసి, తాము వింజామరలు చేఁబూనువారు; ఈతని వృద్ధశిరముపై పూవుచెండులు విసరువారు.

ఉత్తమాశయములను గుఱించి గురుగంభీరోపన్యాసము లిచ్చుటకుముందు వాని సీతఁ డాత్మజీవితమున ప్రత్యక్షము గావించినాఁడు. రాజకీయములందు తిల కెట్టివాఁడో, విద్యారంగమున ఆషుతోషు అట్టివాఁడు.

తిలకు కేసరి. కేసరి ఎన్నఁడుగాని, ఎవ్వరివెన్కఁగాని "జో హుకుమ్" అని నిలుచునా? "క్షమింపుఁ" డని తిలకు అధికారులను వేఁడుకొనియున్నచో ఒకపర్యాయము పదునెనిమిదినెలలును, వేఱొకపర్యాయ మాఱేండ్లును కారాగారమునకాఁపురముండనక్కఱలేకపోయెడిది. "An emphatic no" అని యాతఁడు సింహామట్లఱచి ఒకప్పుడు బొంబాయిహైకోర్టును మాఱుమ్రోఁగింపలేదా? పాల్ మహాశయుఁడు ఎట్లో అవ్వలికి జాఱి 'బ్రదుకు జీవుఁడా' అనుకొనినాఁడు. శిర మెత్తి

తిలకు జైదులో ప్రవేశించినాఁడు. మహారాష్ట్రమునుండి మాంద లేకు కదలిపోయినాఁడు; అర్ధాంగిని కోల్పోయినాఁడు; అష్టకష్టములను చూచి యడలక జెబ్బగొట్టినవాలుచేసినాఁడు.

ఘోరారిష్టములు గదలు పూని స్వాతంత్ర్యకాముని మార్కొని ఆతనిగుండెలను గుండచేసి వదలఁగలవేమో కాని గుండెలయం దుండునిశ్చయశక్తిని అంటఁజాలవు. కోటిపిడుగులు దండెత్తి ఆతనిశరీరమును తునకతునకలు చేసినను చేయును గాని వాని యంతరంగమునందలి యిచ్ఛాశక్తికి వంగి సలా మొనరించి వెనుకకు తరలిపోవును.

ఆషుతోషును వంగీయులు 'పులి' యనువారు. ఇతఁడు సింహము. తనవిశ్వవిద్యాలయము "గోలామ్ఖానా" కాక స్వాతంత్ర్యోపాసకుల కాలవాలము కావలెనని యీతనియాశయము. కార్యనిర్వాహకవర్గము శాసనసభకు పూచీగా నుండవలయువ్యవస్థ మనదేశమం దింకను తలసూపకున్నను, సంపూర్ణజాతీయభావము శంఖారవమునట్లు విశ్వకళాపరిషత్తుహృదయమున ప్రతిధ్వనులు లేపవలెనని ఈతఁడుద్దేశించినాఁడు. కావుననే ఈతనికిని, లిట్టన్ ప్రభువునకును సంఘర్షణము కలిగెను. ఈ సంఘర్షణమున ఆషుతోషు తనమనుష్యత్వమును వ్యక్తపఱచినాఁడు. 1923 లో జరగిన స్నాతక మహోత్సవసమయమున నుపన్యసించుచు లిట్టన్ ప్రభువును దాపల నిడికొని ఈతఁడు "Freedom first, freedom second, freedom always. Nothing else will satisfy me' అని గర్జించినాఁడు. కొంతకాలముకడచినవెనుక రవీంద్రుఁడీతని

గుఱించి "Ashutosh heroically fought against heavy odds for winning freedom for our education" * అనినాఁడు.

తనమానప్రాణములకంటె తనవిశ్వవిద్యాలయముయొక్క మానప్రాణములే మిన్నలని ఈతఁడూహించినాఁడు. కేవల

* ఎట్టి శత్రువులోనైన సుగుణములు పొడసూపినపుడు వానినాంగ్లేయులు ప్రశంసించితీరుదురు. మనవలె నాంగ్లేయులు చప్పచప్పన అబద్ధములాడరు; ఈర్ష్యను దాపలఁ జేరనీయరు; వంచనమునకు చేయిఁ జేసికొనరు; పగ నెఱుఁగరు. వారు జీవితము నొక పెద్దయాటగా నెంచుచుందురు. ఆట యందలి పెనఁగులాటలో శౌర్య ముండునుగాని క్రౌర్య ముండునా? అందొం డొరులను డీకొనువారు అచిరములోఁ గలసికొనరా? ఆషుతోషుతో పెనఁగులాడిన లిట్టన్ ప్రభువు అతని గొప్పగుణములపై పూలమాల లుంచినాఁడు. ఆతఁడు దివంగతుఁడైనాఁడని మిగుల వాపోయినాఁడు. లిట్టన్ ప్రభువు పలుకులను పరికింపుఁ:

"For many years Sir Asutosh was the university and the university was Sir Asutosh—No worthier memorial could be concieved of than the endowment of that post-graduate department which he had created...Let each one of us severally resolve that this cherished creation of his life shall not suffer because he had left us. While his great work is still fresh in our minds, while we almost seem to see him sitting in our midst and can still hear echoes of his commanding voice, let all differences be forgotten, all mistakes be forgiven, let us build over his ashes the temple of reconciliation; let us unite in common determination to work together for those changes which are inevitable. If our university is to keep its fair name before the world, let the foundation stone of that temple of reconciliation be joint and the common purpose to receive the teaching university of Calcutta as a sacred trust from his dying hands, and in years to come, whatever changes may be found essential in the general organization of the university, to allow nothing to threaten its stability, its prosperity, its freedom or its future development,"

ము పరీక్షలకై యేర్పడిన సంస్థను కళారాధకులకును, శాస్త్రపరిశోధకులకును అక్కఱైన దేవస్థానమును జేసినాఁడు. ప్రపంచ మహావిశ్వవిద్యాలయములలో నొక్కటి గావించినాఁడు! సేడ్లర్ కమిషనులో సభ్యుఁడై, విశేషకృషి సలిపినాఁడు. జాతి మతభేదములను తఱిమికొట్టి ప్రజ్ఞాధురీణులను, ప్రపంచమహా విజ్ఞానులు కాఁజాలువారి నీతఁడు తన సంస్థలోని కాహ్వానించినాఁడు. ఆషుతోషుని కతననే రామన్, రాధాకృష్ణులు నేఁడు సభ్యజగతియందు సూర్యచంద్రులయట్లు తేజరిల్లుచున్నారు.

ఆషుతోషున కారాధ్యదేవతయైనది కర్తవ్యము. మేఁకపిల్లలయట్లు సమయసమయములయం దీదేవతకై యాతఁడు నిద్రాహారములను బలి గావించినాఁడు. తుదకు కర్తవ్యము నారాధించుచునే ఈతఁ డసువులు విడిచినాఁడు. *

---

* తన విశ్వవిద్యాలయమునకై యాతఁడు శ్రమించిన తెఱఁగును పాఠకు లీతనివాక్కులవలన నూహింపఁజాలుదురు.

"Of myself I may say with good conscience that, if often I have not spared others, I have never spared myself. For years now, every minute I could spare from other unavoidable duties—foremost among them the duties of my judicial office—has been devoted by me to university work. Plans and schemes to heighten the efficiency of the university have been the subject of my day dreams into which even a busy man lapses from time to time; they have haunted me in the hours of nightly rest. To university concerns, I have sacrificed all chances of study and research, possibly, to some extent, the interests of family and friends, and certainly, I regret to say a good part of my health and vitality."

మైసూరు, లాహోరు, లక్నోలం దీతఁడు కావించిన స్నాతకమహోత్సవోపన్యాసములను పరికించినవారు కర్తవ్యము నీతఁ డెట్లు వీక్షించునాఁడో గ్రహింపఁగలరు.

మహత్తరములైన ప్రాచీనాచారములను ఆషుతోషుఁడు పాటించితీఱినాఁడు. జనయిత్రి నితఁడు జగద్ధాత్రియట్లు పూజించువాఁడు. జీవితరంగమునఁ దాను మహోన్నతశిఖరముపై నిలిచినను, తల్లికి ప్రణమిల్లి ఆమెమాటను శిరసావహించువాఁడు*

---

* జననిపై నీతనికిఁగల భక్తిని వ్యక్తీకరించువృత్తాంతము లెన్నియో కలవు. ఆషుతోషుప్రజ్ఞను స్మరించి కర్జన్‌ప్రభు వొకసారి యతని యూరోపాకు పంపఁదలఁచినాఁడు. వైస్రాయ్‌గారి యుద్దేశమును సర్ జాన్ వుడ్‌బర్న్ ఆషుతోషున కెఱిఁగించినాఁడు. "సముద్రము దాఁటుట కూడదని మా అమ్మ అనినది. ఆమెమాట నాకు వేదవాక్కు. కావున నే యూరోపాకు పోఁజాలను. ఈయాహ్వానమును నేను మన్నింపలేను" అని మొగమోటము లేక ఆషుతోషు పలికెను. సర్ జాన్ ఎంత చెప్పినను, ఈతఁడు 'ససేమిరా' యనినాఁడు. తనయాజ్ఞ యనుల్లంఘనీయమైనదని యూహించువాఁడు కర్జన్‌ప్రభువు. రాజప్రతినిధులం దీతఁడు మిగుల గట్టివాఁడుకదా! తనయుద్దేశము నీప్రభువు ఆషుతోషుసమక్షమున వ్యక్తీకరించినాఁడు. ఆషుతోషు ఎప్పటిపాటను పాడినాఁడు. ప్రభువు కుపితుఁడై **"Then tell your mother that the Viceroy** and Governor-General of India commands her son to go" అనినాఁడు. ప్రతాపమూర్తియైన ప్రభువు జారీచేసిన హుకుమ్ ఆషుతోషును మార్కొనినది. నిముస మాలసింపక, జంకు గొంకు లేక ఈ పురుషసింహ మిట్లనెను "Then I will tell the Viceroy of India on her behalf that the mother of Ashutosh Mukherjee refuses to let her son be commanded by anybody excepting herself be he the Viceroy of India, or be he anybody greater."
అని జలదగంభీరస్వరమున పలికినాఁడు. చూచితిరా! ఈతని మాతృభక్తి! ఈతని స్వాతంత్ర్యకాంక్ష! ఈతనినుద్దేశించి

".........the elements
So mix'd in him that Nature might stand up,
**And say to all the world.** ***This was a man!"*** అనియు,

"Others abide our question. *Thou art free,*
We ask and ask, Thou smilest and art still,
Out-topping knowledge.............."

అనియు ఇట్టి వీరునినుద్దేశించియే ఆంగ్లమహారచయితలు వచించియుందురు.

"భావోన్నతి" యెందుండునో "నిరాడంబరజీవనము" అందే యుండును. ఇవి రెండును ప్రాచీనభారతసీమయందు ప్రాముఖ్యము నందినవి. వేషభాషలయందును, దైనికజీవననిర్వహణమందును భారతసంప్రదాయమును మన్నించి, జాతీయ భావము నీతఁడు వ్యక్తీకరించినాఁడు. ఈశ్వరచంద్రవిద్యాసాగరునివల్లను, అషుతోషముఖర్జీవల్లను "ధోతీ" విశేష గౌరవము నందినది. అధికారులను చూడవలసివచ్చినను, అందలముల నెక్కవలసినను, ఈతఁడు తన 'ధోతీ'ని పరిత్యజింపలేదు. కోర్టుడ్రెస్సునకు "ధోతీ" పనికిరా దను హుకుమ్ వంగసీమయందుదయించుటయు ఆషుతోషుల స్తమించుటయు నొకటేపర్యాయము జరగుట చిత్రము.

పరంజ్యోతివి దృష్టి నిడికొని, పరమాశయముల నారాధించి, ఆదర్శవిద్యావ్యాప్తికై బహువర్షములు శ్రమించి మనుష్యులందు మనుష్యుఁడై వఱలిన ఆషుతోషునివలె ప్రాచీవిజ్ఞాన మహత్త్వమును గుర్తించి, దానిని హృదయంగమము గావించుకొనిన మనీషి ఆతని కూర్మినెచ్చెలి రవీంద్రుఁడు.

అధునాతనకాలశిఖరమునందు రవియై తేజరిల్లు మహాపురుషుఁడు రవీంద్రుఁడు. ఈతని కనులనుండి ప్రసరించు మయూఖములు సమస్త పృథ్విని తాఁకినవి.

సారస్వతసేవకుఁ గడంగుతఱిని పూజాపీఠమున నీతఁడు మాతృభాషను నిలిపినాఁడు. రవీంద్రునివలె తల్లిమాటను ప్రేమించు విద్యాధికుఁడు అర్వాచీనవసుంధరయందు లేఁడు.

ఈతనితో నాంగ్లమునఁగాక వంగభాషయందు ప్రసంగించుచు... నీతఁడు పరమానందభరితుఁ డగుట పలుమాఱు విలోకించితి... మాతృభాషయందే ప్రబోధము జరగవలె నని ఈతఁ డన... తము వాకొనుచుండును. నిన్నగాక మొన్న కలకత్తాలో జరి... విద్యావారమున "బిడ్డలకు మాతృస్తన్య మెట్లావశ్యకమో... విజ్ఞానడింభకులకు మాతృభాష అట్లే యావశ్యకము. మాతృ భాష దూరస్థ మగుచో భారతావనికి గతి మోక్షము... దూర మగును." అని రవితాకూరు వాకొనినాఁడు.

వసుమతి యంతయు నీతనికనులందుఁ దేలియాడుచుం... డును గావున, దశదిశలందును రివ్వురివ్వన నెగయు కవివిహం... మము కావున, "సకలసద్గుణనికురుంబ శారదాంబ" ఈతని... రాధ్యదేవి కావున రవీంద్రుఁడు వంగసంస్కృతములతో పా... ఆంగ్లము జర్మక్ మున్నగు పాశ్చాత్యభాషల నభ్యసించి, స... విద్యలను, సర్వభాషలను తన "విశ్వభారతి"లోని కాహ్వానించి నాఁడు. సర్వజాతులకును తనసంశ్లేషమున తా వొసఁగినాఁడు.

పరమాశయము లోకస్వాడు పూఁబిందెలందును, లేఁగొ... లందును, పండుటాకులందును, క్రౌంజిగుళ్లయందును, మృదుం... వ్రతతీవితానమందును కుసుమించు ననియు, నిం కొకస్వా... బంగారునీరెండయందును, పండువెన్నెలయందును, సాంధ్య రాగములందును కాంతిలు ననియు, వేఱొకస్వాడు కమ్మఁదెమ్మెర లందును, పక్షికూజితములందును, చిన్నిచిన్నులందును తోలు కాడు ననియు, మనుష్యహృదయమున నిదురించుశక్తులను

లేపునది ప్రకృతి యనియు గుర్తించిన మహనీయుఁడు రవి ఠాకూరు.* "ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగు తావుల జొంపములం బూచిన మంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నలఁ" బృథ్వికి నొరవడి కావలయు "శాంతినికేతనము"న, నాచార్యస్థానమున నాసీనుఁడై స్రష్టయై, ద్రష్టయై సుధానిధు లైన సూక్తులచేతను వసుమతీహృదిని రవీంద్రుఁడు తనుపు చున్నాఁడు.

వర్తమాన భూత కాలములకును, ప్రాచీ ప్రతీచీఖండ ములకును రమ్యప్రకృతియందు వెలయువేదికపై పెండిలిసే యుచు సీకల్యాణమహోత్సవమున నితఁడు పురోహితుఁ డై నాఁడు. ఈ పురోహితుఁ డుచ్చరించుమంత్రములు దివ్యశక్తి గర్భితములు. లోఁతులోయలో కోయిల రాల్చు "కుహూ! కుహూ!" ల ట్లీమంత్రాక్షరములు వసుంధరపై రాలు చున్నవి. ఈతఁ డాలపించుసామగానము ప్రేమతత్త్వసంఘీ భావమహత్త్వములను దశదిశలందును జాటుచున్నది. రవికిరణ మును విభజించితిమేని, ఏడురంగులు కానంబడును. రవి వచనమును విభజించితిమేని, కనులకు మిఱుమిట్లు గొలుపు మహత్తరసత్యము లందు దృగ్గోచర మగును. బహుమయూఖ ములనడుమ, పరంజ్యోతి ప్రత్యక్ష మగులీల నీ సత్యములందు

* "In India men are enjoined to be fully awake to the fact that they are in the closest relation to things around them, body and soul, and that they are to hail the morning sun, the flowing water, the fruitful earth, as the manifestation of the same living truth which holds them in its embrace." (Vide Rabindranath's "Sadhana" Page 8)

ప్రాచీనభారతమహిమ సాక్షాత్కరించును. ఈశ్వరుఁడు తాను వలచినభక్తు నావహించు నని విందుము. భారతమహిమను రవికవీంద్రునిహృదయము నావహించినది; ఈతని హృత్స్వనము మీఁటి దాని మంజులరవమునకు శాంతియుత, ప్రేమపూరిత, మహిమోపేత మధుర గీతికను సమాకరించుచున్నది. ఈ గీతికకు వీను లొగ్గురోలండు ప్రభృతులు* ప్రాచీనభారతనాగరికతామహత్త్వమును, మహోత్తరాంతర్జాతీయత్వతత్త్వమును, గ్రహించి రవిరచనమందలి ప్రత్యక్షరమందును ప్రత్యక్షమగు పరంజ్యోతికి భక్తిపూరితచిత్తులై యంజలి ఘటించుచున్నారు.

---

* "The human mind attains full stature of its growth only when it transcends geographical barriers and the cob-webs of social and religious 'superstitions. The utility of civilisation lies in its being able to share the eternal truths with all nations of the world. Every nation must open its treasure-house of knowledge and wisdom to all sections of the human race. Ancient Indian culture and civilisation was based on the philosophy of Internationalism and I do not know why it will not be possible for the India of today to merge the individual into the universal self." Tagore.

ఈ వ్యాసమున మనదృష్టి నాకర్షించుచున్న ఉత్తమాశయములపట్ల రవీంద్రుఁడు చూపు మక్కువ యెట్టిదో గ్రహింపుఁడు:

"We have come to know that what India truly seeks is not that which is in passive negation or in some mechanical adjustment but that which is in *Sivam*, in goodness; which is in ***Advaitam***, in the truth of perfect union—that India does not enjoin her children to cease from *Karma* but the perform ***Karma*** in the presence of the Eternal, with the pure knowledge of the spiritual meaning of existence."

(Vide Rabindranath Tagore's Presidential Address delivered at the 5th Punjab Students' Conference held on the 15th February 1935 in Lahore).

భారతహృదయము సౌందర్యమున కాలవాలము. సౌందర్యమందేకదా ఆనందము తొలుకాడును! ఆనందకాముఁ కావున వాల్మీకి వల్కలాజినములు ధరించిన రామునిగూడ కనుతగులు వనవల్లరులందు, ఆత్మను తనువు ప్రకృతిసౌందర్యమున నిలిపినాఁడు! వాల్మీకీయుఁడుగుజాడలఁబట్టి చనిన కాళిదాసు సౌందర్యపిపాసువై బ్రహ్మాండమును శృంగారభాండ మగుట గుర్తించి దానిని తనవశ మొనరించుకొనినాఁడు. కాళిదాసుని అక్కరములను చిదిపిచూడుఁడు; సుధారసమట్లు, తేనెచినుకుల లీల నందుండి సౌందర్య మవిరళముగ స్రవింపదా? అధునాతన భారతమహాకవి రవీంద్రుఁడు దేశసంప్రదాయమును మన్నించి, జనకునితో కొంతకాలము శీతనగముపై వసించి, మనసార సౌందర్యమును గ్రోలిగ్రోలి తన కవితయందు దానిని వెడలఁ గ్రక్కినాఁడు.

సౌందర్యమాధుర్యముల మహత్త్వము వర్ణనాతీతము. గళమున విషరాశి నిడికొని, కోఱలందు మృత్యుకాంతను నిలిపిన కాలసర్పముకూడ మధురనాగస్వరము వినినంతన ఫణ మెత్తి యాడదా? స్వర్గవాసనలను జాలువార్చు మల్లెపందిరి దాపునఁ గాఁపుర ముండఁ గాంక్షింపదా? క్రౌర్యమును లాఁగఁ దీయునవి, దుఃఖమును దునుమాడునవి, ఈసును నేలరాల్చునవి, దౌష్ట్యమును గూల్చునవి సౌందర్యసౌరభమాధుర్యములే! వీనికి నిధానమైనహృదయము స్వర్గము. ముండ్లులేనిగులాబివలె పొరపొచ్చెములెఱుఁగని సంఘము స్వర్గమున వెలయును. ఈచోటను జేర నెందఱెంద ఱాతురతపడరు? సుందరహృదయుని జేర

బహుభువనములు మఱుఁగునపడవా? భారతకవిహృదయము
దివ్యబృందావన మని పలుమాఱు వాకొనుచుందును. భారత
కవిరచనమును పరిశీలించుతఱి నందు నందనశోభ నుఁజూతుము;
కల్పకముతో కామధేను వందు కానంబడును. అమృతకలశ
ముతో మధురసౌరభము సహకరించుట గాంతుము. నేఁటి
మనుష్యసంఘమున చెలరేఁగు బడబానలము నార్పఁజాలు ద్రవ
కణము లీయమృతకలశములోనివే! నేఁటి విషవాయువులను
దఱుమున దీమధురసౌరభమే! కళకతన, విజ్ఞానముకతన వ్యక్తి
గతముక్తియే కాక సర్వమానవముక్తి కూడ సాధ్య మని నేను
వాదింతును. పనికతన భ్రాతృత్వసుహృద్భావములు తల
సూపు నని కంఠమెత్తి వచింతును. నేఁటిసభ్యజగతియందు బుస
గొట్టుక్రౌర్యమును లొంగఁదీసి, చిత్తము వచ్చినరీతిని దాని
నాడించి, దానిఫణముననుండి ప్రసరించు చారుమాణిక్యదీప్తు
లందు అద్భుతభావసృష్టిఁ జూపి ప్రపంచము నానందమయ
మొనరింపఁ జాలువాఁడు మాధుర్యసౌందర్యసౌరభముల
నాత్మహృదఁ బెంపొందించువ్యక్తి యని నొక్కి వక్కాణింతు
ను. పృథుకవీంద్రుఁడు రవీంద్రుఁ డిట్టివ్యక్తియేకదా! గంధబంధుర
మైన యీతనికవితను గాంచినంతన, యీతని ప్రఫుల్లహృద
యము దివ్యసౌందర్యనిలయ మని గుర్తింతుము. సౌందర్యసంశో
భితహృదయమే శాంతినికేతన మైనది."

హిమగిరిశిఖరములనుండి యెగసి దాపునఁగల పద్మ
పుష్కరిణియం దీఁదులాడు రాజహంసలట్లు, పద్మినీహృదిఁగల
గభీరమకరందహ్రదమున మున్కలు వేయు ఇందిందిరములవలె,

పర్వతని స్తబ్ధతయందు చిక్కని పాలనుబోలు వెన్నెలలో జల
క్రీడలాడుచుండెడి చకోరికములచాడ్పున, కడలికడుపునందు
మత్స్యావతారముచుట్టునుఁ జేరు వారిచరములవడువున, నెల
తాల్పు నాశ్రయించు ప్రమథగణముకరణిని, శ్యామసుందరు
నకు నలుకెలంకులందును రాసక్రీడలు సలుపు గోపికాబృంద
మట్లు, విజయియైన యేలికదాపునఁ జేరు వంధిమాగధులవలె,
దివ్యసింహాసనాసీనుఁడైన జగత్పతిచుట్టు నృత్తక్రీడలఁ దేలు
దేవతావితానమువలె, మగనితో ముచ్చటలాడజాబిల్లిచుట్టును
జేరు చుక్కనెలంతలట్లు, జగన్మోహినివెన్కఁ బడిన సౌందర్య
పిపాసువులలీల, నందనమున కెనయైన హృదీశ్వరిహృది
యందు విహరించు ప్రాణపతిపగిది, కమలభవనర్తనునిసమీప
మున నృత్యమొనరించు దేవభాగవతులయట్లు, తీవయిల్లాలి
రొమ్మున నెమ్మినంటిన విండు పండులట్లు, తేనెలూరు పువ్వు
వాతెరపై వ్రాలు మదనవనోద్ధూత మత్తకావ్రాతము
మాడ్కిని, చంద్రికలను జాలువార్చు ముఖమండలముపైని
చిందులాడు బాలచికురజాలమట్లు, తోడిరాగముతో గంతు
లేయు మధురకళాశతులవలె, సంయమీంద్రుని పదసరోజము
లంట నేల వ్రాలు భక్తస్తోమముకైవడిఁ భావనావీథులయం
దెగయు రచయితమనసువెంటఁ బఱతెంచు పదనాలుగు
భువనములభంగి, యుగపురుషుని శిరమున వ్రాలు నక్షత్రా
క్షతలయట్లు, చంటిబిడ్డమోవి నంటు ముద్దు దొంతరవలె, శర
చ్చంద్రునిషోడశకళలంగు తానమాడు కవిస్వప్నములకరణి,
మోహినిసోయగమున నీఁదులాడు చూపుగుంపులచాడ్పున,
వరప్రసాదపై వ్రాలు లెక్కలేని ఆశీస్సులవలె; ధ్రువనక్ష

త్రముదాపునఁ జేరిన సప్తఋషిమండలముమాడ్కి, కవిచిత్త ముతో చిత్తము వచ్చినట్లు దోబూచులాడు భావసౌదామినీ నివహములై పడి, సంధ్యాసీమంతినిపయ్యెదపైని పొటమరించు పూతరాగరేఖలయట్లు, పాటగాని స్వరముతో నుబ్బుచుఁ దే లూఁగు సంగీతసంగతిసంతతులవలె, మహావక్తరసనపైని దేలియాడు వచనపరంపరవలె, వీణాతంత్రిపైని క్రాలు రాగవల్లరివడువున, రామచంద్రునిచుట్టునుఁ జేరినకోఁతిమూకల చందమున, సహజరచనాధురంధరుని కలముకొనఁగల వచన వాహినివడువున, ఇంద్రధనువును పట్టి ప్రాఁకులాడు సప్త రాగసందోహములీల, కెంపుదారము ప్రాపుఁగొనిన పవడపు వరుసవలె, మహాపురుషుని కమనీయచరిత్రముపైని జల్లున రాలుపూలవానకరణి, అర్ధాంగికరస్పర్శకతన నిలువెత్తు పులక లపాలువున, ప్రణయినిముద్దుమోమున నుప్పొంగు నవ్వులట్లు, పరమాత్మచుట్టును భజనసేయుజీవాత్మవ్రాతమువలె, త్యాగ మూర్తిపవిత్రస్మృతి నాశ్రయించు యుగసహస్రములచాడ్పున, తూరుపుదెసఁ బరతెంచుపిట్టమూఁకలతీరున, కల్పకశాఖలపైని కాఁపురమున్న దివ్యభావములు రివ్వురివ్వున నెగసి రవీంద్రుని హృదయమును జేరుకొనినవి. రవీంద్రుని మానసమానససరో వరమున నీఁదులాడు భావమానసౌకములు దివినుండి యెగసి వచ్చినవి కావున రవిరచనముఁ దోఁచినంతనె యవి దశదిశల దృష్టి నాకర్షించినవి. దివ్యశోభగల ఈ రచనముపై నేఁ డైదు ఖండములును పూలు చల్లుచు, నేకగ్రీవముగ 'గీతాంజలి' నాం క్షించుచున్నవి. ప్రేమతారకము నుచ్చరించుచు, నివి మఱి

కొంతకాలము ప్రతపేత్ర నెఱపెనచో, వసుమతియందు మహా శయములు ప్రత్యక్ష మగును. సౌందర్యోపాసనముకతన నా నందశాంతులు వెలయు ననికదా తెలిపియుంటిని.

మానవకల్యాణమునకై కంకణమును గట్టుకొనిన ఆచార్యు లందఱును ప్రాచీపృథ్వినుండి వెడలినవారే! కావున సకల్యాణకాంక్షను హృదయమం దిడికొనిన పాశ్చాత్యమనీ షులు పూర్వవసుంధరపైని దృష్టి సారించుచుందురు. పూర్వ దిగ్వలయమున నేఁడు విజ్ఞానభాస్కరుఁడై తేజరిల్లుచున్నవాఁడు రాధాకృష్ణుఁడు. ఈయాంధ్రవరవికి ప్రతీచీప్రపంచము పద్దెండేండ్ల నుండి ప్రేమార్ఘ్యము నొసఁగుచున్నది. రాధాకృష్ణునివచనము లందు వస్తుప్రభలను పరికించిరే, ఇతని రచనలందు భాస మానభావచ్ఛటల వీక్షించిరే, ఈతనినుద్దేశించి పాశ్చాత్య జిజ్ఞాసువులు గాయత్రి జపింపఁ గాంక్షించుచున్నారు. ఆక్స ఫర్డ్ విశ్వవిద్యాలయము రాధాకృష్ణుని నేఁ డాచార్యపీఠమున నాసీనునిఁ గావించినది; ఈతనిహృదయమునఁ దేజరిల్లు పరంజ్యోతికి జేజేలు పాడ మక్కువపడుచున్నది.

రవీంద్రరాధాకృష్ణులు శివకేశవులఁబోలువారు. వ్యక్తు లు వేఱుగాని, వీరిద్యృక్పథ మొక్కటియే! 'రవీంద్రుఁడు తాత్త్వికుఁడు, రాధాకృష్ణుఁడు కవి' యనుటకు సంశయింప నను. తేనెపెరలోని మధురభావకణములకును, కవిరచనమం దలి తేనెతుంపురులకును గుణభేద ముండునా? రవీంద్రుని పల్కులయందలి సుధాబిందువులకును, రాధాకృష్ణుని నుడు

వులలోని అమృతకణములకును గుణభేద మున్న దని తెల
వా రెవరు ? రవీంద్రుఁడు తన భావామృతమును గణయత
యందు నింపును; రాధాకృష్ణుఁడు తన భావసుధను ధార
వాక్కులయందుఁ గురియించును. కవిత్వమహత్త్వమును
యించునది భావధారగాని యతిప్రాసలత్రాడు కాదు.

భావనందనమున మసలువాఁడు రవీంద్రుఁడు. రా
కృష్ణుఁడు బృందావనవిహారి కాఁడా? సౌందర్యోపాసకులు కా
వీరి హృదయములు సౌందర్యసంసిక్తము లైనవి. కళావ్రతు
కావున వీరి మనసులు కళాప్రదీప్తము లైనవి. భావసౌంద
మును గదా మన మీవ్యాసమునందు విశేషముగఁ బరిశీలిం
చున్నాము. రవీంద్రరాధాకృష్ణుల రచనములయందు మనస
త్త్వములకు మిఱుమిట్లుగొలుపు భావరాశి ఎంత లేదు? పఠిత
తన్మయత్వమును జేయించు సౌందర్యసౌరభమాధుర్యము
నిండుకుండలోని గంగోదకములై వానియందు తొలుకా
చుండవా? * కళకు మంత్రశక్తి నిచ్చునవి యివియేగదా
మానవుల నానందశరధియందు ముంచునవియు నివియే య
తెలుఁగమా ?

"సత్యం, సుందరం, శివమ్"లు త్రిమూర్తులను పోలున
మువ్వురు మూర్తులు కలిసి ఒక్కదత్తాత్రేయుఁడగుటకు కా ణ

---

* కాళిదాసాదుల పల్కులయందు కాఁపుర ముండెకదా సౌంద
సౌరభములు మనుష్యలోకమును రసాబ్ధియందు ముంచివైచినవి !

"Who is not thrown into raptures on enjoining the swe
words of Kalidasa, as by the clusters of flowers overflowi
with honey?" Harsha Charitra.

వ్యత్యాసములు లేకుండుటచేత నేకదా! "శివాయ
ము శివరూపాయ విష్ణవే" యనికదా సంధ్యావందన
చుచుందుము. "సత్యమే సౌందర్యము, సౌందర్యమే
భారతవిజ్ఞానులు వాకొనువారు.* కీట్సుమహాకవి
uth is Beauty, Beauty is Truth" అనినాఁడు.
మ్మని తెలుపఁగలము. సత్యము మానవుని చేతి
ముక్తిగంధారము నిడు నని ఏసు తెలిపినాఁడు.
shall know the truth, and the truth shall
free" vide Gospel of St John, Chapter 8
సౌందర్యోపాసకు లైన రవీంద్ర రాధాకృష్ణులకు
డైన గాంధి పైదోడు. పరమాశయములపై దృష్టి
జ్యోతి నారాధించు నీముగ్వురు భ్రాతలును అధు
ధరయం దవతరించిన ముక్తిదూతలు కారా?

ల ప్రపంచపథికుఁడై వెడలిన రాధాకృష్ణుఁడు
ఖండముల యుద్వాహమహోత్సవమునఁ బురో
డు. పూర్వపశ్చిమనాగరకతలకు పెండిలిసేయఁ
ర్యుఁ డితఁ డని ఈతని నెఱిఁగినవారు గ్రహింపఁగలి
చీనభారతవిజ్ఞానమును తనివారఁ గ్రోలి, ప్రాచీన
ను హృదయంగమ మొనరించుకొనిన మనీషి
డు. కాని, యితఁడు ప్రాచీనభావమునఁ గైదీమై

---

మసత్యముకన్న సుందరము లేదు" సౌందరనందము.

యుండలేదు. * భవానికి ప్రణమిల్లి, భవాని కరుణపెంపున మహత్తరావేశమంది, రణోర్వియందు లంఘించి జయపతాకను చేబూనిన శివాజీవలె ప్రాచీన ప్రాభవమునకు ప్రణమిల్లి, దాని కారుణ్యముకతన ద్విగుణీకృతశక్తి నంది, కపిధ్వజమును

---

* నా నుడువులయందలి సత్యమును నిరూపించుటకు రాధాకృష్ణుని గ్రంథములనుండి బహుళదృష్టాంతములను చేర్పగలను. స్థలసరిపోని కతన రెండుమూడు తారకారణములమాత్రమిందు నుల్లేఖింతును.

"We are able to see further than our predecessors, since we can climb on their shoulders. Instead of resting content with the foundations nobly laid in the past, we must build a greater edifice in harmony with ancient endeavour as well as the modern out-look." (Vide Chapter on "Philosophical Development" Sir Radhakrishnan's famous work ' Indian Philosophy.")

"If, before it is too late, there is a reorganisation of national life, th re is a future for Indian thought, and one cannot tell what flowers may yet b'oom, what fruits may yet ripen on the hardy old trees." (vie Chapter on "The present situation" in the same work).

"The spirit of Hinduism can be found not in this or that stage of its history or this or that sectarian movement which arose within it. They are its lisping expressions: the intended significance is what binds the different stages and different movements, and makes them all expressions of one fundamental faith. If then we take a historical or synthetic view, we will discover that while the faith of the Hindu is as broad-based as human nature itself is practical application cannot end short of the building of a human commonwealth." (Vide Sir Radhakrishnan's article on "Rammohan, a Philosophic Modernist" in "The Father of Modern India" page 343.)

రాధాకృష్ణుడు ప్రాచీప్రతీచీసంస్కృతులకు వియ్యముఁగూర్పఁజాలిన పల్వురు పాశ్చాత్యపండితులే పలికిరి.

చేఁబూని, విజ్ఞానకురుక్షేత్రమున దేవదత్తమును బూరించి, అపూర్వదృశ్యములను పొడగాంచి, విజయుఁడై రాధాకృష్ణుఁడు నేఁడు ప్రతిభాపాశుపతమును ప్రయోగించుచున్నాఁడు.

రాధాకృష్ణుఁడు యాత్రికుఁ డంటిని; పథికుఁ డంటిని; ముక్తిదూత యంటిని; కళావ్రతుఁ డంటిని; సౌందర్యోపాసకుఁ డంటిని. భావికాలఫాలతలమున కస్తూరితిలకములీల వెలయు కొండొక మహత్తరోద్దేశము నుద్దేశించియే గదా జిజ్ఞాసువు వ్రతము సలుపును! భవిష్యత్కాలవిహాయసమున శుక్రతారవలెఁ దేజరిల్లు మహాశయముపై చూడ్కి నిలిపియే కదా పథికుఁడు ముందంజ వేయును!

భారతస్వాతంత్ర్యమును, మానవముక్తిని గాంక్షించు అరవిందయోగి తన యున్నతోద్దేశసిద్ధికై పరంజ్యోతి నారాధించుచున్నాఁడు. భారతరాజకీయములందు పాల్గొను యోధులు రవీంద్ర బంకించంద్రుల జాతీయగీతముల నాలపించుచు,

---

........."And so the function, the unique function which Radhakrishnan fulfils today is that of a liaison officer. He seaks to build a bridge between the traditional wisdom of the East and the new knowledge of the West, that each may be enriched by the qualities of the other. Synthesis and reconstruction are his objectives and he believes that they can be most effectively achieved by a revival of religion." (Vide "Counter Attack from the East" or "The Philosophy of Radhakrishnan" by C. E. M. Joad).

"As Tagore is the poet so is Radhakrishnan the philosopher of New India—......He is profoundly influencing the new movement." (Vide "The Dawn in India" by Sir Francis Younghusband).

వ్రతనిష్ఠ నెఱపుచున్నారు. సౌందర్యపిపాసువులై, కళోపాసకులై, స్వాతంత్ర్యమంత్రమును పునశ్చరణ మొనరించుచు రామలింగారెడ్డిప్రభృతులు నాఁటి కబీరాదులవలె భారతపథికులై పరఁగుచున్నారు.

ముప్పదేండ్లనుండి వంగమాత నూతనోత్సాహమును జూపుచున్న దనికదా పల్కితిని. ఆంధ్రమాత వంగజననితో సహకరించి "వందేమాతరం" గీతి నాలపించినది. గాంధియుగమం దీమె నవజీవన మందినది.

"నవజీవన" సంపాదకుఁడే ఈ నవజీవనశక్తి నిచ్చుట సంతోషకరము. "యువభారత" సంపాదకుఁడే ఈ నవజీవనమును ప్రసాదించుట ముదావహము. స్వర్గసామగ్రియైన సౌందర్య మాధుర్య సౌరభములు యౌవనసమయమందే కదా పెంపొందును! * మహత్తరాశయముపైని కన్నుంచిన మనసు నిర్మలమై యుండు నని గాంధి విశ్వసించుచుండును.† నిర్మలచిత్తుఁడై రాజకీయములను పరమాశయములకు లొంగించిన ప్రథమమానవుఁ డీతఁడే! బహువర్షములనుండి భారతీయుల భావముక్తికై, ‡ సాంఘికముక్తికై, రాజకీయముక్తికై,

---

* "Bliss was it in that day to be alive,
But to be young was very heaven" Wordsworth,

† "A mind that is once hooked to the star of stars becomes incorruptible" Mahatma Gandhi.

‡ వివిధరీతులముక్తికై ప్రపంచమహాపురుషులు పాటుపడిరి. తొలుత వీరిదృష్టి నాకర్షించినది భావముక్తి. విద్యాకతన, ఆత్మశక్తివృద్ధికతన నిది చేకుఱును. దీని నందినమానవుఁడు పరమాశయములదెస చరచర సాగిపోవును.

* ఆర్థికముక్తికై, ఆధ్యాత్మికముక్తికై, పరంజ్యోతి నారాధించుమహాత్ముఁడు గాంధి!!

బహుభంగుల విజృంభింపఁజాలు విద్యుచ్ఛక్తివలె జీవనశక్తి బహువిధముల, బహుళాంగణములందు విజృంభించును. నవజీవనశక్తి రాజకీయసారస్వతసాంఘికాది వివిధాంగణములయందు నేఁడు కొంత గోచరించుచున్నది.

---

భావదాస్యము మనుష్యత్వమునకు భంగముఁ జేయును. అన్యభావములకే అనవరతము అంతరంగము నొడ్డువాఁడు తన మనుష్యత్వమునకు తలవంపులు చేయును. నిగరించు సహజశక్తిని రేపునది స్వతంత్రయోజనము. స్వతంత్రయోజనమందే భావముక్తి కలదు. బుద్ధుఁడును, వివేకానందుఁడును దీని మహాత్త్వమును పలుమాఱు ఉగ్గడించిరి. ఎమర్సనాదులు వీరి పంథననుసరించిరి. **"A man must learn to detect and watch that gleam of li ht which flashes across tha mind from within, mcre than the lustre of the firmament of bards and sages." Emerson**

* భారతరాజకీయోద్యమము ఈ ముక్తికొఱకై విశేషముగ తపించుచున్నది. ఇది యలవడిననాఁడు భారతావనిని పీడించు దుర్దాంతదారిద్ర్యమంతరించును. ఆర్థికముక్తి మనదేశమున కృషికముక్తికి పర్యాయపదము. ధనరాసుల నొకత వునను, చిల్లపెంకుల నింకొకచోటను చేర్చు ఆర్థికవిధానము అంతర్హిత మైననాఁడే కృషికులును, కూలివాండ్రును (ఏదేశమందైనను) నిష్పచ్చరమునుండి లేవఁజాలుదురు. అట్లది యంతర్హితము కానిచో, కృషికులు త్వగస్థిమాత్రావశిష్టశరీరు లగుదురు. కృషికసంతతి కూలఁబడినపుడు, వెన్నెముక విఱిగిపడినపుడు, దేశము తొట్రుపడదా? దీని తలపై దౌర్భాగ్యము స్వారి చేయదా?

" Ill fares the land, to hastening ills a prey,
Where wealth accumulates and men decay." Goldsmith.

సంస్కృతిపై నేఁడుకొందఱు దృష్టి సారించుచున్నారు; దేశచరిత్రలను పఠించుచున్నారు. చిలుకూరివారును, మల్లంపల్లి, భావరాజుసోదరులును చరిత్రయందు చక్కని పరిశోధన మొనరించుచున్నారు. కలకత్తావిశ్వవిద్యాలయాధికారులవలె నాంధ్రవిశ్వకళాపరిషత్తువారును మాతృభాష నాదరింపదొరఁకొనిరి. రామలింగారెడ్డివలె రాధాకృష్ణుఁడు ఆంధ్రవిశ్వకళాపరిషత్తున నాంధ్రభారతినున్నతపీఠమున నధిష్ఠింపఁజేసినాఁడు.

పాళీభాషయం దాఱితేఱిన లక్ష్మీనరసింహకవి ఆంధ్రవిశ్వకళాపరిషత్తున నీభాషకు ఉచితస్థాన మొసఁగి, పున్నానంద సిద్ధార్థులట్లు పాళీప్రబోధనమువలనఁగూడ ప్రాచీనవిజ్ఞానమును పునరుద్ధరింపఁ బూనుకొనవలెను.

ప్రాచీప్రతీచీవిజ్ఞానములను ఆంధ్రయువకుల హృదయములందుఁ జొనుపఁజాలు బహుళభాషావిశారదులకును, కళోపాసకులకును, శాస్త్రవేత్తలకును ఆంధ్రవిశ్వకళాపరిషత్తు స్వాగత మొసఁగవలెను.

అంతరంగస్థదివ్యశక్తులను లేపునవి కావున మనవిద్యాలయములయందు లలితకళలు ఆరాధ్యదేవతలై యుండవలెను. వ్యక్తిగతప్రజ్ఞకు సరిపడునట్లు వివిధవ్యక్తులయందు అధునాతన పద్ధతుల ననుసరించి సముచితశిక్షణము జరగవలెను. స్త్రీవిద్య నిర్బంధప్రాథమికవిద్యలు అభివృద్ధి నందిన వని భారతవిద్యాపరిస్థితులను గూర్చి కొంతకాలముక్రిందను తాము వెలువఱిచిన నివేదికయందు భారతప్రభుత్వమువారు తెలిపిరి.

ఈ యభివృద్ధి యేపాటిది? విద్యావ్యాప్తికై పాలకు లింకను శ్రమింపవలెను. రాష్‌బిహారీ ఘోష్, తారకనాథపాలిట్, అశుతోషుముఖర్జీలను బోలు దేశభక్తులు ఆంధ్రభారతి కంజలి నెత్తి పైడిప్రాలతో నామెను పూజింపవలెను.

విద్యాంగణమునందు మనదృష్టి నాకర్షించు బహుళాంశ ములనన్నింటిని విమర్శించుట కిందు తావు లేదు. విద్యకు సంబంధించిన ప్రధానసూత్రములను పరిశీలించుట నా ప్రస్తుత కర్తవ్య మైనది. ఉత్తుంగశిఖరమునుండి గుభాలునఁ గూలఁ బడి, పునరుద్ధరణము నపేక్షించుచున్నాము కావున, శిర మెత్తి కాలవియత్తలమున నుడురాసులయట్లు కాంతిలు ఉత్త మాశయములపైని చూడ్కి నిలుపుఁడని తోడివిద్యార్థులను వేఁడుచున్నాను.

* భారతి నారాధించిన యువకుఁడు నేఁడు దురంత దుస్స్థితియందు మగ్గుచున్నాఁడు. ఈదుస్స్థితిని విలోకించినపుడు మనకన్నులనుండి అశ్రుబిందువులే కాక రక్తకణములు కూడ

---

* Very few, however, could visualise the downpour of whips and scorns which descend on the youngman's head or care to cast a look on the difficulties which stalk in the path of his life. Worries and miseries notwithstanding, he strives to find out the ideals—to wit Love and Truth, Peace and Self-sacrifice—of life and realises that they have flown from the planet he inhabits, The young man of today does not catch a glimpse of the noble ends of life either within or without the portals of his scholastic career. On the school bench he is a receptacle taking in parcels now of rubbish and stuff, now of hard indigestible stone-like something. When he carries himself somehow to the post-gradute seat, he is treated to the glory of eloquence and the hail-storm of 'words, words, words.' The zealous

జొటజొట రాలుచున్నవి. "కడుపుమంటచేఁ బొగులుచుండఁ బరమాశయములఘోష మన కేల ?" యని యడుగువా రుందురు. నిరాశ నిటలమున నధిష్ఠించినపుడు మనము నిట్టూర్పులు విడువమా ? అగ్నికీలలు నలువైపులనుండియు చిమ్మఁది

---

aspirant that he is, he drinks in brilliant thought shining on the crest of wavy phraseology flowing in wondrous rapidity from the snow-capped pinacle of Intellect. Pampered with intellectual delicacies he develops a plethora of self gratulation and walks slowly into the wide world to strut—for a time without tears—in the splendid corridors of some court or to break into sobs on the "No-vacancy Board" of some office. If he is a fortunate fellow, he finds a big man handles a luxurious boot to lick out an existence of Rs. 5 a day from its soiled sole. If he is sturdy enough, he finds a rikshaw or a bullak-cart widowed of its bullock to drag his heavy life on the high roads of Earthy Hell.

... ......He is alas! held-up in the strife of thought and action. He stands ghast at the tragic disparity between precept and example, between greatness and great men, between famous men and good men. The perfume of rosy thought does not lead him to the dawn of bliss or the lawn of peace but to the horriod field of hot atmosphere and shot limb. Insincerity writ large on the Walls of our Globe, swims within the ken of his vision. The very same walls reveal the flaming lines of some invisible hand and the student reads in them the premonition of a fatal future. He sits cross-legged within the chamber of his own being and asks. "How could this horror have its birth in the harem of Intellect?" "No answer is heard in the vestibule of his heart. The murmurs of his conscience drop into the inmost depths of despair like sacred cakes into the dry heart of *Kupagapa*, The ideal of Idealism, the precept of optimism, of which he gathered enough to spare in the class-room and on the platform, do not fil him with solace. The realities in the world are stiff and rugged: he stumbles on them, he bleeds profusely. He shudders to find Balzebub and his retinue effectively execut-

ing the re o utions once pass d in Pandemo iu n. "The triump of the Devi " shrieks the student. " verily has in it the story of the Fall of Man."

"Why" asks the student pent up with feelings of righteous rage "is this tal talk on the go d of Truth an l ove, Peace and Se f-sacrifice?" We say 'amen' o his feelings. Truth—tear o e t e hearts of the pro e so s of ruth and s-e if y u can fiud an ot o it Lo e—break do vn the hearts of those demogogues that arangue on o e; you will shr ek and run from the steam of malice urging into vo r fa e elf-sacr i e—c t to pieces the hea ts of pu pits and p atforms; you wi l vom t or he deadly stench th t emanates from their tilthy aps tu e. Peace—r nsack the e ce co te ences and stand by o hea cannon thunders deli- vering Se m ns on the Moun . This is the ph nome a which vouch afe the young m n of toda a lavish deal of the idea s of life.

...... ...Alas! he is but the make-up, for whatever it is ort, of h ma stuff and this t ff is a finite sort of stuff amenable to the n o ernable paroxysm of gr et o despair. If there is any preternat al o e ith sudden v turns him nto that Being, who they s y is Infinite and who can fo a l times bear and be r uth ess olly o indignities, or into a stone and nothing but a one he would calmly ta e kicks in both ha d, nur e se ere he t-ache within himself with superhuman or ston- ike equani- m tv, re d the philo op y of k sses in the Nia a a of kicks and fu t e invite 'the slings and arrows of outrageous fo tune.' B t the p or mo tal that he is, he can in vain e out of the lim ta- tions and la ings which do the footsteps of e ery mortal. If he is not com le ely tattere l to pieces, he has sp e did opportunities to run amu k a d to fi d the n ose s ecified for a person of that status.

I no oose is requisitioned, he takes t e ho rid b ade of his own m ery, plunges it deep in his troub ous ea t, feeds the hung e- ing earth with his warm fles and wa mer b ood and finds his way into 'The undiscove ed country from who e bo rn no traveller retu ns.'

(Vide M article on "*The Torch-bearers of Tomorrow*" *The tudent's Chronicle* March, 19 4.

ముట్టించు పరిస్థితులు ప్రత్యక్షమైనపుడు "హా!" యనమా? హృదయమునందు పొంగి పొరలు దుఃఖరక్తమునందు కలము ముంచి వేడిపొగలు నందుండి వెతలింపమా?

కాని, మనము భారతీయులము. నిరాశకుఁగాని, నిట్టూర్పునకుఁగాని పట్టముఁ గట్టము. సహనము మనకు సహజకవచము. మన దృష్టియందుండునది సర్వతోముఖాభివృద్ధి. ఈ యాశయమును మ్రుగ్గనీయనట్లు మన చేతఁ బెట్టి, మనచరిత్రను కుసుమవిలసిత మొనరించి, మనజీవనములను గంధబంధురములుగఁ గావించునది ఆత్మశక్తి.

ఆత్మను తనుపు ఆహారము మనకు అక్కఱలైనది. ధనధాన్యములను, పిల్లకొండలవలెను కట్టిపెట్టుటఁ జేర్చుకొనఁగలిగినచో, సుఖశాంతులను కనఁజాలుదు మని మన మూహింపరాదు. ఐశ్వర్యమున నేఁడు వసుంధరయందు దగ్రస్థానము వహించిన అమెరికాయందే ఆత్మహత్య లధికముగా నున్నవని చదువుచుందుము. ధనరాసులు హృదయప్రమోదమును చేకూర్చునని తలఁపరాదు.* ఆర్థికాభివృద్ధికై శక్తివంచనలేక యత్నించ

* ధనవంతుఁడు స్వర్గమునకు దూరస్థుఁడై యుండు నని పలికినాఁడు ఏసు. రవీంద్రాదు లిట్టిభావమునే వ్యక్తపరచిరి.

---

"It is easier for a camel to pass through the eye of a needle than for a rich man ro enter the Kingdom of Heaven" Jesus-

"He who is bent upon accumulating riches is unable, with his ego continually bulging to pass through the gates of comprehension of the spiritual world, which is the world of perfect harmony; he is shut up within the narrow walls of his limited acquisitions." Rabindranath Tagore.

నెల్లరను ప్రోత్సహింతును గాని యిహపరములు లేనియందే యిమిడియున్న వని తలంపరా దని నొక్కి వక్కాణింతును.

కడుపును నింపు చదువును, మనసును నింపు చదువును మాత్రము పలువు రెఱుంగుదురు. ఆత్మను తనుపు చదువు కావలెనని నావాదన. "Man does not live by bread alone" అనికదా ఏసు పలికినాఁడు! మానవుని యంతరంగమునం దున్నది ఒక్క కడుపు కాదు. ఉదరమును పూరించినంతన మనుజునికర్తవ్యము చెల్లిపోదు. మనుష్యుఁడన రక్తమాంసముల మూట కాఁడు. శరీరమానసవ్యాయామములకు నాత్మవ్యాయామము తోడుపడవలెను.

రథము దేవుఁడు కాదు; విగ్రహము దేవదేవుఁడు కాదు. పూలును, పండ్లును వానిపైఁ బడుచున్నను, సుమదళములనుండి జాలువాఱు ప్రేమసుధను, ఫలమందు పరిపక్వమైన భక్తిభావమును అనుభవించునాతఁడు అదృశ్యుఁడై యుండు జగదీశుఁడేకదా! మనము చూచునవి అంగప్రత్యంగములును, దశేంద్రియములు నైన నేమి, మనపుష్పాంజలిని, మన ఫలప్రసాదమును అందవలయునది అదృశ్యమైయున్న ఆత్మయే! ఆత్మ సంతృప్తి నందినముహూర్తమందే అంతరంగమున సచ్చిదానందములు వెల్లివిరియును. ఘోరారిష్టము లెట్లు హుంకరించినను, పిశాచగణము లెన్ని మార్కొనినను, శక్తిసమన్వితమైన ఆత్మ చలన మెఱుఁగకుండును. ఎడతెఱపి లేక రాలు పిడుగులను కృష్ణపరమాత్మ గోవర్ధనచ్ఛత్రముపై

నిలుపలేదా? దేవేంద్రునిబల మంతయు శ్రీకృష్ణుని చిటికెన వ్రేలికైన సరిజోడు కాఁగలిగెనా? కృష్ణశక్తి ఆత్మశక్తికి మారు పేరందును. ఆత్మశక్తి యెట్టిదో గ్రహింపవలె ననినఁ గృష్ణ మహాత్మ్య మెఱిఁగినఁ జాలును.

ఆత్మశక్తి నలవఱుచునది పరమాశయముల యారాధనమే! ఇట్లని మహాత్ముల జీవనములే మనకు విశద మొనరించుచున్నవి. ఈయారాధనమునకై నేఁడు జిజ్ఞాసువుల నాహ్వానించుచుంటిని. వ్రతనిష్ఠయందు, దీక్షాజీవనమున పాల్గొనుఁ డని వారిని వేఁడుచుంటిని.

పరమాశయములు పరంజ్యోతివలననుండి ప్రసరించు మయూఖము లనికదా పలికియుంటిని. మన విశ్వవిద్యాలయములు వ్రతమంటపములు కావలె ననియు, వీనియం దీజ్యోతి వెలుఁగవలె ననియు నావాంఛ. పరంజ్యోతికి ప్రణమిల్లి, దివ్య మరీచికాగుచ్ఛమునఁ దేజరిల్లు విద్యార్థులు ప్రభాకలిత జీవులు కారా?

# సుభాషితము

## సాధన

నిండుగుండె గలవ్యక్తి ప్రపంచముపైని పులుఁగువలె ప్రాలు దుస్థితిని చూచి కటకటంబడును. గట్టిమెదడుమాత్రము కలిగి దీర్ఘయోజనలయందే దినములు కడపునాతఁడు విచలితచిత్తుఁడు గాక చోద్యము చూచుచుండును. కలహవాతావరణముతో నిండిన అధునాతననాగరకతను, దురంతదుఃఖప్లావితమైన అర్వాచీనమానవజీవితమును నేఁడెందఱో చోద్యములు చూచినట్లు చూచుచున్నారు.

శాంతినిగుఱించి కొంతసందడి లేకపోలేదు. కాని కన్ను ఫిరంగులనుండి తొలఁగిపోలేదు. నానాజాతిసమితి (League of Nations) నుండి సుఖశాంతులు వెల్లివిరియునని ఎవ్వరును ఆశపడుట లేదు. సమస్తభూవలయమునందును శాంతిపాఠమును బోధింపనెంచి కొంతకాలమునకు మున్ను బర్మానుండి కొందఱు బౌద్ధసన్న్యాసులు పయనమైరి. ఈ భిక్షులయుద్దేశము మహత్తరమైనదే! కాని వీరు నాటనెంచిన శాంతిబీజమునకు ఘానసముల నొడ్డు పుణ్యాత్ము లెవరు ?

శాంతిస్థాపనమునకై కలువురు తనువులను తుచ్ఛమొనరింప సంసిద్ధులుకారేని, ఆయుశ్శ్రేష్టాశయము గగనకుసుమమగునని సుమారు నాలుగేండ్లకు మున్ను జినీవాలో రాధా

కృష్ణుఁ డనినాఁడు ("Unless individuals arise in eve
State— men who are prepared to suffer and
mauled to the earth for the sake of Peace, we sh
not get nearer the goal.") సంపూర్ణాంతరంగికపరివర్తన
వలనఁగాని శాంతి చేకుఱదు. ఈ మార్పును జనింపఁజేసె
శక్తి యెందుండివచ్చును? "ఉత్తమాశయముల నారాధిం
వారి కడనుండి, హృదయము గలవారి కడనుండి"
యుత్తర మొసఁగఁజాలుదుము.

హృదయసంపద స్త్రీలకు మెండుగా నుండును. రా
యములందును, సాంఘికరంగములందును నేఁడు వీరుముంద
వేయుచున్నారు. అన్ని క్రియాంగణములయందును పుర
లతో సమముగ తాము హక్కులనందవలెనని వీరు కంఠమె
పలుకుచున్నారు. హక్కులకును, బాధ్యతలకును అవినాభ
సంబంధము కల దని న్యాయశాస్త్రము (jurisprudence)
లుపుచున్నది. బాధ్యతలకు స్వస్తి చెప్పి హక్కులనే చేఁబ
గాంక్షించు పురుషులసంఖ్య అధికమై యుండుటచే, నేఁ
ప్రతికూలపరిస్థితులు విజృంభించుచున్నవి. గురుగుణము
పుష్పాంజలి నిచ్చి వ్రతములు నెఱపుచుందురు గాన, స్త్రీ
వీరికి చక్కనిబాట చూపఁజాలుదురు.

భారతపురాణములందును, చరిత్రములయందును
మహాత్త్వము వర్ణింపఁబడినతీఱును పలువు రెఱుఁగుదు
"న మాతుః పరదైవతమ్", "మాతృదేవో భవ" మున్న
నుడువులు గభీరభావసమన్వితములు. ఒక్కొకపుడు పుర

నందు నెరసులు గోచరించినను, స్త్రీమహాత్త్వము ఆకాశప్రదీపమువలె వెలింగెను. తానొకప్పు డందిన ఉన్నతినే తనపరమాశయముగా నెంచి, దాని నందుటకై స్త్రీశక్తి వంచనలేక ప్రయత్నించవలెను.* పురుషుఁడు చేయుఘనకార్యములందును, ఆతఁడెదుర్కొను అపాయములయందును తనకు సమానభాగము కలదని స్త్రీ వాదించు నని నాఁడును, నేఁడునుకూడ ( vide Rabindra Nath Tagore's "*Chitra*") భారతసాహితి తెలుపుచున్నది. ఈ యపాయముల నెట్టించుట కామె వేయివెరవులు రోయు ననుట కెన్నెని దృష్టాంతము లున్నవి. సేవాధర్మము నెఱపవలయుచోటులం దెపుడును స్త్రీ నిలిచియున్నది. దేవివలె నీమె కట్టెదుటఁ దోఁచినపు డెన్నెని బాధలు పటాపంచలైనవి. నైటింగేల్ కన్య సలిపిన సేవాధర్మము జగద్విదితము. కడచిన ఐరోపామహాసంగ్రామమున పురుషులు శరీరములను తునకతునకలు చేసికొనినపుడు స్త్రీలు వారికి వివిధోపచారములు సలిపెడివారు. ఉత్తమాశయముల నొక్కొకపుడు గుర్తింపక గులకరాలట్లు పురుషులు వానిని గిరవాటువేసిన వేళలందు వానికి మానసముల నొగ్గి, అద్భుత ఆధ్యాత్మికశక్తి నంది మానవపురోభివృద్ధికి వారు తోడ్పడిరి. ఇట్టి పవిత్రధర్మ నిర్వాహణమునకు అధునాతనవసుమతీపరిస్థితులయందు అనివార్యమైనతరుణ మాసన్నమైనది. కొంప తగులఁబడుచుండ నెవ్వరైనను గీతగోవిందములు పాడ నెంతురా? దురంతదురి

* కజిన్స్‌సతి యేమనెనో పరికింపుఁడు: "The ideal for woman is not to rise to man's height but to her own height."

తోత్కటబాధలు భీషణనృత్య మొనరించుచుండ, నెవ్వరైన చెండ్లాటకు దొరకొందురా? దురదృష్టము! అట్లు పాడువారును, ఇట్లాడువారును నేడు గోచరించుచున్నారు. మన తల్లులును, సోదరీమణులును ఈ వికృతదృశ్యమును మాపొసరింప నడుము గట్టిరేని, వీరి సేవయందలి మహాత్త్వమును గుర్తించి, వీరి గురుగంభీరదృష్టాంతము నోజబంతిగ జేసికొని పురుషులు సముచితమైన ఆంతరంగికపరివర్తనము నందెదరు. అట్లందిననాడు మనుష్యసంఘమున భుగుల్భుగుల్మనుపొగలు అంతరించును. ఏ యుగమునందును, ఏ సీమయందును పిశాచమునకు నెగ్గుదల లేదు. కాలక్రమమున జయపతాక యెత్తగలుగునది సదాశయము గాని కుత్సితంపుతలంపు కాదు.

ప్రతిసీమయందును ప్రజలు నేడు ఓటుకొఱకును, రాజకీయములయందలి '*Franchise*' కొఱకును కృషి సల్పుచున్నారు. యశస్తిలకుడు రోమేరోలండు తెలిపిన "*Enfranchisement of the soul*" కొఱకై, మానవసంఘమునందలి ఆత్మయొక్క ముక్తికైకూడ వీరు పాటుపడిరేని, నేటి యరిష్టము లన్నియు నంతరించును. నైతికపరిణామము నక్షత్రగోళమువలె మహిమోపేతమైనదని షోపెన్హేరను పాశ్చాత్యతాత్త్వికుడనెను. ఇట్టి యద్భుతనైతికపరిణామమును తేజాలువారు స్త్రీలును, సామాన్యప్రజలును. వీరి కృషికతన కారుమబ్బులతో నిండియున్న నేటి వసుంధర నక్షత్రశోభను గనజాలు నని నాయాశ.

ఈ యుత్కృష్టాశయసిద్ధికి ఎంతేని సాధన యావశ్యకమైయున్నది. ఈసాధన యొక్కదినమున పట్టుపడదు. దీని నలవఱచు విద్యావిధానము నేఁడు నెలకొనవలెను.

*　　*　　*　　*

## అంధానుకరణమేల?

భారతస్త్రీలు పూజామందిరమునం దుంచవలయు దేవి సౌందర్యసంకీర్తమైన భారతసభ్యత కాని, వికృతరూపు గల నేఁటి పాశ్చాత్త్యనాగరకత కాదు. పూతభారతహృదయమున కూడనితలఁపులు కొన్ని క్రొవ్వాలి, పడమరందు పల్వురభాగినులు పడినపల్లమందు విచక్షణతయెఱుఁగనిసోదరీమణులను కూల్చుటకు సిద్ధపడుచున్నవి. పినికలరూ వెఱుఁగక ఈతలఁపులు సంస్కరణమునకు తోడుపడునని కొందఱుస్త్రీలు అపోహపడుచుండిరి. అవసర మగుపట్లు, సంస్కరణము తప్పక కావలెను. కోఁతకత్తి తగులవలసినది కంతిమీఁద—మఱికురుపుమీఁద. ముక్కుకోయుసంస్కరణము వికృతపుబ్రదుకిచ్చు పిశాచము.

అవిద్యకు అహంకారము చెలికత్తె. ఈ రెండును కలసి దేశచరిత్రలయందు నెత్తురు గ్రుమ్మరించుట విజ్ఞాను లెఱుఁగుదురు. వీనిని పోఁద్రోలుట మాటలలోనిపని కాదు. ఎదుటి సద్భావమును బోనులోనిలిపివైనను, నిజమును కన్గొనుట కివి యిచ్చగింపవు. న్యాయవాదియైన నిరంకుశత్వమును వాఁడిగల వాదనముతో తునియలు చేయవచ్చునుగాని నిరంకుశత్వమే న్యాయమూర్తియై, ఉన్నతాసనముపై నాసీనమగునేని ముప్పు

వచ్చును. న్యాయమూర్తి నెదుర్కొనుట జయమునకు చెఱుపు దెచ్చుకొనుట. విపరీతమైన వేఁడికోలున కీమూర్తి చెవియొగ్గ నిచో, వికృతభావములు చెలరేఁగి అడలు పుట్టించును.

ఇట్టి యుపద్రవము లింకను స్త్రీయుద్యమాంగణమున పొడసూపకుండుట ముదావహము. భారతరమణుల ప్రకృతి ప్రత్యేక మైనది. దుడుకు ఊహాపై నిది యుఱుకనొల్లదు.

అధునాతనభారతసంస్కరణోద్యమమునకు పుట్టిల్లైనది వంగరాష్ట్రము. సారస్వతమందును, దైనికజీవితమందును సంస్కరణము నారాధించి, తన యారాధనముకతన చాల నిబ్బందులకు రొమ్మొడ్డినది సుప్రసిద్ధ ఠాకూరుకుటుంబము. రవి ఠాకూరుభావములు రవిప్రభలయట్లు నేఁడైదుఖండములందును వెలుఁగొందుచున్నవి. ఈ కవీంద్రునిపైఁగల వాత్సల్యమును కొంతకాలమునకుమున్ను (అక్టోబరు 1934) మదరాసుమహిళామణులు వ్యక్తీకరించిరి. సహజభారతసభ్యతాకల్లోలిని రవికవి పలుమాఱుకీర్తించినాఁడు. పశ్చిమభూములందు భయదనృత్య మొనరించు వికృతపద్ధతుల నీతఁడు గర్హించినాఁడు. స్వీయ దేశమునఁ బాడగట్టిన దురభ్యాసములపైని తీక్ష్ణదృక్కులు సారించినాఁడు. స్త్రీవిద్య తగదనువారి దుర్నయమును రవీంద్రుఁడు తునియలు చేసినాఁడు. స్త్రీపురోభివృద్ధినిగుఱించి ఈ విజ్ఞానభాస్కరుఁ డే మనినాఁడో సోదరీమణు లెల్లరు నెఱుఁగుదురో యెఱుఁగరో ? పురుషప్రకృతియు స్త్రీప్రకృతియు వేఱని రవి యనినాఁడు. స్త్రీకర్తవ్యము ప్రత్యేకమైన దని ఆతనితలంపు.

స్త్రీ స్త్రీయయ్యేయుండి, పురుషుని జూచి, 'అంధానుకరణమునకు' దిగరా దని అతఁడు పలికినాఁడు. గృహలక్ష్మియై అనురాగవల్లరుల నల్దెసల నామె ప్రాఁకింపవలెనని పృథుకవి యనినాఁడు. రవికవి పల్కులపైని శుభాషితలు చల్లినపాశ్చాత్త్యులనేకులున్నారు. వీరిలో సర్ ఫ్రాన్సిస్ యంగ్ హజ్ బెండ్ ఒకఁడు. పాఠకులీతని వాక్కులను పరికింతురుగాక.

"Tagore looks upon woman as different from man and does not therefore press her equality. Her sphere is another. And he would have her remain woman and not ape man. But he attacks the injustice which would ragard her as unfitted for education. He only thinks that her true field is the home, where she can be the centre of love and inspiratlon. And he himself, in that wonderful home circle of the great Tagore family, was greatly encouraged and inspired by the elder brother's wife". (Vide "The Dawn in India" By Sir Fancis Younghusband).

భారతవిజ్ఞానమును కొంత చవిచూచిన ఈ మనీషి రవికవిమధురవాక్కునకు అనుపల్లవిని బాడఁ గాంక్షించును.

* * * *

## సు భూ ష ణ ము

మనవిద్యాలయములందు కఱపఁబడు విద్యను గుఱించి ఎన్నెన్ని అపోహాలో పొడసూపినవి. "ఈచదువు వట్టి అబద్ధపు హళాహళి; వ్యయభూయిష్ఠ మైనది; దారిద్ర్యదుఃఖములను మాపుచేయునది గాక బిడ్డలనట్లు వానిని రొమ్మునఁ జేర్చుకొని

పెంచునది ; ఈ చదువు లేకున్న దేశము బాగుపడును ; ఆదర్శజీవితమున కిది మేలుబంతి యెట్లు కాఁగలదు ?" అని పలువురు పలుకుచున్నారు. తనకు హక్కు దొరకినయెడల విశ్వవిద్యాలయములను మూసివేతు నని ప్రఫుల్లచంద్రరాయ్ చెప్పినాఁడు. ఇతర దేశములలోని జనసంఖ్యను, విశ్వవిద్యాలయముల సంఖ్యను ఈ దేశపువానితోఁ బోల్చి, ఇవి మిక్కిలి తక్కువై యున్న వని యశస్విలకుఁడు రాధాకృష్ణుఁ డనినాఁడు. రాధాకృష్ణునివచనముమీఁదనే శుభాక్షతలుచల్లి, సత్యమూర్తి 'భళా భళి !' యనినాఁడు. "కళారాధనము కూడుగుడ్డ లియ్యదు ; బాబులూ ! మీ కీ చదువు వద్దు" అని పెద్దలును, పిన్నలును మొఱలిడుచున్నారు. వృత్తివిద్య కావలెనని హబీబుల్లా మున్నగు ముసలిపండు లనిరి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ఈ భావమును కొంతకుఁ గొంత మన్నించుచున్నది. "కొంతసమయము వఱకును వృత్తివిద్య భోజనసమస్యను [illegible]ర్చును గాని దీనితో బొరుగ కష్టము గట్టెక్కదు. నేఁటి విదేశములస్థితి ఇందులకు ఋజువు" అని కొంత కాలము కలకత్తా విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్షుఁడై యుండిన డాక్టర్ ఆర్ కె దట్ అనినాఁడు. ఇదంతయు పెద్దలుచేసెడి పెద్దగోడవ. మొట్టికాయలు తినుచున్న విద్యావిధానము ఎంతో అభివృద్ధి నభిలషించు స్త్రీవిద్యకు నొరవడి యెట్లు కాఁజాలును ?

నేఁడు మన మందుచున్న చదువు గుండెను నొక్కిపట్టి బుఱ్ఱను సాగఁదీయునది ! మేధావృద్ధికి తోడ్పడునదే ఈవిద్య. హృదయవిద్య కన్నుపొడుచుకొనినను కానరాదు. ఆధ్యాత్మిక

నైతికవిషయ పతనము సున్న! ఉన్నతాశయములగోష్ఠి లేనే లేదు. ప్రత్యక్షజీవనమందును, మహాపురుషసంసర్గమందును ఏకాంతమందియో అలవఱచుకొనిన ఉన్నతవిద్యయే దేశమునకు శోభ తెచ్చుచున్నది. జ్ఞానజిజ్ఞాస కొందఱికి మాత్రముకాదు. పలువురు పరీక్షలకై చదివిచదివి పరీక్ష లైనంతనే—నెగ్గినను, బోర్లపడినను—గాలిఁబట్టలగుచున్నారు! పెద్దయుద్యోగములు వద్దివాయనపుట్లు ఒడిలోఁ బడునని మడిమాన్యములను, పుస్తెపుసాసలను తెగనమ్మి చదువులలోనికి దిగిన అయ్యలు 'ఏది గతి మాకు!' అనుపాటను వెక్కివెక్కి ఆలపించుచు, "ఆశ లడుగంటె దైవోపహతుల మైతి" మని చతికిలపడుచున్నారు. "ఈ చదువును కుక్కముట్టుకొన్నది! ఇది పాగచూరుకొనిపోయినది! దీనికోసము ఖర్చు అయిన కోతిమార్కు నూనెడబ్బులైనా గిట్టుబడికి రాలేదు. నేర్లకొలది గొంతుకలోఁబడిన టీకైన డబ్బులైనా కళ్లబడలేదు." అని పరిపరివిధములు మనయువకులు పరిదేవన మొనరించుచున్నారు. Dignity of Labour అనునది ఒకటి యున్నదనియు, Necessity is the mother of invention అనునది వాస్తవమైన సూత్రమనియు కొందఱు పట్టభద్రులు రిక్షాలను, జోళ్లను పట్టుచున్నారు. "ఛీ! ఇదంతా ఎందుకు? నాగళ్లను పట్టి పొలముదున్ని దేశాన్ని ఉద్ధరించండోయ్!" అని పెద్దపెద్ద ప్లాటుఫారము లెక్కి పెద్దపెద్దనాయకులు మీసములకు కొండెశిఖలు చుట్టుచూ బొబ్బలు పెట్టుచున్నారు. కాని మంచ మెక్కి వడిసెల చేఁబూను నాయకులుగాని, పొలమునఁ జొచ్చి నాఁగలి

పట్టిన నాయకులుగాని ఇంకను పుట్టలేదు. ఎందునూ పొందనిచదువునకు దిగఁబడుచున్నవారును, "బ్రతికి ఉండగానే యమలోకాన్ని ప్రత్యక్షం చేస్తూ ఉంది. దీనిదుంప తెగా, దీని కింక బహాదూరు" అనేవారును ఎందఱెందఱో ఉన్నారు. అయినను విశ్వవిద్యాలయములు పెరుఁగుచునేయున్నవి. ఎవ రేమనుకొనినను వానిపని నవి చూచుకొనుచునేయున్నవి! జ్ఞానజిజ్ఞాసను పుట్టించుటకుఁగాని, ఆర్థికాభివృద్ధిని కనులయెదటఁ బెట్టుటకుఁగాని నేఁటి విద్యాసంస్థలు అంతగా పనికిరావని చాలాకాలమునకుమున్నే రూఢియైనది. మనుష్యత్వవృద్ధికిని, ఉత్తమచారిత్ర్యగ్రథనమునకును వలసినవిజ్ఞానము నేఁడు పూర్ణానుస్వారము. ఒకరాధాకృష్ణుఁడును, ఒకరామనును, ఒకరవీంద్రుఁడును ఉన్నచోట్ల విశేషమైన మేలే చేకూరినది. తథ్యమే! అసంఖ్యాకులైన భారతవిద్యార్థులలో నెందఱకు వీరిచరణోపాంతమునందు గూర్చుండఁజాలునదృష్టము పట్టినది?

విద్యవలన మనుష్యహృదయమందలి విభిన్నశక్తులు వృద్ధియగును. ఒకకేతిశక్తి వృద్ధియై, వేఱొకతీరుశక్తి సన్నగిలెనేని, మఱుగుజ్జుమానిసివలె మానవమానసము సౌష్ఠవముఁగాని, సౌందర్యముంగాని ఎఱుఁగనిదైయుండును. యోచన (Thinking), సంకల్పము (Willing), అనుభూతి (Feeling) అనుశక్తులు సమముగ పెరిఁగినఁగాని మనుజుఁడు శాంతి నెఱుఁగఁజాలఁడు. హృదయమేధలు జయవిజయులయట్లు పెంపొందవలెను. ఒకకాలు పొడవుగా, ఒకకాలుపొట్టి అగునేని, అడుగిడఁదలఁచినపుడు మనుజుఁడు బోరగిలపడునట్టులు మేధకు

సంబంధించిన యోచనాశక్తి అధికమై, హృదయముతోఁ గూడిన అనుభూతియును, భావనాశక్తియును క్షీణించెనేని మానవుఁడు తలక్రిందులగుట తప్పదు. సాహితీప్రపంచమును, ప్రత్యక్షప్రపంచమును ఎన్నెని దృష్టాంతములు చూపుచున్నవి: యోచనాశక్తియందు అద్భుతప్రజ్ఞ నంది, సంకల్పశక్తియందుఁ గొఱవడిన హేమ్లెట్ క్రియాంగణమునఁ జొరలేక ఇటు నటు నూఁగిసలాడినాఁడు. విశాలహృదయుఁడై మేధాశక్తియందు వెనుకఁబడియుండుటచే, ఒక పిశాచివలన మోసపడి, ఒథెల్లో డెస్డిమోనాలు ఘోరదుర్మరణమునకు పాల్పడిరి. జీవితవిజయమునకు హృదయ మస్తిష్కముల సమన్వయమావశ్యకము. హృదయమేధలను కవలలట్లు పెనుచువారు అద్భుతచారిత్రు లగుదురు.

ఒక్కొకవ్యక్తియంతరంగమందు ప్రత్యేకశక్తులు నిహితమైయుండును. తన యంతరంగమందలి నాడి నొకఁడు తానే పరీక్షించుకొనవలెను. తనశక్తి ఎట్టిదో గుర్తించి దాని నతఁడు వృద్ధిగావించుకొనవలెను. తమప్రకృతికి, తమరుచికి ప్రతికూలమైనతెరువునఁ బడువారు బోర్లఁబడి, బొప్పిఁ గట్టించుకొందురు. రవీంద్రుఁడు సైన్సుక్లాసులోను, జగదీశచంద్రబోసు సాహిత్యశ్రేణివిద్యార్థులయందును ప్రవేశించియుండిరేని, సభ్యప్రపంచమునంతకును దేజ మొసఁగినమనీషులు కాక తమతరగతులందు "దిష్టిబొమ్మ"లై యుండెడివారు. సహజభావనాశక్తి గలిగి, వికసితహృదయమై, చిఱుతప్రాయమునందే కైతనల్లు తెరు వెఱిఁగినసరోజినిచేతి కొకలెక్క నీయ, నంకెలవడువు నామె పద్యపంక్తుల నిఱికించినదఁట! అంకెలనుండి తొలఁగించి

రామానుజము నెన్నఁడేని సాహిత్యమందుఁ బ్రవేశపెట్టియుండి లేని, అతఁ డెందును బాండనివాఁడై యుండువాఁడు. తన మనసున కందనవిజ్ఞానశాఖను బట్టినవాఁడు తుదకొమ్మను చేరఁ జాలును; యత్నించెనేని, తక్కుంగల శాఖలందును గొంత యభినివేశము చూపఁగలఁడు. విద్యాభివృద్ధి నందఁగోరువారీ విషయమును తొలుత గుర్తింపవలెను.

ప్రకృతి ననుసరించిన శక్తులయందుఁ దోఁచువిభేదములు ఒక లేజాతివారియందుఁగాక వేఱుజాతియందును అధికమైయుండును. స్త్రీజాతి పిడికిలియందుఁ జేరుశక్తులు పురుషజాతి గుప్పిలియందుఁ జేరఁజాలవు ఒకరు చేకూర్చినవి కాక ప్రత్యేకప్రకృతినిబట్టియు, ప్రత్యేకమానసికస్థితి ననుసరించియుఁ గొన్ని వ్యత్యాసము లుండును. సాధారణములందుమాత్రమే ఈవచనము చెల్లును. వీరి సహజశక్తులను త్రుప్పుపట్టనీయక శాహిరమున శిరమెత్తఁజేయు ప్రజాసేవకు లెందఱో నేఁడు అక్కఱలైయున్నారు. వీరి యంతరంగములయందలి మానికములను వెలువఱిచి, వీరి జీవితములకు వానిని చక్కని కంఠమాలలు చేయు విద్యావిధానమే నేఁ డపేక్షణీయము. భర్తృహరి తెలిపిన సుభూషణ మీమాల్యములం దొక్కటియేకదా!

* * * *

## జీవనకళ

కళోపాసనమునకును, ఆనందప్రవాహమునకును వలసిన అభిరుచి స్త్రీప్రకృతియందుఁగలదు. స్త్రీ సహజప్రజ్ఞవలన కళాపేక్ష

ఆవలీలగ నెఱవేఱును. స్త్రీ చల్లిన పువ్వులను, నైవేద్యముగ నామె యిచ్చినఫలములను గైకొని కళాదేవి సౌందర్యమాధుర్యములతోఁ దొలుకాడు తనహృదయమున నామెకు తావొసఁగును. కళామయియైన స్త్రీ కళాసామ్రాజ్యమందు పట్టమహిషియై యుండును.

లలితకళలను మించినకళ జీవనకళ. లలితకళోపాసనమందేకాక జీవనకళోపాసనమునఁగూడ స్త్రీ అగ్రస్థానమునందఁగలదు. జీవనకళయందలి సౌభాగ్యమును, సౌందర్యమును అనిర్వచనీయ మైనవి. సంఘజీవనమందును ప్రత్యేకవ్యక్తిజీవనమందును శోభిలునది ఈకళ. ఇది అనురాగసంభరిత మైనది, ఆనందమయ మైనది. ఉత్తమాశయములు కుసుమించు సంఘమందును, వ్యక్తిజీవనమందును దీని సౌరభము తెరలుతెరలై ఉప్పొంగును.

నేఁ డీజీవనకళ యెట్లున్నదో కన్గొనవలెననిన నేఁటిమానవసంఘమును మనము పరిశీలింపవలెను. నేఁటిప్రపంచజీవనమును పరీక్షింపవలెను.

జీవనమునకును విద్యకును అవినాభావసంబంధముకలదు. ఇవి రెండును వేఱురూపులుగల ఒకశేశక్తి యని తెలిపినను, తెలుపవచ్చును. తలఁపుననున్న జీవనము విద్య; క్రియానైతోఁచినవిద్య జీవనము. 'తాను స్మరించుభావమే తా నగును' అని ఈశోపనిషత్తు వాకొనుచున్నది. తనమనసున మనుజుఁడు కూడఁబెట్టుకొను తలఁపులే ఆతనివిద్య. ఈవిద్యయే ఆతని

ఆచరణములను నడపుశక్తి. ఈ యాచరణముల కలయికయే నాగరకత. వర్తమాననాగరకత వర్తమానవిద్యయందు ఉద్భవించినది. ప్రస్తుతవిద్య ప్రస్తుతనాగరకతవలన పెంపొందుచున్నది. ఈ నాగరకతావిద్యలందు ఆచార్యపీఠము నందినది ప్రతీచీగోళము. ఏ రవికవియో, ఏ గాంధియో ప్రాచీభావదార్ఢ్యమును, ఆదర్శబంధురక్రియామహత్త్వమును వ్యక్తీకరించుచున్నను, 'హుకుమ్' చెలాయించుచున్నది పాశ్చాత్త్యసభ్యతయే! ఆత్మ నణంచి సుఖులు దిరిగినకండ "నేనే మనుష్యుఁడను! నేనే దేవుండను!! నేనే సర్వంబను!!!" అని గొంతెత్తి పలుకుచున్నది. కండ నాశ్రయించునది కావరము కాని కారుణ్యమా?

కనులెత్తి నలువలఁకులను పరీక్షించినపుడు స్వార్థము, ఈర్ష్య, ద్వేషము ప్రత్యక్షమగుచున్నవి. అభ్యుదయ మిచ్చు పరికరములు అరిష్టములకుఁగూడ పనికివచ్చునుగదా! నేఁటి వాణిజ్యమును, నేఁటి భౌతికశాస్త్రమును నేఁటి ఆర్థికనిరంకుశత్వమునకును, సామరికసంక్షోభమునకునుతలిదండ్రులాయెను. ఇవి ఎన్నెని దుష్ప్రవృత్తులను రేకెత్తించెను. వీనికి విజయము చేకుఱుట కల్ల. కాని, ఇవి విజయమునకై విజృంభించుచున్నవి! వేఁడిపొగలను, విషవాయువులను ప్రపంచవాతావరణమున విరఁజిమ్ముచున్నవి! మతము ప్రబోధించు భ్రాతృత్వభావముపైని చింతనిప్పులు గ్రుమ్మరించి, దైవమును వెక్కిరించుచున్నవి! మనసునందలి సెగలే యుద్ధాంగణములందును, వాణిజ్యరంగములయందును భుగుల్భుగుల్మని వెడలుచున్నవి! ఒక దిక్కునుండిగరళమును గ్రక్కుమనసు వేఱొకదిక్కునసమృత

మును వెడలింపదు. రోగముచే పీడితుఁడగువాఁడు మూలుగు నందు మోదముఁ జూపఁడు. ఆర్థిక రాజకీయరంగములందు అరిష్టములచే వికృతనృత్యమును చేయించుచిత్తము సాంఘికరంగమునందు అద్భుతజీవకళచే నాట్యము జేయింపనేరదు. బలమంది, పెచ్చిల్లుచుండు నొక దుర్గుణమువెనుక నెంతేని పరివారముండును. స్వార్థమునకు దురాశయును, దౌరాత్మ్యమును అనవరతము వింజామరలు వీచుచుండును. స్వార్థమును, విలాసవ్యామోహములును రక్తమాంసములపైని స్వారిచేయునపుడు మనుజుఁడు చేయఁజాలని చెట్ట యేది? దుర్వృత్తులన్నియు చేతులు కలుపుకొని మనసునందు గజ్జెగట్టి ఆడుచుండ, కన్నెత్తియును జూడు మెఱుఁగుఁ బూసికొనిన కలుషమునే కాంచునుగాని, క్రుళ్లను క్రక్కు జావళీలకే చెవియొగ్గును గాని, మధుర తారకమంత్రమును హృదయమునఁ జేర్చుకొనునా? ఆత్మ వెనుకఁబడియుండ, పగ్గములు త్రెంచుకొని ఇంద్రియములు దశదిశలఁ బర్విడుచుండ, దైవభక్తిపాపభయములు హృదయక్షేత్రమున నుండి నిష్క్రమించి, దవ్వులకుఁ దొలఁగియుండఁ గళాసందీప్తమగు ఆదర్శప్రవర్తన మెట్లు దృగ్గోచరమగును? ఆదర్శప్రవర్తనమునకు చేఁదోడగునవి నియమసంబద్ధములైన గొప్పగొనములే!*

* శాంత మనుఁడు, ఆత్మసంయమ మనుఁడు గొప్పగొనము లనుట నిస్సంశయము. ఇవి మహాత్మప్రదీపకళికవాఫున వెలుంగకున్న, కలుషపక్షమునందు విజృంభించును. అమానోకుఁగల సహనశాంతులు శాపాయుధులకు కలవనుట కల్ల. ఇట్టిదుర్మతి అంతరాత్మ నెంతో వూడ్చిపెట్టి, దురంతదుష్కృత్యములకు చేయిఁ జేసికొనును. కేంట్ మహాశయుఁ డేమనినాఁడో పరికింపుఁడు :
**"There are even some qualities which are of service to this,**

ఆత్మకు సంబంధించిన ఆశయములు అదృశ్యమైయుండఁ బల్వురు విచ్చలవిడి నడతకు అంజలు లెత్తుచు, తాము స్వాతంత్ర్యమును ఆరాధించుచుంటిమని అట్టహాసము చేయుచున్నారు. Licence Liberty కాదు. విచ్చలవిడినడత స్వాతంత్ర్యము కాదు. ఇది రెప్పవాల్పక తేజఃపథమున నంజలు వేయునది. అదియో కనులు మూసికొని, పరువులెత్తి, తమోమయమైన కూపమునఁగూలఁ బడునది! అద్భుతార్థము గలముక్తికి అపరరూపై, ఆత్మశక్తినుండి దీపించు స్వాతంత్ర్యము, జఘన్యప్రవర్తనమునకు కన్నతల్లియగు విచ్చల విడినడత ఎట్లగును? అంధకారబంధురమనస్సులకు ఆలోకమయమైన అభిధేయములుండుట కలదు కావున నీతిమాలిన నడతకు కొందఱు స్వాతంత్ర్యమని పేరెట్టినను, పెట్టవచ్చును. ఆదర్శతత్త్వ మెఱిఁగి, కనులుకలిగి విమర్శించువారికి వీరిప్రవర్తనముగాని, వీరి నుడువులుగాని ఎట్టిఎగ్గును చేయలేవు; కాని ఒరులకివి చేయుచెఱుపు చెప్పనలవికానిది. మానవులలో పల్వు

---

good will itself, and may facilitate its action yet which have no intrinsic unconditional value, but always presuppose a good wiil and this qualifies the esteem that we justly have for them, and does not permit us to regard them as absolutely good. Moderation in the affections and passions self control and calm deliberation are not only good in many respects but even seem to constitute part of the intrinsic worth of the person; but they are far from deserving to be called good without qualification, although they have been so unconditionally praised by the ancients. For without the principles of good will, they may become extermely bad and the coolness of a villain not only makes him far more dangerous but also directly makes him more abominable in our eyes than he would have been without it." (Vide Page 10 "*Fundamental Principles of the Metaphysic of Ethics bp Immanuel Kant.*")

ను గొప్పలమంద కెనమై మెలఁగుదురు; కాని, తమ మెదడును తట్టి స్వతంత్రచింతయందు మనసును చొరనియరు. అంధాను కరణము వీరికి పరమావధి యగుచుండును. అధునాతననాగర కతకు పీఠభూమియైన పశ్చిమఖండముచుట్టును పృథ్వీజాతులు భజనచేయుచుండుట లోకవిదితము. పాశ్చాత్త్యనాగరకత నేఁడు రాజై ఏలుచున్నది.'యథా రాజా తథా ప్రజా'కాదా? ఈసభ్యతకు వసుంధర నేఁడు చేతులుమోగుచుటందు అక్కఱజ మేమున్నది. ఈ వసుంధరనుండికాని, ఈ వసుంధరయందు వీచు వాతూలముననుండికాని, విద్యనుగాని విమర్శనముఁగాని ఎఱుఁగని భారతీయులు విడివడిపోఁజాలరు. ఇందుల కెన్నెని తార్కాణములును కన్పట్టుచున్నవి.

ఆత్మగౌరవమును, మనుష్యత్వమును, సుఖమును,స్వా తంత్ర్యమును గుటుక్కునమ్రింగు అంధానుకరణమునకు, భార తీయునకు ప్రతికూలమైన శక్తు లెన్నో తోడుపడుచున్నవి.ఈ శక్తులందు తొలుతటిది మనోదాస్యము! ఆదర్శతత్త్వవిమర్శ నమునకు తోడ్పడు ప్రాచీనవిజ్ఞానమునకు అంటుకొనినమంట రెండవశక్తి!! సత్యనిరూపణమునకు చేదోడగు సమష్టిచింత సంఘీభావములను దిగమ్రింగు అంతఃకలహము మూఁడవ శక్తి!!! అజ్ఞానము నాల్గవది. అర్ధానుస్వారజ్ఞానము ఐదవది. వీనికి చెలికత్తెమైమెలఁగు అహంకారము ఆఱవది. దురాశా నిరాశలును, దురాచారములును తక్కుంగలవి. భారతమాన సమును నేఁడు పట్టినజాడ్య మొక్కటి కాదు; పృథ్వియందలి జాడ్యము లన్నియు పులుఁగులై, దానిపై ప్రాలినవి. జాడ్యము లకు సత్వరచికిత్స అనివార్యము. వ్యాధిగుణము నెఱుఁగక

దీనికిఁగడంగితిమేని, నిముసములో రోగిని చితియందుఁ బరుండఁ బెట్టెదము. హేతుఫలముల సంబంధసూత్రమును తొలుత మనముచేతఁబట్టవలెను. హిందూసంఘముయొక్క ప్రస్తుతస్థితికి కారణములు కొన్ని హిందూదురాచారము లనుట నిక్కమే! వీనిని తొలఁగింప దొరఁకొను సంఘసంస్కర్తలు యోచింప వలసినవిషయము లెన్నేని కలవు.

ఇవి హిందూమతమునకు సహజమైనవి కావనియు, సనాతనధర్మముయొక్క అంగప్రత్యంగములు కావనియు, వీరు తొలుత గుర్తింపవలసిన విషయము. రోగమును చంపుటకు మారుగ రోగిని చంపుట హింసావృత్తికిఁ దలపడుట. మహత్తర హిందూమతము నంటిన దురాచారములను గాక సనాతనధర్మమునే మట్టుపెట్టుట హేయక్రియ యని వీరు పదపడి గుర్తింపవలసినవిషయము. సంఘసంస్కరణ మనిన అంధానుకరణము కాదనియు, దృష్టిని తనదెసకు పడలాగు పాశ్చాత్య సభ్యతయందు గ్రహింప నర్హమైన గొనములు కొలఁదిగను, గ్రహింప ననర్హములై, గర్హ్యములైన ఆచారములు అధికము గను న్నున్న వనియు, నవనాగరకతకు సంపూర్ణమైన అతిథి సత్కార మీయక, దానిని బోనులో నిలిపి పుంఖానుపుంఖగముగ క్రాసుపరీక్ష చేసి గుణానుసారమైన ఆదరము దానికీయ వలెనుగాని, అఖిలార్థసాధక మైన దనియు, మనచే నందలము మోయించుకొనుట కర్హతగల ఆచార్యుఁ డనియు యోచించి దానిపైని పువ్వుచెండ్లు విసరరాదనియు వీరు గ్రహింపవలెను.

మన కిపుడు వలసినవిద్య మనహృదయములను, మన సంఘమును సంస్కరింపఁజాలినదై యుండవలెను. సముచిత

క్షీవలనఁగాని సంస్కారణవ్రతము నెఱవేఱఁజాలదు. జ్ఞానశక్తి లేని తావునందు ఇచ్ఛాశక్తి క్రియాశక్తు లెట్లుండును? మూఁడు శక్తులును కలసినఁగాని,మానవజీవితము కళాకలితము కాఁజాలదు. మన యువకులందును, యువతులందును నేఁడు కొంత సంచలనము పొడసూపుచున్నది. సంస్కారణపథమందును, కర్తవ్యాంగణమందును ముందంజ వేయ వీ రాతురతపడుచున్నారు. సంతోషము. మహత్తరజీవనకళ నుపాసించుతఱి, ఉజ్జ్వలమైన తమ ఆశయము చెసఁ జనుతఱి, వీరు దృష్టినిడికొనవలయు అంశములుఁ చాల గలవు. వాని నీ గ్రంథమున పరికింతురుగాక!

* * * *

## పవిత్రకర్తవ్యము

అధునాతనయుగమునకు అనేకులు అంజలి ఘటించుచున్నారు. ఇది కూడని కాలమని కొందఱు మొగములను వెనుకకు త్రిప్పుచున్నారు. ఎవరేమనినను, కాలవాహిని నిలుచునది కాదు. వెల్లువలోఁ జొరఁబడినవారు వడివడిగ ముందుల కరుగుచున్నారు. ఎదురునిలిచినవా రెదురుమొగములతోడనే ప్రవాహముననుండి సాగుచున్నారు. సమత్వమును, స్వాతంత్ర్యమును ఎల్లర పెదవులపైని దేలియాడుచున్నవి. ఇవి ప్రత్యక్షముగ ఇంకను ఎందును గోచరింపలేదు. వీనికై సాగు పెనఁగులాట అధిక మగుచున్నది. అగుకొలఁదియు నివి దూరమగుచున్నవి. స్వార్థము పెంపొందుకొలఁదియు నున్న తాశయములు నేలదుల్లి పడుచున్నవి. స్వాతంత్ర్యమును, సమత్వమును రచ్చపైరంజిలు రతనము లని యెంచి వీనికై యెల్లరును ఇండ్లు విడిచి, వీథిఁబడు

చున్నారు. పురుషులేమో ముందంజవేయుచున్నా రని ఎంచి 'మే మేల వెనుక నిలుతుమ?' మని స్త్రీ లనుచున్నారు.

న్యాయశాస్త్రము హక్కులను రెండుభాగములుగ విభజించినది. ప్రత్యేకమైన హక్కులును—సంపూర్ణమైన హక్కులును-ఒకరిపట్లఁ జెల్లవలసినవియు, పృథ్వియందెల్లెడలఁ జెల్లవలసినవియుఁ గలవు. (Rights in personam, Rights in Rem. Vide—Any Book on Jurisprudence) జాతి సంప్రదాయములును, సాంఘికాచారములును, ఆర్థిక రాజకీయ పరిస్థితులును, మానవుల ప్రత్యేక దైనికక్రియలను నిర్దిష్టమొనరించినపుడే, వారిహక్కులుగూడ నిర్దిష్టము లగును. పరస్పరాభ్యుదయమునకై, ప్రత్యేకశక్తుల ననుసరించి వేర్వేఱు వ్యక్తులకై ఏర్పడువిధులు హక్కు లగును.

'హక్కు'అనునది చులకనైనదికాదు. తన్నుఁబూనఁగల వారియెడ ప్రసన్నమై, వారిభాగ్యమును, వారిమూల మున నొరులభాగ్యమును చేకూర్చుట తన కర్తవ్యముగా నది యెంచును. తనదెసఁ జూడఁజాలనివారు తన్నంటుచో శక్తిస్వరూపిణియై, వారి నది నేలఁగూల్చును. తన్నుఁదాను పరిశీలించుకొని, దృఢమైన విశ్వాసముపై నిలిచి, హక్కు నాహ్వానించువ్యక్తి ధన్యుఁడు.

స్త్రీ పురుషులకు సమముగఁ జెల్లు హక్కు లున్నట్లే, వేర్వేఱుప్రకృతుల ననుసరించిన వేఱువేఱు హక్కులుకూడఁ గలవు. దేశదేశముల సంప్రదాయములును, బహుళసంఘము లును, ఆచారములును భిన్నములుగ నుండునట్లు వారి వా

వాక్యములుకూడ వివిధములై యుండును. పాశ్చాత్యసంఘమును దెచ్చి హైందవహృదయమునఁ జొప్పించుటగాని, హైందవాచారములను పాశ్చాత్యులందు ప్రవేశపెట్టుటగాని ఎవ్వరికిని శక్యముకాదు. ఈ రెండింటినికలిపి ఒకక్రొత్తముద్దచేసి భేదమగపడనట్లు చేయుట కొందఱయాశయము. మతములన్నిటిని చెఱిపి ఒకటేమతముచేసిన కలహములుండవని కొందఱయూహ. నేఁడు ప్రపంచమందు ఘోరరణములు జరుగుచుండుట ఏకమతస్థులైన క్రైస్తవులందే! క్రైస్తవమతపీఠస్థానమైన రోమునుండియే అభాగ్యులైన అబిసీనియనులమీఁదికి లంఘించుటకై మరఫిరంగులు చనెనుగదా! అంతరంగశుద్ధి నందిన నాఁడు మానవులు ఒక్కటై నిలువఁగలరు. ఏ మతమును మాపు గానక్కఱలేదు. ఆదర్శ మొక్కటైయున్ననాఁడు మతములును, రుచులును, ప్రకృతులును, శక్తులును అనివార్యముగ వేఱైయున్నను, ఎట్టిచిక్కులును పొడసూపవు.

నేఁటి అంధానుకరణమున పడుగునకును, పియ్యమునకును నొకటేమంత్ర మగుచున్నది. భారతీయప్రకృతిని కుడిచిపెట్టి, భారతేతరప్రకృతిని దిగమ్రింగు టెవ్వరికినిసాధ్యముకాదు. భారతసీమయందు నేఁడు కొన్ని దురాచారములు తోఁచినను, భారతసంప్రదాయములన్నియు పెంటప్రోగులందు ప్రవేశింపవలెనని తలఁపరాదు. భారతహృదయమందలి మహితాదర్శములను బూడ్చిపెట్టి, అభివృద్ధియనుకొని గ్రుడ్డియొరవడికి పరుగులెత్తిన నెంతేని చేటు వాటిల్లును. ప్రాచీనవిభవమును తెగనఱకుట అధునాతనయుగముయొక్క ఉద్దేశమైనయెడల, నేఁటి

యుగము నేల రాలవలెనని వాంఛింతును. రోగనిర్మూలనమును వాంఛించునాతఁడు రోగిని నిప్పులోఁ బెట్టి, రోగమును కాల్చివేయునా? ఆనందమునకును, జయసిద్ధికిని అనువగులీల ప్రత్యేక జీవితసమస్యలను పూర్వులు పరిష్కరించిన తెఱఁగున, నేఁటి పొడవుపాటినాగరకులు పరిష్కరింపనేలేదు. కాలానుసారమైన పరివర్తన మవసరమైయున్న దని, తొంటియాదర్శములను త్రెంచివేయఁజూచుట కూడనితెగువయనిపించుకొనును. అన్నియుగములకును, వర్తించునాశయము లెన్నేని కలవు. శాంతియు, సౌరభమును దొలినాఁటి వని నేఁడు ప్రాఁతగిలి పనికిమాలిన వగునా? "సత్యమును, శాంతియు, పరార్థచింతయు సత్యయుగమునకుసరిపోవునుగానిఅధునాతనయుగమునకుఁగా" దను సాహసికు లెవరు? హిమశైలమునఁ బుట్టిన ప్రాఁతగంగ మనకేలయని సాగరముననుండి సురధుని నెవ్వరైనఁ బుట్టింపఁబూనుదురా? ప్రాచీన మనిసంతనే కొండముచ్చుమొగములు చేసికొనువారు ఎగిరియెగిరిపడి ఎంతసుఖ మందుదురు? భారత ప్రాచీనవిజ్ఞానము తుడిచిపెట్టఁదగిన దగుచో, భారతసంప్రదాయము దగ్ధము కాఁదగినది. వేదయుగము వెఱ్ఱియుగ మనియు, పురాణయుగము పుచ్చుయుగ మనియుఁ దలఁచి, తమదృక్కులను ప్రతీచీసీమలపై నెగురఁగొట్టుచు, అందలి జీవనము నొక్కపిడచగా దిగమ్రింగవలె నని నేఁ డనేకులు ఆతురతపడుచున్నారు. ఈ దిగమ్రింగుడులో నెన్నేని పుల్లలు హక్కుల పేరిట భారతీయుల గొంతుకులలోఁ బడుచున్నవి!

హక్కు లేవో, నడుపాయము లేవో, అనుకరణీయము లేవియో ఎఱిఁగినవారు నేఁడు లెక్కకు మిక్కిన తక్కువగ

నున్నారు. పురుషులు అంధానుకరణ మొనరించుచుండ, వారితో సరిసమముగ నడచుట తమ కర్జ మని తలఁచి, స్త్రీలును వారి తెన్నునే పట్టుచున్నారు!

స్త్రీవిద్యగాని, స్త్రీల యభివృద్ధిగాని, వల దనుఛాందసులు నేఁడు లేరు. కాని నేఁడు కాంక్షింపఁబడు స్త్రీవిద్య, ఆదర్శనీయమైన స్త్రీవిద్య కాక, సముచితాభివృద్ధికి నడ్డుగట్టియయున్న పురుషవిద్యకు ఛాయాప్రతిమ మైయున్నది. పురుషులు గోతిలోఁ బడినను, వారియట్లు దుముకుటే తమ ఆత్మగౌరవమును కాపాడుకొనుట యనియు, తమహక్కులను దాము నిలువంబెట్టుకొంట అనియు పల్వురు స్త్రీలు తలఁచుచున్నారు. నూతనభావవిజృంభణమున నుత్సాహాపూరితలై వీరు ముందులకు లంఘించుట ప్రశంసనీయమే! ఈ యుద్యమమున నపజయ మొందక దీనిని చేరుతఱి, సహజమైన తమ పనులకు దిగదుడు పనరా దని వీరు గ్రహింపవలెను. ప్రాచీనదృష్టాంతములను కన్నెత్తి చూచుటకు వీ రొల్లకున్నను, భారతభూమి యందిటీవల వఱలిన యశస్తిలకల దృష్టాంతములకు వీరు 'జేజే!' యనఁజెల్లును. అహల్యాబాయి, లక్ష్మీబాయి, రామాబాయి, మనోరమాబాయి, పత్యవతి, కల్యాణి, మానసి, మహామాయ మున్నగు యశస్తిలకలు తమ గృహధర్మములను నిర్వర్తించుచు, ప్రజలకు బాహ్యావనియందు పరిచర్య సలిపిరి.

నేఁటిస్త్రీ ఇంజనీరు కావచ్చును; న్యాయవాదిని కావచ్చును; న్యాయమూర్తి కావచ్చును; గవర్నరు కావచ్చును—మఱేమైనఁ గావచ్చును. కాని స్త్రీ తనధర్మమును తాను

నెఱపని దగుచో, స్త్రీయనిపించుకొనుట కర్హురాలు కాదు. తల్లి కాఁగలుఁగుతన్వి తండ్రి కాఁజాలదు. తండ్రి తల్లి కాఁజాలఁడు. గృహలక్ష్మిలేని గృహము గృహమే కాదు. గృహమును బా రుగవీడి రచ్చపై రంజిలురమణి, ప్రజలయందు ప్రతీతి వడసినను, తన యింటియందు దీప మార్పివేసిన దగును. గృహిణిలేని గృ హము ఆయువులేని యొడలిని పోలునది. ఉద్యోగములును, సద్యోగములును ఏవ్యక్తియైనను చేయఁజాలును. పునీతమైన గృహధర్మమును నెఱపఁగలవ్యక్తి ఒక్క గృహిణియే! ముఖ్య మగు నీవిషయమును గుఱుతింపక, పాశ్చాత్యగృహిణి తన కర్తవ్యమును దాదికి వదలుచున్నది. వేషము వేయుదాసరి సత్యభామ కాఁగలిగిననాఁడును, వట్టిగొడ్డు కామధేనువు కాఁగ లిగిననాఁడును, పల్లేరు నల్లేరులు మందార పారిజాతములు కాఁ గలిగిననాఁడును పరిచారిక గృహలక్ష్మి కాఁజాలును.

వీథియందలి హక్కులకై చేయఁ జాఁపుతఱి, నింటి యందలి హక్కులను నేలపాలు చేయక, గృహారమనైతె తమ పవిత్రకర్తవ్యమును తాము నిర్వహించుచు, తమకర్తవ్యము నకును, తమ కర్తవ్యమందలి పవిత్రభావమునకును, ప్రతికూల ముగాని రీతులను బాహ్యజీవితమున నెఱపవలెనని ఆంధ్రనారీ మణులను హెచ్చరించుచున్నాను. ఇంటఁ జీఁకటిలేక, అవ్వలఁ దెలపిలేక అన్నిటియందును అనారతము మెలఁగుచు సంతృప్తి కరముగ వర్తించు అతివలు తోఁచినపుడు అనంతానందమున నృత్య మొనరింపనివా రెవరు?

*    *    *    *

# సత్ప్రబోధనము

కళోపాసనమందును, సేవాధర్మనిర్వహణమందును గల సహజశక్తి స్త్రీకి గృహపాలనమందును గలదు. గృహము పట్లను, గృహపాలనముపెడలను నవయుగమున క్రొత్తయపోహలు పొడగట్టినవి. గృహమనఁ గైదనియు, గృహపాలనమన బానిసతనమనియు నర్థము చెప్పు మహాశయులు నేఁడు కొల్లలుగ నున్నారు. ఈ యపోహను పురస్కరించుకొని, సంఘమందు వీరు పోరు సృష్టింపఁగలుగుచున్నారు.

ప్రాచీనభారతీయులును, గ్రీసువాసులుఁను గృహమేమో గుర్తించి, అందుండియే తమతమ కురుక్షేత్రముల దెస స్యందనములు నడపుకొనిరి. సృష్టిముఖమున రంజిలుసింగారమంతయు, సృష్టిహృదియందలి భావకుట్మలములనుండి ప్రస్ఫుటించులాగున, గృహమున మొలకలెత్తు భావాంకురములనుండియే, శాఖోపశాఖలై వృద్ధిఁజెంది మనుష్యజీవనము పువ్వులుపూచి, దివ్యసౌరభముచే దశదిశల నలరించును. ఉన్నతరంగములయం దుఁదోఁచి, శతాబ్దాలదృష్టి నాకర్షించిన మహాపురుషులు ఇండ్లయందలి తొట్లలందు పెరిఁగిరి కాని, రచ్చలందలి కటికిరాలపైఁగాదు; మహాత్తరాశయములను గృహమందలి మధురప్రేమస్తన్యమునఁ గ్రోలిరిగాని, నడివీధులందలి దొమ్మరిగెడలనుండి పుడికిరి కారు. త్రిమూర్తులుకూడి జననిపాలనమును కాంక్షించి, పసిపాపలై కొండొకవడి అనసూయకుటీరములోని తొట్టియందు జిలిబిలిపలుకులు నేర్చిరి. ఆద్యంతములులేని ఆకసమున

చక్కనిసంఘ మేర్పఱచుకొని, తళుకులీను పవిత్రమును గడపు చుక్కలలీల నొప్పి, విశాలవనములందు విచ్చలవిడి బ్రదుకున నల్లాడియుండక, తొల్లింటి మునిమాతలు గృహములు నిలుపు కొని అందుండి తీయని ఆశీస్సుల నాలపించి ఎండవెంటలు సీతలనో తనిపిరి.

నేఁడు సోదరీమణులందు విద్య గృహధర్మమును ఉద్బో ధించునది కా దనుట స్పష్టవిషయము. నేఁటి స్త్రీవిద్యయొక్క పునాదులు ఉత్తమభారతసంప్రదాయమున లేవు. భారతజాతికి విజ్ఞానభాండాగారమైన కొండొకగతము కలదని గుర్తించుట కెట్టి చిహ్నములును నేఁటి విశ్వవిద్యాలయములయందు లేవు. ముఖ్యముగ దక్షిణసీమవా రాంగ్లవిద్యకే అంజలియెత్తిమాతృ భాషను మూలఁబెట్టిరి. పురుషవిద్యను మేలుబంతిఁ జేసికొనిన స్త్రీవిద్య, ఒరవడియందలి ఓగుల నన్నిఁటిని తనవశ మొనరించు కొనుచున్నది. నేఁ డున్నతవిద్య నందుస్త్రీలు మాతృభాష నుండి దూరముగ తొలఁగిపోవుచున్నారు. భారతమహత్త్వము ను పునరుద్ధరింపఁగల ఆశయములు, మనుష్యత్వజాతీయత్వము లను నిలుపఁగల ఆదర్శములు మాతృభాషయందును, దానికి నెచ్చెలియై వెలయుచున్న సంస్కృతమునందును గోచరించును గాని ఆంగ్లమందు కాదు. ప్రేమధారలు మాతృస్తన్యముననుం డియే కురియునుగాని, పైనుండి దిగుమతియగు పాలడబ్బాల నుండి కాదు. ఈ విద్యాసంస్థలయందలిలోపములు గుర్తించి, వానిని తమదరికిఁ జేరనీకుండ స్త్రీలు తమవిద్యాలయములను

నిర్మించుకొనుట లేదు. స్త్రీపురుషు లొకచో పెద్దబోనున-నొకచో విద్యావిధానమున - బంధితు లగుచున్నారు.

చదువుకొనినకొలఁదిమంది విద్యాధికులలో వృత్తిపోటీలు రేకెత్తుచు, వారిని నేఁ డధోగతిఁ జేర్చినవి. పురుషులతో సరి సమముగ నిలుచుట తమప్రత్యేకజాతిమహత్త్వమును వ్యక్త పఱచుకొనుట యని అపోహపడి, గృహధర్మమువనుండి ముందు లకు లంఘించుచు నేఁ డనేకస్త్రీలు పురుషవృత్తుల కఱ్ఱులు చాఁచుచున్నారు. గతిమోక్షములు లేని నేఁటి పురుషపద్ధతి గ్రుడ్డియెద్దువలె మసలుచుండ "నిట్టిది కూడదు. వేఱు తెలుఁగు విద్యను నెలకొలుపుట మనకర్తవ్యము" అని పలుకు సోదరీ మణులు పల్వురు భారతదేశమున గోచరింపకుండుట శోచనీ యము. సోదరులతో సరిసమముగ నిలువవలయుతరుణము వా రెత్తుకొండపై నిలుచు ముహూర్తముం గుంచుమనుగాని, లోఁతుగోతిలో దిగఁబడినవేళయందుఁ గా దని ఉద్బోధించు సోదరీమతల్లులు అంతగా కానరాకున్నారు. నిందువిద్దెనందిన మహిళ లీవిషయమును దృష్టియం దిడికొని సోదరీమణులకు సత్ప్రబోధము చేయుట సమంజసము.

*　　*　　*　　*

## మా తృ భా ష కు జే జే !

గృహధర్మ, సంఘధర్మ, జాతిధర్మములను నిర్వహించు టకు తోఁతకోల యగువిద్య స్త్రీలకు అనివార్యమైనది. ప్రాచీన

సభ్యతకు కార్చిచ్చు అంటుకొనిననేఁటు అల్పసంఖ్యాకు లైన స్త్రీ పురుషులు గృహధర్మము పైనను దృష్టి సారించి, సోదరీ మణుల నా దిక్కునకు నాహ్వానించుట సంతోషకరము.

"అన్ని నాగరకతలును గ్రామమునఁ బుట్టినవి. భావిప్రజలును, జాతులును గ్రామమందె పెరిఁగి గ్రామమందే పెం పొందవలెను. ప్రధానమైన ఈ జీవనధర్మము పైన మనవిద్య పెడమొగము పెట్టకుండుఁగాక! పాకకళతోఁగూడిన ఇంటి పను లన్నియు గౌరవప్రదమైనవి. వీనియందు మనశిశువులకు మనము శిక్షణ మొసఁగవలెను." అని (1934, నవంబరు 17 న) తిరువాన్కూరు మహిళాసభ కధ్యక్షత నహించిన శ్రీమతి ముత్తులక్ష్మిగారు వచించిరి.

భావబంధుర మైన గృహధర్మమందు మేలుచేతులు కావలెనని సోదరీమణులు మాతృభాషకు "జేజే!" యనవలెను. మాతృభాషలకు అన్యభాషలు సైదోడు లగునంతవఱకు నవి ఆదరణీయములు. మాతృభాషల మచ్చుమాపి, మాతృభాషా హృదిఁగల భావవిభూతికి అడ్డు నిలుపున వగుచో, అవి పొలిమేర కవ్వలనే ఆంతునందవలెను. మెకాలేమహాశయుఁడు, కాలక్రమమున ఆంగ్లభాషాభ్యాసమువలన ఆంగ్లసంప్రదాయములకు భారతీయులు దాసానుదాసులగుదు రనినాఁడుకదా! ఆతనిజోస్యము చాలవఱకు ఫలించినది. పాశ్చాత్త్యవిద్య గలగూరగంప వంటిది. అందు మానవాభ్యున్నతికి తోడుపడు కొన్ని అంశము లున్నవి. కన్నులు తెఱచి, వానిని పరిగ్రహించి యుంటిమేని, మనము ముందంజ వేసియేయుందుము.

*జపానువాసులను పరికింపుడు. ఆర్థికోన్నతి నందుపట్ల వీరు పాశ్చాత్యులను అనుకరించిరి; పదపడి వారితల దాటిరి. పాశ్చాత్యఖండములయందు వృద్ధిగాంచిన శాస్త్రములను, కళలను తమ భాషాంగణమున ప్రవేశపెట్టిరి. జపాను విద్యాసంస్థలయందు బోధచేయుటకు విదేశీయులెవ్వరును దిగుమతి కాలేదు. ఈవటిలో జపాను జాతీయత్వమును నిలువంబెట్టినది జపానుసారస్వతమే! సారస్వతసేవికలై, జపానుస్త్రీలు ఆత్మజాతీయత్వమును కాపాడుకొని, వివిధాంగణములయందు ముందంజ వేసిరి. ప్రాచీ ప్రతీచీ విద్యలు ఒప్పులకుప్పలాడు బాలికలయట్లు జపాను స్త్రీపురుషజీవితములందు రంగారియుండెను. జపానీయుల దైనికజీవితమును పరికించి, కొంతకాలమునకు మున్ను శ్రీమతి కౌసల్యాకన్యగారు కోలాంపూరునందుపన్యసించుచు నిట్లు ప్రస్తావించిరి: "జపానునందలి స్త్రీలు చాల నభివృద్ధి నందియున్నారు. యంగ్ విమెన్స్ క్రిస్టియన్ అసోసియేషను ప్రారంభించిన తరగతులలో స్త్రీలు షార్ట్ హేండు, టైప్ రైటింగ్ నేర్చుకొనుచున్నారు. గృహములనెట్లు అలంకరించుకొనవలెనో బాలికాపాఠశాలలలో ముఖ్యముగా నేర్పెదరు. జపానువారియిండ్లు చాల పరిశుభ్రముగాను, అంద

* ఈవ్యాసము ప్రకటింపబడిన పిదప, —కొన్నేండ్లు గడచిన యనంతరము జపాను భయదరూపమున గోచరించినది. పాశ్చాత్యుల దోసములను గూడ అనుకరించినది. బుద్ధభగవానుని ప్రబోధమును మఱచినది. "అహింస"కు దిగదుడుపని "హింస"కు బాసట యైనది. అగ్రజులైన చైనావాసులను మార్కొనినది. మిగుల నిష్ఠురముగ ప్రవర్తించుచున్నది. ఇకనైన గన్నులు తెఱచి ఆత్మదోషమును గుర్తించి, వెనుకంజవేసి, శాంతిని ప్రతిష్ఠింపునా?

ముగాను ఉండును. ఎవరైనను లోనికి వచ్చువారో,
విడిచి ప్రవేశింపవలెను. లేదా, ఇంటివారిచ్చుపావక
ప్రవేశింపవలెను. మట్టి, దుమ్ము లోనికి పోకుండుటకై
యభ్యాసముల నలవఱుచుకొనిరి". జపాను స్త్రీలనలెవ
మణులుకూడ క్రమశిక్షణము నంది, ఆత్మజాతీయత
కాపాడుకొందురుగాక !

* * * *

## ఆత్మగుణముల అభివృద్ధి

స్వీయజాత్యుద్ధరణమునకై జపానుస్త్రీలు
ములను గోల్పోవుటకు సంశయింపరైరి. జపాను స్త్రీ
పాశ్చాత్త్యరమణులుకూడ జాత్యుద్ధరణ మని తాము
ప్రతియుద్యమవిజయమునకును సర్వశక్తులను విని యో
ఐరోపామహాసంగ్రామము, సర్వమానవసమత్వమునకు
గట్టుటకు ఏర్పడినదని నాఁటిరాజకీయవేత్తలు జలదగం
ములఁ బలికిరి. మగలను బిడ్డలను రణోర్వికంపి, పవరపరి
పనికివచ్చు పదార్థములను సిద్ధ మొనరించుటకు నాఁటి
త్త్యస్త్రీలు నడుములుగట్టిరి. నాఁటిసమీకము కలుషభ
మైన దనియు, అందుండి వెడలినపాపధూమము నేఁడును
త్త్వవాతావరణమును మలీమస మొనరించుచున్న
గుర్తెఱిఁగి, రాఁబోవు భీషణమృథమునకును, తమకు
సంబంధము నుండదనియు, నాభండనపిశాచమునకు
లను బలివెట్ట గమకింప మనియుఁ, గావున సంతా
మగుట కిష్టపడ మనియు నేఁడు వా రనుచున్నారు.

ఆత్మగుణములను అవలీలగ చిక్కఁబట్టగలవారు — ఏ దేశమందలివారైనను,-స్త్రీలే! కావుననే గాంధిజీ 'సంఘభేద ములను మఱచి, పురుషులకు ఐకమత్యమును బోధింపుఁడు. నేను తలపెట్టిన గ్రామపునరుద్ధరణక్రియకు మీతోడ్పాటు అత్యవసరము' అని, మూడేండ్లకుమున్ను జరగిన అఖిలభారత స్త్రీసమావేశమునకు సందేశ మంపిరి. 'భారతస్త్రీలు ఇచ్చట పికెటింగు చేయుచున్నా రని తెలిసి, నేనును, మఱికొందఱు స్త్రీలును ఈ దేశమునకు వచ్చి, పికెటింగు చేయవలె నని అను కొంటిమి. ఈవఱలో మీ జాతీయోద్యమమునకు మే మెట్టి సాహాయ్యమును చేయఁజాలనందులకు మన్నింపుఁడు. ఇఁకమీ దండ నుండఁగలము'అని కొంత కాలమునకుమున్ను కరాచీయం దు జరగినసభలో ఏష్బీసతిగా రనిరి. అంతర్జాతీయస్త్రీసహాకార సమ్మేళనమువారు మనుష్యభ్రాతృత్వము నాదర్శముగాఁగొని ఆయుధవిసర్జనము జరగితీఱవలె నని నొక్కి చెప్పుచున్నారు. ప్రపంచమున వ్యాపించియున్న సామరికవాతూలము నేఁడు గాకున్న, రేపైనను, పృథ్వీమహిళామతల్లులవల్లనే చల్లఁబడు నేమో!

ఆత్మగుణములు అభివృద్ధి నందిననాఁడే మానవైక్యము ప్రత్యక్షకల్పవృక్షమై గోచరించును. ఈగొనముల నుద్బోధించు నాగరకతయే నేఁ డనుకరింపఁదగినది. ఉన్న తాశయములను తనసొమ్ము చేసికొనినది ప్రాచీనసభ్యత. ఇట్లని నేఁటివిద్యాధికులు కొందఱు గుర్తించుట ముదావహము. "పాశ్చాత్త్యరమణుల వలె భారతస్త్రీలు, తొందరపడక భారత దేశపుఆదర్శముల ప్రకా రమే అభివృద్ధి నందవలెను. 'పురుషుఁడు గొప్ప-స్త్రీ తక్కువ'

అనుసభిమానముతో ఒకగంతు వేయఁబూనుట ప్రమాదకరము"అని జయరామ్‌దాసుదౌలతురామ్‌గారు కొంతకాలమునకుమున్ను ఢిల్లీలోఁ గూడిన భారతవిద్యావిషయకసమావేశమందు పలికిరి. భారతదేశమందు నేఁడు గృహధర్మ, జాతిధర్మ, సంఘధర్మములను నిర్వహించుపట్ల స్త్రీలకు దివ్వె కాఁజాలువిద్య ఎట్లుండవలెనో పెక్కురంగస్థలములనుండి మహిళామణులు వాకొనిరి.

భావసౌష్ఠవమున నున్నతస్థానము వహింపఁజాలునది ఆంధ్రరాష్ట్రీయ మహిళాసభకు కొన్నేండ్లకు మున్ను అధ్యక్షత వహించిన శ్రీమతి పోణకా కనకమ్మ గారి మహోపన్యాస మని నా తలంపు. "ఒకప్పుడు సర్వోన్నతశిఖరము నధిష్ఠించినమన కిప్పటిపరిణామము తృప్తికరము కాదు. ఆలోపానికి కీలకం, ముఖ్యంగా మనవిద్యావిధానంలోనే ఉన్నది. వేదకాలముననుండి స్త్రీలధర్మములు, శక్తి, స్వాతంత్ర్యము, విజ్ఞానము లోకమునకు మార్గదర్శకములై ఋక్కులద్వారాకూడ ప్రతిష్ఠితమైనవి. పౌరాణికకాలమున స్త్రీయుద్యమము ఇంకను శాఖలువేసినది. స్త్రీస్థానము ఒకప్పుడు మేరుశిఖరాన్ని అధిష్ఠించినది......నేఁడు ఒకజాతీయ స్మృతిగాని, ఆదర్శంగాని, లక్ష్యం అగుటలేదు. అనుకరణం నాగరకతగా పరిగణింపఁబడుతూవున్నది. వేషభాషలలో సహితం ఇది మనస్వకీయశక్తి తేజస్సులు కోల్పోవుటకు కారణమవుతూ ఉన్నది ... నిజంగా గృహలక్ష్మి స్త్రీ...పునరభివృద్ధి మనమీఁదనే ఆధారపడియున్నది. ఈ యుద్యమానికి మనం సంపూర్ణంగా తోడ్పడాలి. నేఁడు దేశసేవకు నడుముఁ గట్టిన

సాధ్వీమతల్లులలో గార్గి సులభలు, సీత ద్రౌపది సత్యలు, వీర మతి సంయుక్త రుద్రమదేవి దుర్గావతి ఝాన్సీరాణులు, మొల్ల మల్లమదేవులు ప్రజ్వలించాలి. కవులు, గాయకులు, కళా నిధులు ప్రభవించాలి. ఈ మహోద్యమసాధనకు ఆత్మబలి కావాలి. పూర్ణస్వరాజ్యసిద్ధి కావాలి." వర్తమాన స్త్రీయుద్యమ చారిత్రమందు శ్రీమతి కనకమ్మగా రుచ్చరించిన వాక్కులు స్వర్ణాక్షరములతో లిఖింపఁబడుఁగాక !!

* * * *

## ము ం ద ం జ

కొంతకాలమునకు మున్ను (1933 డిశంబరు) రాజమండ్రిలో జరగిన కవులసమావేశములో స్త్రీలుకూడ విశేషముగా పాల్గొనినారు. —— ఎంతేని ఉత్సాహము చూపినారు. ఈ యపూర్వదృశ్యమున ఆనందలహరి వెల్లివిరిసినది.

ఆంధ్రదేశములో అప్పటప్పట కవితాసమితులు జరగుచునే ఉన్నవి. ఈ సమితులలో పెక్కండ్రు పురుషులే చేరుటకు అడలుచూ రనిన, వనితలు వానిదాపునఁ జేరెడివారే కారనిన ఎవ్వరును ఆశ్చర్యాన్వితులు కానక్కఱలేదు. సాధారణులగు పురుషులగుండెయలనుండియు, స్త్రీల హృదయముల నుండియు బహువైన భీతిని, బాధకరమైన సంశయమును తొలఁగించి, ఆ సమావేశమున నెల్లరను ఒకచోఁ జేర్చిన అద్భుత శక్తి స్వాతంత్ర్యశక్తి !

నేఁటియుగము స్వాతంత్ర్యయుగ మని ఈవఱలో పలుమాఱు పలికియుంటిని. స్వాతంత్ర్యసిద్ధి యింకను కలుగ

లు కాఁగలుగుచున్నారు. అవతారము లెత్తినను కొఱుకుడు పడని ఈ వ్యాకరణములు తప్పుల తుట్టలనియు,—ఒకరిజుట్టు ఒకరు పట్టుకొనుటలో నాఁటి తేఁటి ఒకరి వ్రాఁత లింకొకరు బండ మాటలనియు, తప్పడుకూఁత లనియు హుమ్మను పండితులకు తెలుఁగే రా దనియు, గునపములఁబోలు పలుకులను విసరి గిడుగు రామమూర్తిగారు తెలియనిడొంకలో పడి తెన్ను తెలియక 'ఏమి దైవమా ?' అని దేవులాడు ఆంధ్రలేఖకులచే "అమ్మయ్యా !" అనిపించిరి. శ్రీ రామమూర్తిగారిని సమ్మానించునవసరమున యువకులును, యువతులును గెలుపుసిడె మెత్తుటకు, ముందంజ వేయుటకు కారణ మిది.

*　　　*　　　*　　　*

## వేళకు వలయు వేండ్రము

ఆర్థికములైనయిబ్బందులును, రాజకీయము లైనయిక్కట్టులును తలసూపినపుడే మహోద్యమములు ఉద్భవించును. ప్రజలమనస్సులందు గడ్డకట్టియున్న సంతృప్తిని కదలించి, ఘన కార్యములకు వారిని పురికొల్పుటకు ఘోరమైన ఆపదలు అవసరమైయుండును. వీనిని గుర్తింపక, ఇవి తోఁచినపుడు ఉలికిపడుదుము. ఆర్తనాదము చేయుదుము. దుర్విధిని దూఱుదుము. ఇట్టి సంచలనములందే మహోద్యమము లుదయించును. రాజకీయములయందుఁ బుట్టిన ఉత్సాహమును, ఉద్వేగమును రాజకీయములందు తెచ్చినఫలితము ఆయబెల్లమే అయినను సాంఘికరంగమున చూపినఫలము అనిర్వచనీయమైనది.

నేఁటి వేఁడిమియందుఁ బుట్టిన అసంతృప్తియే అపూర్వ

దృశ్యమునుమనకనులయెదుటఁ బెట్టుచున్నది. సుమారుపదేండ్ల నాఁటి స్త్రీలకును నేఁటిస్త్రీలకును ఎంతేని వ్యత్యాసమున్నది. సంఘసంస్కరణ మనిన నాఁటిస్త్రీలు కూడని తెగువ యని కను లెఱ్ఱచేయువారు; నేఁడో! ముందుల కుఱుకుచున్నారు. లాలి పాటలతోడను, గాలిపాటలతోడను సంతుష్టి నందక, ఇంటిలో అచ్చట్లతోడను, ముచ్చట్లతోడను ప్రొద్దుపుచ్చక చక్కనైన పద్యములను, భావబంధుర మైనగద్యాలను, రసమునఁ దోలు కాడు పాటలను నేఁ డాంధ్రవనితలు వ్రాయుచున్నారు. సంఘ సేవయందు పురుషులకంటెను స్త్రీలు పనిచేయఁగలవారు. సాహితీసేవయందు వారితో సమానలము కాఁగల మని వీరు నేఁడు రూఢిపఱచుచున్నారు.

నైపుణ్యమును, గభీరయోచనయు నలవడుటకు కొంతకాలము పట్టును. తీవ్రమైన లోకానుభవమును, తీక్ష్ణమైన దృష్టియు నున్నఁగాని సాహిత్యసేవకు గురుపీఠ మీయఁగల ఈ గొప్పగొనములు అలవడ నేరవు. ఈ గుణములుగల ప్రజ్ఞాధురీ ణులను ప్రపంచ మంతయుఁ గలయవెదకినను, నేఁ డైదాఱుగుర కంటె నధికులు కానరారు. ఉత్తమసాహితీలక్షణములను కొల బద్దెలుచేసి నేఁటి వ్రాఁతలనుపరీక్షింతుమేని, ఇవికొలఁగానిగుడ్డ పేలికలట్లు మూలఁబడు ననుట తథ్యము. రచనయందు సిద్ధ హస్తులై, వాఙ్మయసేవయందు తల పండించుకొని దొడ్డవా రనియు, గొప్పవారనియు పేరుగాంచి రచ్చలందును, రంగము లందును సాలువులు గప్పుకొని ఉన్నతాసనములఁ జేరినదిట్టలే బొల్లపడుచుండెడ నాదర్శసాహితీసూత్రముల సమక్షమున తప

టడుగు లిడుచున్న స్త్రీరచనములను నిలువంబెట్టి క్రాసుపరీక్షకుఁ గడఁగుట నిష్ఠురమును, దౌరాత్మ్యమునని తెలుపనక్కఱ లేదు. తమంతఁదాము శ్రమించి, ద్రుతగతినద్భుతప్రజ్ఞ నలవఱుచుకొనఁజాలని సారస్వతపుసేవకులకును, సేవికలకును నేఁటి వేఁడిమి నిమిషనిమిషమునకు నెంతేనివిజ్ఞాన మొసఁగుచున్నది. చరచర ముందడుకు రాఁజాలిన కనుపర్తి-కాంచనపల్లి సోదరీమణులు తమయభివృద్ధిహేతు విట్టిదని గ్రహించియేయుందురు.

కనుపర్తి పులవర్తి కాంచనపల్లి సోదరీమణులు స్వర్ణకంకణములనంది ఆంధ్రుల కానందమును గొలిపిరి. ఉత్తమ బహూకృతి నంది వారును ఎంతేని ఆనందించియుందురు. తమకీయానందభిక్షను-సంతోషభిక్షను పెట్టిన అసంతృప్తిని వారు మఱువకుందురుగాక! విశాలకేసరి హృదయ మిచ్చిన రంగారువన్నెగల నూటపదార్లు నేఁటి సంతుష్టినుండి వారిని మరల నసంతుష్టిదెసకు నుడాయించి వేయి నూటపదార్ల రెండవ ఘట్టమున జేర్చి మరల మరల కురుక్షేత్రమున వారిని పురికొల్పఁగల దని నాయాశ. ఇట్టి యుపాయనముల నందని తక్కిన సోదరీమణులయెడందలం దీ పసదనములు అభివృద్ధికాంక్షను సలసలఁ గాఁగించు ననికూడ ఆశపడుచుంటిని.

సేవాధర్మము నెఱపుపట్ల పారితోషికముల యపేక్ష ఏలయందురా? పుట్టువుతోడనే 'గీత'ను కంఠమం దిముడ్చుకొని నిర్గుణోపాసనము ననుష్ఠించుట మాటలపని గాని చేఁతలపని గాదు. ఉత్కృష్టములైన ఆధ్యాత్మికసాధనములను నిముసములో నందిపుచ్చుకొనుఁడని సనాతనధర్మము తెలుపుచుంటలేదు

సాధన యనిన గంతు కాదు, మఱి క్రమానుష్ఠానము. సగుణో పాసకుఁ డెన్నఁడును ధనంజయుఁడు కాఁజాలఁడు. ఘనతరమైన నిర్గుణోపాసనము ననుష్ఠించియే ఆతఁడు విజయుఁ డగును.

*   *   *   *

## నాఁటి దృష్టాంతము

మానవజీవనమును సార్థకము చేయునది ఆత్మశక్తి. ఈ శక్తిజ్యోతిని తనుపుత్తెలము హృదయమందు తొలుకాడు సద్భావము. ఉత్తమగుణమరీచికాగుచ్ఛమైన చరిత్రము పూతహృదయమున వెలుఁగుప్రదీపము. ఉత్తమచరిత్ర కవికలమున నుండి దొరలు అత్యుక్తి కాదు; గాయకుని మధురోక్తినుండి యూరక యుప్పొంగుగీతికాతతి కాదు. ప్రత్యక్షప్రపంచమున ప్రభాకలితమై తేజరిల్లు ఆదర్శమయమైన యాలోకము! ఈ యాలోకము అనవరతము కనులఁబడునది కాదు; అన్నిచోట్ల ను కాంతిలునది కాదు. కాలపరిస్థితులును, దేశపరిస్థితులును, బహువర్షములనుండి పెంపొందుచున్న సంప్రదాయములును, చిర సాధనములును కలసి ఆదర్శచరిత్రమును భాస్వంతమైనదిగాఁ జేయును. ఇట్టిచరిత్ర ప్రాచీనభారతమున తేజరిల్లి సభ్యప్రపంచమునకు మిఱుమిట్లుగొలిపెను. ఇట్టిచరిత్రము పురుషులందుకంటె స్త్రీలయందు విశేషముగా ప్రకాశించినది. ప్రాచీన భారత సారస్వతమును పరిశీలించితిమేని, ఈనుడువును బుజువొనరించుదృష్టాంతము లెన్నేని గోచరించును.

వాత్స్యాయనుని "కామసూత్రములు" భారతప్రాచీన సాంఘికపరిస్థితులను తేటతెల్లముగ తెలుపుచున్నవి. ఈ యు

గ్రంథము వెలువడినసమయమునుగుఱించి పండితులు వేఱు వేఱు అభిప్రాయములను వెలిఁబుచ్చిరి. మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రి, డాక్టర్ పీటర్సన్, ప్రొఫెసర్ బటుకనాథ భట్టాచార్య, ప్రొఫెసర్ జాలీ, కె. పి. జయస్వాల్, ప్రొఫెసర్ ఎ. బేనర్జి, ప్రొఫెసర్ విణ్టర్ణనిజ్ మున్నగు విద్వాంసులు ఈ సమయమునుగుఱించి తెలిపిన అభిప్రాయములందు ఇంచుకభేదము కానుపించుచున్నది. ప్రొఫెసర హరన్ చంద్ర చక్లాదర్ వ్యక్తీకరించిన ఋజువులు పలువురచే నామోదింపఁబడినవి. క్రీస్తుశకము మూఁడవశతాబ్దమునకు నడుమ వాత్స్యాయనుఁడు "కామసూత్రము"లను రచించె నని ఈతఁడు నిరూపించెను.

గృహస్థునకు నాగరకజీవనము అపేక్షణీయమై యుండెడి దనియు, శృంగారమునం దాతఁ డోలలాడువాఁ డనియు స్పష్టవాక్యములతో వాత్స్యాయనుఁడు తెలిపెను. విలాసామోదములయందు తేలియాడక కర్తవ్యనిర్వహణమున స్త్రీ ఆకాలమున తనజీవనమును గడపుచుండెడిది. ధర్మశాస్త్రములయందు నిరూపింపఁబడిన ఆదర్శస్త్రీలక్షణము లాదర్శములై అట్టెనిలిచియుండలేదు. ఈ మహాగుణములను తనకాలమందలి వనిత ఆచరణమందుఁబెట్టెనని తెలుపుచు,వాత్స్యాయనుఁడు ఎన్నోని దృష్టాంతములను పేర్కొనినాఁడు. పతియెడల నీమె చూపుచుండెడిప్రేమ నిరుపమాన మైనది. తా నుపాసించు దేవునియెడల నుపాసకుఁడు చూపుభక్తికిని, భర్తయెడల నీమె చూపుభక్తికిని ఆవంతయైనను వ్యత్యాసములేదు. దైనికజీవన

మున పతికి వలయు అక్కఱలను బాగుగ గుర్తించి, ఏమఱక వాని నాతని కామె చేకూర్చుచుండెడిది. భక్ష్యపానీయములనే కాక, ఆతనియానందశృంగారములకు సముచితసంభారములను సమకూర్చెడిది. పతిరుచులను, అరుచులను బాగుగ గ్రహించెడిది. నిజేశునినెచ్చెలులు గృహమున కరుదెంచినపుడు, బహుభంగుల వారిని బహూకరించి, బహుమానము లొసంగి, నిండారుభక్తితో వారి కతిథిసత్కారములుసలిపెడిది. అత్తమామల యెడల నడకువయెయి వర్తించుచు, వారియాదరానురాగముల నందుచుండెడిది. చుట్టములపట్ల నామెచూపు గౌరవము అనల్పమైనది. పరిచారకులదెస కరుణాదృష్టి పఱపి, వారికష్టసుఖములు తన వని యెంచి, పిడికిలి మూయక వారియక్కఱలు తీర్చుచుండెడిది. అవ్వాలినుండి పతియింటికి మరలుతఱి,ఎదురేఁగి ఆతనికి వలయుపరిచర్యకై పరిచారకుల నియోగింపక తనంతఁదానేదానిని నెఱపుచుండెడిది.ఆటులందాతనివెంటచనుచుండెడిది.మనసునొప్పించుమాట లాడికాని, మఱేతీఱునఁగాని పెనిమిటి తనయెడల ననుచితముగ వర్తించినను,కటూక్తులతో నుత్తర మొసఁగునదికాదు.పతి యనుమతినందియే తోడినెచ్చెలులనుగూడి ఉత్సవములను చూచుటకై ఆమె యరిగెడిది. హృదీశుఁ డెఱుఁగకుండ,ఆమెయేమియునొరులకొసఁగునదికాదు.తన నడతనుగుఱించి పతి యనుమానింపనిరీతిని మిగులమెలఁకువతో ప్రవర్తించెడిది. సంశయచారిత్రలదెస కన్నెత్తక,కలుషితలైన యోగినుల పొసఁగఁజేరక, నాట్యకత్తెలపొందు నపేక్షింపక 'మూలకారిక'లను శాబరక్రియలం దాఱితేఱిన వారిని

చెంగటకుఁ జేరనీయక, ఏకాంత ప్రదేశములందు మసలక నాఁటి గృహిణి అప్రమత్తయై మెలఁగుచుండెడిది. పెనిమిటియనుజ్ఞ నంది వివిధకళలందు పరిజ్ఞానము పడసెడిది. తఱచుగ పతియే ఆమె కాచార్యుఁడై యుండువాఁడు (Vide *Kamasutra* page 28-*Sutras* 2 and 3; page 197-*Sutra* 36;page 310-*Sutra9*) 'స్వప్నవాసవదత్తము' యొక్కఐదవయంకమునందు తనపత్నిని 'హా! ప్రియే! హా! ప్రియశిష్యే!' అని యుదయనుఁడు సంబోధించిన దృష్టాంతమును అధ్యాపకుఁడు చక్లాదర్ పేర్కొని నాఁడు. మహాకవి కాళిదాసునిరఘువంశమును చదివినవారు ఇందుమతీవియోగమునకు చింతిలుపతి అజుఁడు 'ప్రియశిష్యా!' 'లలితకళానిధీ!'యనుపదములు(Vide *Raghuvamsa* viii 57) వాడిన జ్ఞప్తికిఁగియుందురు.

ప్రాచీనయువతి సహనమునకు రెండవపేరు; మితముగ నామె భాషించును; బిగ్గఱగ మాటలాడుట యామెయెఱుఁగదు; నలువురు వినునట్లు నవ్వదు; అత్తమామ లేమనినను ప్రతివచన మొసఁగదు;అతులైశ్వర్యమున తులఁదూఁగుచున్నను,ఆడంబరమునుగాని గర్వమునుగాని యెఱుఁగదు; సామాన్యవస్త్రములనే ఆమె ధరించును; ఉత్సవసమయములందు అవ్వలి కరుగునపుడు కొలఁదినగలను దాల్చును; మెత్తనై, చక్కనైన వలువలు గట్టును; చందనలేపనములను, సుగంధద్రవ్యములను అల్పముగ వాడును; తెల్లపూవులనే అలంకారమునకై ఉపయోగించును; పతిని చేరునపుడు ఇంపుసొంపుల నటించును. శుభ్రశరీరయై, కురులను చక్కఁగ దువ్వికొనును. విరివిగ నగలను

దాల్చును; వేర్వేఱు రంగులతో నొప్పుసురభిళకుసుమములను చేకొనును; సుగంధతైలముల నుపయోగించును, సర్వాంగ సుందరి యగును; పుష్పమాల్యములను కంఠమునఁదాల్చును; శిఖయందు పూవులు దుఱుమును; చెవినగలపై నెక్కువ మక్కువ చూపును. నొసటిమీఁదను, చెక్కిళ్ళపైనను వివిధ రీతుల రంగుచిత్రములను రచించును; ఈచిత్రములందొక్కొ కపుడు తమాలపత్రములను, తదితరపర్ణములను ఉపయోగిం చును. (Vide *Kamasutra* Page 124—Sutra 19; Page 206-*Sutra* 32; also *Saunderananda Kavya* Chap.iv,) కొన్నినగలనైనఁ దాల్పక పతియెదుట-ఒకర్తుకయై ఉన్నపు డైనను—ఆమె నిలువరాదని వాత్స్యాయనుఁ డనెను. (Vide *Kamasutra* Page 226—Sutra 13) యాస్కునికాలమందు కూడ నీభావ ముండెడిదని ప్రాచీనభారతసారస్వతము తెలుపు చున్నది. ప్రేమరూప మైనపత్ని అమూల్యాంబరములు దాల్చి నిజేశునిముందాల నిలుచులీల, తనయందలిభావమును గుర్తించు వానికనులయెదుట వేదము తోఁచునని యాస్కుఁ డనెను. కనీ సము నాల్గుతూరులు ఋగ్వేదమం దుల్లేఖింపఁబడినభావమునే యాస్కుఁ డిచ్చోఁ దెలిపినందున, నిది కడు ప్రాచీనమైన భావ మని బోధపడుచున్నది. (The Vedic Passage quoted by Prof. Peterson is జాయేవ పత్యఉశతీ సువాసాః Rvi,124.7: See also Iv. 3. 2; X 71. 4 and X 91. 13. Of also జాయాపతిమివవాససా Av X VIII 2. 51) పతి అవ్వలనున్న పుడు పత్ని దుఃఖితయై యుండును; నగలను విడిచివైచును;

దుప్పాలువలు నదలును; వివాహిత యని తెలుపుశంఖపు మురువుల నొకజతమాత్రము దాల్చును; ఉపవాసములు సలుపును; రేఁబవలులు దేవతారాధన మొనరించును అత్తతి సన్నిహిత బంధువులయిండ్లకైననుపోదు; వారాపత్కాలమందున్నపుడు మాత్రము తననియమమును సడలించి ఆమె చనును; పూజాది సత్క్రియలు జరగువేళలయందు ప్రవాసవేషమును మార్చి కచుట్టములకడ కరుగును. అప్పుడైనను, పెనిమిటివైపుబంధుగులను దోడుకొని చని, అచిరములో మరలివచ్చును. పతి యింటికి మరలుతఱి ప్రవాసవసనములతోడనే ఆతని కెదురేఁగును; పదంపడి దేవపూజ సలుపును; ప్రేమదేవు నుపాసించును; అన్నదానము చేయును; పక్షులకు నాహార మిడును.

గృహ దేవాలయమునత్రికాలములయందును పూజలను సలిపి,గృహధర్మమునకు సంబంధించిన నిత్యకర్మలనుఁ,దానాది సత్క్రియలను నెఱపును. భర్త జరపవలయునుపవాసములను, మ్రొక్కులను తానే సలుపును. ప్రాణపతి కైశ్వర్యములభించినపుడును, ఏదేని పూనికయం దాతఁడు విజయి యైనపుడును, రోగపీడితుఁడై ఆతఁ డారోగ్యలాభ మందినపుడును ఇష్ట దేవతల కామె మ్రొక్కుబడులు చెల్లించును.(Vide *Kama-sutra*—Page 311 ; *Sutra* 20) ఏదేని దేవతను కొలుచుట ఆమె ముఖ్యవాంఛలలో నొక్కటై యుండెను. (దేవతానాం పూజోపహారప్రవర్తనమ్ *Kamasutra* Page 340.—*Sutra 25.)* వాత్స్యాయనుఁడు తెలిపిన ఆదర్శపత్నీలక్షణములును, సిద్ధార్థునకు నర్ధాంగిని రోయుతఱి శుద్ధోదనుఁడు వాకొనిన

లక్షణములును భేదరహితములైనవి. (Vide *Libita-Vistara* Chapter XII.)

తన యేలిక అనుజ్ఞఁబడసి కుటుంబభారమునంతయు పత్ని తనతలఁదాల్చును. వాత్సరికాదాయము నెఱిఁగి, ఆయమొప్ప రీతిని పైకము నామె వెచ్చించును. దైనికాయవ్యయములను ఎప్పటికప్పుడు తానే చూచుకొనుచుండును. ఈకర్తవ్యము భార్యపై నుండవలె నని మనువు స్పష్టవాక్యాలఁ దెలిపెను. (అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్ Manu XII. సాంవత్సరికం ఆయం సంఖ్యాయ తదనురూపం వ్యయంకుర్యాత్ *Kamasutra* page *229-Sutras 332-33.*) తన ఆదాయమునకు మించినవ్యయ మొనరించునపుడు, రహస్యముగ నామె పతిని మందలించి, ఆతని యుద్దేశములను నిరోధించును. గృహోపయోగమున కక్కఱైన సంభారములను కూడఁబెట్టి, వెచ్చమగుకొలఁది తగు సమయములందు లోటు వస్తువులనామె నింపుచుండును. గృహనిర్వహణమునకు వలసిన గణితమం దామె సిద్ధహస్తయై యుండును. పరిచారకులజీతములను చెల్లించి, సేద్యమునకు వలయువ్యవస్థ సలిపి, పశువులను మిగుల కాపాడి పతిచేర్చు పెంపుడుపిట్టలను, జంతువులను మిగుల జాగ్రత్తతో నామె చూచుచుండును. గృహమునంటి యుండుతోఁటరమ్యమై, క్రమాభివృద్ధినందుటకు వలయుయత్నములను గృహిణి స్వయముగ జరపుకొనును. పతియింట లేనపుడు, ఆతనివ్యాపారము లన్నిటిని తానే అప్రమత్తయై చక్కఁబెట్టుచు, యజమాని లేనిలోపమును దలయెత్తనీయకుండును.

ఇట్టిసమయములందు సాధ్యమైనంతవఱకు ఆమెయింటికర్చును తగ్గించివేయును. విశ్వసనీయులగు పరిచారకుల మూలమున వలసిన క్రయవిక్రయములను జరపించి, కుటుంబధనమును వృద్ధిగావించును; వంటయింటిపనిని తానే జరపుకొనును;తీఱిక వేళలందు నూలు వడుకును; బట్టలు నేయును. ఆర్థికముగను, నైతికముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను, పరిపూర్ణత్వసిద్ధి నందిన సీమంతినీచూడామణి ఆమెయే!

*   *   *   *

## ఓజబంతి కావలయుజీవితము

ఆశయపరిశీలనము మనసున కెంతేని ఆనందమును కలిగించును. కాని, జగదీశునివలెనుత్తమాశయములుకనులయెదుట గోచరింపవు. అదృశ్యవ్యక్తులనుగాని, వస్తువులనుగాని ఊహించుట సామాన్యులకు సాధ్యముకాదు. ఈ యంశమును గుర్తించియేకాఁబోలును నిర్గుణుండైన పరమేశ్వరుఁడు * సశరీరుఁడై, గుణయుక్తుండై పదిమాఱులు పృథ్వీవాసులమ్రోల ప్రత్యక్షమైనాఁడు. ఉన్నతాదర్శములను విమర్శించుతఱి, వీని నాత్మజీవనమున దీపావళిఁ గావించుకొని, కాలవియత్తలమున సద్గుణగుచ్ఛశిఖలనుసారించు ఘనవిదుషీ నోర్తును పఠితల మనశ్చక్షుస్సమక్షమున నిలుపుట నాకర్తవ్యమనితలంచి, అర్వాచీనయుగమునజిజ్ఞాసువులకు నొరవడికావలయునది బిసెంటుసతిఅద్భుత జీవిత మని యెంచి, ఈమేలుబంతి నిందు చిత్రించుచున్నాను.

---

* "రజోగుణః స్మృతో బ్రహ్మ విష్ణుస్సత్త్వగుణాత్మకః,
తమోగుణ స్తథా రుద్రో నిర్గుణః పరమేశ్వరః."

ప్రస్తుతయుగస్త్రీలోకమున బెసెంటుసతి తలమానికమై తనరియుండెను. ఏదిక్కు వెదకినను, నేఁటివసుమతియందీమెతో సరిపోల్పఁదగుసీమంతిని లేదు. పురుషులలోనఁగూడనీమె చెంగట నిలువందగువారు లెక్కకు మిక్కిలి తక్కువగనున్నారు. కాల విహాయసమున మహాద్భుతజ్యోతివలె వెలుఁగుసీమెజీవితమందు మహితశమంతకమయూఖములయట్లు మహత్తరాశయములు వెలుఁగొందినవి! ఉన్నతాశయవిజయమునకై బెసెంటుసతి ఆత్మార్పణ మొనరించుకొన్నది. ఈమెచరిత్రాంశములను నే నిపుడు తెలుపఁదలఁచుకొనలేదు. ఈమెజీవనరాశిని ద్రచ్చి నంతన చేఁబడు భావామృతమునే ఇంచుక చదువరుల కనుల యెదుటఁ బెట్ట నూహించుచుంటిని.

ఇచ్ఛాశక్తియందును, దృఢనిశ్చయమునందును, కార్య దీక్షయందును, ఆదర్శజీవనమందును ఆఁడుది మగవానికిఁ దీసిపో దని బెసెంటుసతిచరితము తెలుపుచున్నది. నిప్పుసెగ సోఁకినఁగానిఅపరంజి తేజరిల్లదు. అరిష్టకుండమున మ్రగ్గినఁగాని మానవునిమహత్త్వము హేమరాశివలె ప్రకాశింపదు. తాను ప్రేమించినవారిని అగ్నిపరీక్షయందుఁద్రోయుట జగదీశునియల వాటు. భీషణఝంఝుఉన్నతోర్వీరుహములతో పోరునుగాని గటికపోచలతోఁ గాదు. పుటము పెట్టనెంచుట పుత్తడినిగాని కిలముగొట్టిన బ్రదుకీడ్చు ఇత్తడినిగాదు. రాహుకేతువులు దిగ మ్రింగఁదలఁచుటసూర్యసుధాంశులనుగానిగులకరాలనుగాదు. అగ్నికంటె వేఁడియై, కరవాలుకంటె వాఁడియైన కష్టములు సామాన్యులనెదిరించి, తమమానమును మాపొనరించుకొనవు.

దారిద్ర్యమనుఁడు, దండనమనుఁడు, అవమానమనుఁడు, అత్యాచార మనుఁడు, మహాపురుషులను పెంచి పెద్దఁజేసిన తల్లులు. పురాణములను వెదకుఁడు; చరిత్రలను పెల్లగింపుఁడు-నిభృతమున కొంతకన్నీరు రాల్చక మహాపురుషులైనవా రుండిరేమో కన్గొనుఁడు. మొద్దుపై బోరగిలఁజేసి, మోకులతో మోఁది ప్రూతరక్తమును దశదిశలఁ జిమ్మి, మొగమున నుమిసి, తలపై నీఁతముండ్లను గ్రుచ్చి, దుర్మతులగు చోరులనడుమ శిలువపై నిలువంబెట్టి, వాఁడిమేకుల నెమ్ములందుఁగొట్టి, అల్లనల్లనేసు నసువుల నూడఁబెఱికినది అత్యాచారము! నిర్మలనీతిప్రబోధమున కాలము గడపు సోక్రటీస్‌నోటికి గరళము నందించినదియు అత్యాచారమే!! అత్యాచారమునకు తలయొగ్గని మనుజుఁడు తన మనుష్యత్వము నెట్లు తేటపఱచుకొనఁ గలఁడు?

అత్యాచారమునకు తలయొగ్గిన అభాగినులలో—కాదు భాగ్యవతులలో బెసెంటుసతి యొకతె. పిన్నతనముననుండియు నీమెసత్త్వను సానఁబెట్టవలె ననియే దైవత మూహించినది. ఏ విషయముగాని విమర్శింపక గ్రహించుట బెసెంటుసతిప్రకృతికి ప్రతికూలము. క్లిష్టమైన జీవితసమస్యల నెదుర్కొనుతఱి క్రైస్తవమతము సాయపడక, ఈమె దృక్కులను అన్యమతస్థ విజ్ఞానముదెసకుఁ ద్రిప్పినది. పతికిని, ఈమెకును మనసులు వేఱాయెను. వీరిరువురకు కోర్టులందుఁగూడ పెనఁగులాడవలసిన గతి పట్టెను. నిరాశయందు క్రుంగి పడి, ఒకప్పు డీమె విసము మెసవి జీవితమును కడముట్టింపఁ దలపడెను. "నీ యాయువుపై

నీకు హక్కు లే" దని జలధరగంభీరస్వరమున నెవరో నీమె యంతరంగమున పలికిరి.

బొమ్మలాటకై మనుజులను జగదీశుఁడు జగతిమీఁది కంపఁడు. ప్రత్యేకవ్యక్తిని ఒక్కొక్క ఉద్దేశసిద్ధికై సర్వేశుఁడు వసుంధరపైకిఁ బుత్తెంచును. సామాన్యులు కాక, మహాపురుషు లీ విషయమును శైశవమందే గుర్తింతురు. (Vide Milton's Works) దీనిని గుర్తించుటకు కొంత ఆలస్యమగుచో, గుఱు తింపు నందాఁక వీరిని, విధి ముందులకు నడపుచుండును. పనికి మాలినపంద యనిపించుకొనిన క్లైవు ఆఱుమాఱులు గుండెకు నిబ్బరముగ పిస్తోలును గుఱి చూచి అప్రతిభుఁ డాయెను. క్లైవుకత అందఱకును విశదమే. "Heaven-born general" అని పేరువడసిన ఈవ్యక్తిహిందూసీమకు చేసినపని యేమైనను, ఇట్టిపని నీతనిచేఁ జేయింప సమకట్టిన విధి వీని ఆయువును తన పిడికిలియందు నొక్కిపట్టెను. తొలుత రిత్తవోయిన ప్రానిక కథ కంచె కరుగకమున్న నెగ్గితిఱినదికదా! నిరాశయందు మునిఁగి సింహా మొదలగువా రిట్లే యెన్ని ఘాతుకతలకుఁ దలపడి ఎన్నితూరులు బోరలపడలేదు? బెసెంటుఁసతి తనపని ముగింపక ఘాతుకత్వమునకు తలపడినంతన యంతయుఁ జూచు చున్న అంత రాత్మ ఆమెయాయువును కబళింప నెంచిన గరళ మును పాఱవేయించెను. నాఁడే ఇహాజీవితమున పునర్జన్మ మంది, ఈమె ద్విగుణీకృతోత్సాహముతో కార్యరంగము నకు లంఘించెను.

బ్లేవట్‌స్కీ, ఆల్‌కాట్‌ల సఖ్యము చేకుఱినంతనే బెసెంటునందలి అద్భుతశక్తి నిదురనుండి మేల్కాంచెను. మానవోద్ధరణమే ఈమెజీవనమందలి ప్రధానోద్దేశ మాయెను. సూడానులో ననుఁడు, ట్రాన్సువాలులో ననుఁడు, ఐర్లాండునం దనుఁడు, ఇండియాలో ననుఁడు, రాజకీయములందనుఁడు, ఆర్థికరంగములం దనుఁడు, సంఘసంస్కారణములం దనుఁడు, స్కాట్ ఉద్యమమం దనుఁడు సుఖమును పడఁదన్ని, నిద్దురను గూలఁద్రోసి, జంకుగొంకుల నెఱుఁగక తాను పూనిన పనిని నెఱవేర్చుటకై ఒకరంగముననుండి వేఱొకరంగమునకును, ఒకయుద్ధభూమినుండి వేఱొక సమరాంగణమునకును కపిధ్వజమును చేబూని చెంగుచెంగున నీమె తన స్యందనమును నడపినది. ఏయుద్యమమునకైనను కడంగువారిని తొలుత ముండ్లపొదలును, ఎత్తుకొండలును, దురభిప్రాయములును, దురూక్తులును ఎదుర్కొనును. బెసెంటుసతిని సవాలొనరించినసిలుఁగు లెన్నెని కలవు.

1893 లో ఇండియాయం దడుగిడిన దాదిగ విద్యాభివృద్ధికై ఈమె విశేషముగా పాటుపడినది. నిమ్నజాతులకు చేయూఁత నిచ్చినది. పెక్కుపాఠశాలలను నెలకొలిపినది. కాశీనగరమున సెంట్రలుహిందూకాలేజీకి 'శంకుస్థాపన' మొనరించినది. స్వపరిపాలనమందును, పంచాయతీవిధానమందును ప్రాచీనభారతీయులు చూపినప్రజ్ఞను వేనోళ్ళుల నుగ్గడించి, పల్లెవాసులయెడల మిక్కిలి మక్కువఁ జూపినది. ఈమె *New India* ను తెఱచి చూచితిమేని, గ్రామపునరుద్ధరణమున నీమెకుఁ గల తీపి తెల్లమగును. తన యంతరంగమిత్రుఁడు రంగనాథమొ

దలియారు మంత్రిగా నున్నపుడీ సత్క్రియకై-పల్లెపునర్జీవన మునకై కొంతపైకము నీమె నిర్దిష్టము చేయించినది. ఏమో నాలుగింగ్లీషుముక్కలను నాలుకకు రాచుకొని హిందూమత మును తుడిచిపెట్టనుంకించుమహాశయు లులికిపడునట్లు, పవిత్ర సనాతనధర్మమందలి మహత్త్వమును గురుగంభీరస్వరమున భారతీయులకు ప్రబోధించినది. భగవాన్దాసుసాహాయ్యమున భగవద్గీతను అనువదించినది. సూరతుకాంగ్రెసులో, రెండు పక్షము లేర్పడి, మహాశయుల శిరములపైని కుర్చీలును, బల్ల లును విఱిగిపడినపు డీమె ఇరుకక్షులవారిచే చేతులు గలిపించి నది. Home Rule శంఖారవముకతన పలువురను మేల్కొ లిపి, కఠినపరీక్షకు తలయొగ్గినది. 1917-లో కాంగ్రెసున కధ్యక్షురాలుగ నెన్నుకొనఁబడి, పదునాఱుహయముల శకట మున మహారాజ్ఞిమాడ్కి, కలకత్తా మహానగర వీథులనుండి చని అవిరళసుమవృష్టి నందినది. ఈమె యుద్యమమునుండి ఉత్సాహమును తనివార జుఱ్ఱినగాంధి 1920 లో తన పాంచ జన్యమును ధ్వనింపఁజేసినంతనే ఈమె వెనుకంజ వేసినది. Common-Wealth of India Bill నిర్మాణమునతనయద్భుత శక్తిని వ్యక్తీకరించి, రాజకీయరంగములందు మీసములు వడి ద్రిప్పువారిచే "నోహా!" యనిపించుకొన్నది. ఈ బిల్లునందు గ్రామవాసులపునరుద్ధరణమునకై సముచితమగు వ్యవస్థఁ గా వించి తన సదయహృదయమును ప్రజాళికిఁ జూపించినది.తదు పరి ఈమె తన సమయమును ప్రపంచమందంతటను దివ్యజ్ఞాన ప్రచారమునకై వెచ్చించినది. ప్రస్తుతజన్మమున తనపని ముగి

సిన దని వాక్కొని పరంజ్యోతినిమాత్రమే తలఁచుచు కొని
నెలలు మనియుండి, జ్ఞానవృద్ధయై, సీమంతినీచూడామణియై
పావనగుణసంశోభితయై, అనన్యసామాన్యప్రజ్ఞాధురీణయై, త
86 వ ఏఁట నైహికారామమును వీడి, జగదీశునిఁగూడి దిః
బృందావనమున (Vide Sir Radhakrishnan's exp. siti(
of *Mukthi*) విహరింపనేఁగెను.

ఆజీవనము బెసెంటుసతికి గౌరవమును, అగౌరవము
చేదోడువాదోడులాయెను! అద్భుతవక్తయని వక్తలకు రా
వఱలిన సురేంద్రుఁడీమెను 1917 కాంగ్రెసులోకొనియాడెన
1920 లో కలకత్తా స్టార్ థియేటర్ లో నీమె యుపన్యసింః
తతిని వంగీయు లీమె నవమానించిరి. ఆయేఁటిస్పెషల్ కాంగ్ర
సులో గాంధిగారు బలిమాలుకొనువఱకును వంగవాసు లీ
ను మాటాడనీయరైరి. ధిషణాధురంధరుఁడగు అషుతోః
ముఖర్జీ మరణించినపిదప, తొలిమాఱు కమలాయుపన్యాసవ
లొసఁగుటకై బెసెంటుసతి నాహ్వానించి, కలకత్తా విశ్వవిద్యా
లయమువారు తమ్ముఁదాము గౌరవించుకొనిరి. ప్రపంచఖ్యా
తిఁగన్న విద్వాంసు లెందఱో కలకత్తా సెనేటుహాలులో ప
మా ఉపన్యసించి, వంగహృదయమును ప్రతిధ్వనింపఁజేసిరి
కాని బెసెంటుసతి కమలాయుపన్యాసములొసఁగుతఱి ప్రాచీ
విశ్వవిద్యాలయములనుగుఱించి ఆమె యుపన్యసించుతఱి, వ
గమాత మహోల్లాసమున నృత్య మొనరించినది! జడము
నిలిచిన సెనేటుస్తంభములు పట్టరానియావేగమున,—పలు
వలవిగానియానందమున,—తన్మయానందమున తమ్ముఁదావ

౨చినవి! వసుంధరపై మహావక్తలు పుట్టిరి, గిట్టిరి.—కాని
ంటునతి కెనయగు వక్త లెవ్వరును అధునాతనయుగమున
ద్రియుండ లేదు. తమ వచోగాంభీర్యముచే, ప్రపంచమునకబ్బు
ఋను గొలిపిన గ్లేడ్స్టన్ లాయడ్ జార్జిలును, లాల్ మోహన
రేంద్రనాథులును, సరోజినీ బిపిన్చంద్రులును, రాధాకృష్ణ
ఎవాసశాస్త్రులును ఈయమకునలువంకలబుడిబుడినుడువులు
ఋకు విజ్ఞానడింభకులై వఱలిరి. పెడబొబ్బపెట్టినంతనే, వక్తృ
్రమునితలంచు శ్యామసుందరచక్రవర్తులంబోలువారికిబెసెంటు
తి-ఉపన్యాసధోరణి చక్కనిపాఠమును చెప్పెడిది. నలువుర
కూల నిలిచి నల్వురను దాటనట్లును, నాలుగువేల జనులను
ంబోధించుపట్ల నాసంఖ్య నతిక్రమింపనట్లును నీమె సభనుబట్టి
న కంఠస్వరమును మార్పఁజాలెడిది.

తొలితెడ్డున నల్లన నీటఁజొచ్చి మలితెడ్డుఊఁపున వై
లినీమధ్యమున చయ్యన దుముకుడింగీవలె, తొలిమాటకించుక
ఎుందులకు చని, తరువాతిమాటకోలల యూఁపున నీమె యుప
న్యాసమహోదధిమధ్యమున నోలలాడెడిది! సభాంగణమున
ామె మాటలాడుతఱిని తన్మయనృత్య మొనరించుపరమహంస
కలె తన్ను తాను మఱచెడిది! ఒకపరి ఈమె హృదయతంత్రు
లు మ్రోఁగి, గంభీరరవములను దశదిశలఁ జిమ్మెడివి! పొరలి
పొరలి భావధుని యుబుకుతఱి, ఈమె యంగప్రత్యంగములు
మహోద్వేగమున నుప్పొంగెడివి! కరువలి తాఁకుడునకడలికరళ్లు
చివాలున నభోసీమఁజేరి, అల్లనదిగి, మరల గగనమును చుం

బించులీల, నీమెప్పల్కు లుత్తాలతరంగములై వేనవేలనూఱులమెల
నూఁపెడివి ! అచేతనవస్తువు లీమెనుడువులు విని ఒక్కమాఱు
చేతనలాభము నందెడివి! మృతజీవులుకూడ 'అబ్బో!' యని
ఒక్కమాఱు తలయెత్తి చూచువారు! ఇట్టి యద్భుతవక్త్రి ప్ర
స్తుతయుగమున, ప్రపంచమం దేకడనైన మఱొకర్తు పుట్టియుండ
లేదు—యిఁక పుట్టవలెనన్న, ఆమెయే తిరిగిపుట్టవలెను! ప్రశం
సించుటేమో అంతగానెఱుఁగని బెర్నార్డ్ షా బట్టాజువలె నీ
యమను పొగడినాఁడు! తెరలుతెరలై జీవకళతో వెడలు నీమె
పలుకులు వినుటకై ప్రపంచమందలి వేర్వేఱుజాతులవా రువ్వి
ళ్లూరుచుండువారు! సభాంగణమందే కాక, న్యాయస్థానము
లందుఁగూడ నీమె వచఃకౌశలము వ్యక్తమాయెను! పెక్కు
మాఱులు న్యాయవాదులసాహాయ్య మపేక్షింపకతన కేసులను
తాను కడునేరుపున వాదించుకొనినవిదుషీమణి బెసెంటుసతి.

తమశక్తిని తాము గుఱితించుట మహావ్యక్తుల లక్షణ
మని మాక్లే వివేకానందప్రభృతులు వాకొనిరి. తన యద్భుత
శక్తిని బెసెంటుసతి తానుగుర్తించిన ట్లామెయాత్మకథ తెలుపు
చున్నది. తనపత్రములందు "వీరాంగన"యని ఈమె సంతక
మొనరించుచుండెడి దని జినరాజదాసు తెలిపెను. దేవుని కొమ
రుఁడ నని ఏసు తెలుపుచుండువాఁడు. గురువు నని తెలుపు
కొనుచు నొకప్పుడు బెర్నార్డ్ షాపాంచాలీవాసులకుజాబు వ్రా
సెను. ఆత్మశక్తిని, జగతియందలి తన కర్తవ్యమును గ్రహించి,
బెసెంటుసతి 'ఈమాఱు భారతసీమయందుఁ బుట్టి,హిందూ జా

త్యుద్ధరణమునకై పాటుపడెద' నని అవసానసమయమున వక్కాణించి, పెంపుడుతల్లియెడలఁ గల తన మమకారము చూపెను. తన యంత్యక్రియలు వైదికధర్మానుసారము కావలె ననియు, తనయస్థికలు గంగాఝరిని జేరవలె ననియుఁ దెలిపి సనాతనమతమందలి దృఢవిశ్వాసము నీమె వ్యక్తీకరించెను.

1933 సెప్టెంబరు 20 తేదీనాఁ డీమె పృథ్వీరంగమున నుండి నిష్క్రమించినది. మఱునాఁడు ఉదయ మెనిమిదిగంటలకు మధురమాల్యబంధురమైన యీమెశరీరము అడయారు ఆలయమునకుఁ గొంపోఁబడినపుడు, ఇందుధరసుందరిని కొలువ నరిగిన పెండ్లికొమరితయ ట్లీమె తోఁచినది! ధునీకూలమందలి సూర్యాశ్రమమందు చందనచితి నీమెచేరినపుడు కల్యాణవేదిక నధిష్ఠించినట్లు కన్పట్టినది!! కనులపండువొనరించు చెట్లు జొంపము లీ శుభసమయమున పచ్చతోరణములై మురిసెను!! మనియున్నపుడు దురంత, దుర్దాంత, దుస్సహ, దుఃఖమును, దురూక్తులను సహించినట్లే చితిపై పన్నుండి, ధూధూశబ్దమొనరించుచు మీఁదిమీఁదికి వచ్చు అగ్నికీలల నీమె ప్రశాంత భావమున నాహ్వానించినది! రమ్యమైన అడయారు ఆరామ మీమెకు కడసారి వింజామరవీచెను!! సమీపస్థ సముద్రమున నుండి విజయశబ్దము లుప్పొంగి దిగంతములను ప్రతిధ్వనింపఁ జేసెను!!! అనంతానందమునఁ దన సువర్ణమయూఖములచే సూర్యభగవానుఁ డీమెసుగంధజ్వాల కర్ఘ్య మొసఁగెను!!!!

* * *

## సహజశక్తి

హృదయగర్భాలయమునందలి స్వతంత్రశక్తిని, సహజ ప్రజ్ఞను, దండి తెలిపిన 'నైసర్గిక ప్రతిభను' లేపుటే కదా విద్యయొక్క ప్రధానోద్దేశ్యము!

స్వాతంత్ర్యము మనుజునకు సహజమైనది. దానిశక్తియే ఈతని సహజశక్తి. స్వాతంత్ర్యము సూర్యకిరణమును బోలు నది. కిరణమును పుంఖానుపుంఖముగ విభజింపుఁడు. అందు వివిధ రాగములుచూపట్టును. స్వాతంత్ర్యమును పరిశీలింపుఁడు. బహుగుణము లందు వెలయుచుండుట విలోకింతురు. ఆనంద మనుఁడు, ఆత్మగౌరవ మనుఁడు, మనుష్యత్వ మనుడు, స్వాతంత్ర్యములోనివి కావా?

స్వాతంత్ర్యము లేని జీవనము అంధకారబంధురమైనది. మనుష్యజీవితమునకును, ప్రకృతికిని ప్రతిరూపములు చూపు నది సాహిత్యము. ఇందు స్వాతంత్ర్యము లేనిచో, సహజశక్తి కొఱవడినచో, ఇది తమసావృత మైన దని చెప్పఁజెల్లును. తన ఆత్మగౌరవమును నిలుపుకొనఁ గాంక్షించు నరుఁడు — తనమనుష్యత్వమును రూఢిచేయ నిశ్చయించు మనుష్యుఁడు దొంగవలెచీఁకటియందు బ్రదుకీడ్వక, ఏమఱుఁగుననుండియో ఒరుల విజ్ఞానధన మింత కొల్లగొట్టక, అది తనది యని విఱ్ఱవీఁగక, తనరచనలను అంతరంగ మిహిరమండలమున నుండి వసుంధరపై ప్రసరింపఁజేయుచు జ్ఞానపిపాసువుల ప్రేమార్ఘ్యము నందును.

మనుష్యశక్తిని, వివిధ దృక్పథములయందు విలోకింప

వచ్చును. ఎవ్వనియందును, అది ఒక్క నాఁటితో విజృంభిం పదు. కొండకొనవలె ఆత్మజీవనమున నిది ఎవ్వనికిని కానం బడదు. హృదయవియత్తలమున క్రమ్ముకొను మొగులుగముల నడుమ నిది యెందో యడఁగియుండును.

ఈ శక్తి అంతరంగావనియందు నిహిత మైయుండు అపరంజి అనినను, అనవచ్చును. త్రవ్వినఁగాని, ఇది బయ ల్పడదు. మనుజుని ఆంతరంగికదృక్కులు ఇందుల కుపకరించు త్రవ్వఁగోలలు. అనవరతము కన్నులను అవ్వల నివ్వలఁ బాఱసీక, నిభృతముగ నాసీనుఁడై, నిమీలితనేత్రుఁడై, ఆత్మ దృష్టిని లోనికి మరలించి, అనంతమైన అంతరంగవసుమతి నాతఁడు త్రవ్వవలెను. ఈ ఖననము కడుంగడుఁ గఠినమైనది. ఏల యనఁ ద్రవ్వఁగోలలు నిలుకడలేనివి; త్రవ్వుటకు స్వాధీ నము కానివి. అవి తూలి ఇందందు చెదరిపోవును. అనివార్య ముగ, నీదృక్కులను బట్టియుంచఁగలశక్తి తోఁచినపు డది లోనిబంగారును త్రవ్వి బయటఁబెట్టును.

కడుపునిండ మెక్కి విలాసామోదములందు పొరలాడు వాని కీశక్తి చేకుఱదు. రక్తమాంసము లొకని లొంగుపాటు నం దుండవలెను. లోనిచూడ్కి మొనను మొద్దుచేయునవి మాంద్యమును, అలసభావమును. జీవితవిధానమున నియమ ములను పాటించునాతఁడు వీనినుండియు, వీనికతన తోడ్తో డనేతోఁచు చెఱుపులనుండియు విడివడును. ఆతని యంత రంగదృష్టి యపుడు నిశిత మైయుండును.

సోమరితనమును, విచ్చలవిడినడవడియు మనుష్యుని లోఁతుగోతిలోఁ దింపును. ఆధ్యాత్మిక జీవితముమాట దేవుఁడెఱుఁగును; సాధారణసుఖజీవనమైన పీనికతన నాశనమగును. క్రొవ్వును పెంచునాతఁడు జిజ్ఞాసువు కాలేఁడు. రక్తమాంసములను లోఁగఁడీయునాతఁడే విజ్ఞాని కాఁగలఁడు. విద్యకును, సచ్ఛరిత్రమునకును నడుమ గభీరాఖాతము కలదనియు, విద్యావంతుఁడు ఘోరపాపి కాఁగలఁడనియు నేఁటినవనాగరకతయందలి విడ్డూరములను విలోకించుపట్ల తెలుపఁగలము; కాని యిట్టి ఘోరావస్థ ప్రాచీనభారతసభ్యతయం దుండెనని కలనైనఁ దెలుపఁజాలము. ఆత్మప్రదీపముపై కన్నువేయక, అనవరతము మెదడును మర్దించి అఖండపాండితిని సంపాదించువారు సహజసౌందర్యసందీప్తబృందావనమునకు బహుయోజనములు దూరమున నుందురు. ఆత్మలేనిపాండితికిని, ప్రాణములేని కాయమునకును తగినట్టితావలము శ్మశానభూమియే! ఆత్మజ్యోతి నెఱుఁగక ఘోరదుష్క్రియలకు చేయి చేసికొను పాపికిని, హృదయముగాని, ఆత్మగాని లేనిపాండితి కధినాథుఁడగువానికిని గతులు లేవు. ఈవిషయమును స్పష్టముగ నేఁటిసభ్యతాముఖమున వ్రాసితిమేని, నేఁడు తలయెత్తిన చెడుగులు కంటఁబడిన దొంగలట్లు కాలుకొలఁది పరువెత్తును. కవితవలె, భక్తికైవడి, విజ్ఞానము మనుష్యాత్మనుండి వెడలవలెనని గుర్తించియే, మనప్రాచీను లీశక్తివృద్ధికి వలసినశిక్షణమును శైశవముననుండియు నాఁటివిద్యార్థుల కొసఁగిరి. నాఁటివిద్యార్థులు విజ్ఞానులై, సహజశక్తిసమన్వితులై, సదాశయప్రదీప్తజీవనులై

తేజరిల్లిరి. నాఁటివేదములు, నాఁటిమహాకావ్యములు, అద్భుత సృష్టిశక్తిగల నాఁటియుద్గ్రంథములు, గురుతరసహజశక్తిగల నాఁటిరచనములు, నాఁటికళలు నాఁటినియమబద్ధజీవన విధానమున, నాఁటిబ్రహ్మచర్యమున, నాఁటి యాశ్రమజీవనమున, నాఁటి ప్రశాంతవాతూలమున నుద్భవించినవి. శతాబ్దులును, సహస్రాబ్దులును రివ్వురివ్వున నెగసినవి. బహుసీమలయందు నెందఱెందఱో పెద్దలు పుట్టిరి. ఎన్నెన్ని యో వ్రాఁతలు వ్రాసిరి. ఈ వ్రాఁతలుకాని, ఈ పెద్దలనుడువులు కాని నాఁటి రచనముల ప్రోలు, నాఁటిమనీషుల పలుకులపొంత నిలుచుటకు తగవు. ప్రాచీనాగరకతకు నఖండవైభవము నొకప్పుడు తెచ్చినవి భారతీయుని మేధయును, హృదయమును. నేఁడుకూలఁబడిన భారతీయుఁడు నాఁటి సహజశక్తిని, నాఁటి సృష్టిశక్తిని గోల్పోయినాఁడు. నేఁడీతఁ డనుకరణములందును, అనుసరణములందును, అనువాదములందునుతనువుఁగడపుచున్నాఁడు. ప్రపంచమునంతను కదలింపఁజాలు ఉద్గ్రంథ మొకటి పృథ్వియందు నేఁడు లేదు. తన యద్భుతసృష్టిశక్తిచే వసుంధరావాసులచే 'నోహో! యనిపించుకొనినవ్యక్తి—వ్యాసవాల్మీకులతో, హోమరుడాంతేలతో, కాళిదాస భవభూతులతో నుజ్జీ కాఁజాలువ్యక్తి ఒక్కండైనను నేఁటి సభ్యప్రపంచమున పుట్టలేదు. నలువురతో "నారాయణా!" యను భారతీయుఁడు నేఁటి యంత్రయుగమున తనస్వశక్తిని, తన యాత్మగౌరవమును, తన ప్రతిభను, తన మనుష్యత్వమును కోలుపడి తా నొకయంత్రమగుచున్నాఁడు. ఆత్మపరిశీలనమందును, ఆత్మసంయమమందును,

ఏకాగ్రదృష్టియందును, ప్రశనిష్ఠయందును, క్రమశిక్షయందును మరలభారతీయుఁడాఱితేఱుచో, నాఁటివలెనంతరంగవ్యవసాయ ముఁన సిద్ధహస్తుఁడు కాఁగలఁడు. ఈవ్యవసాయమున సీతనికి చేఁబడుపంట సహాజశక్తి. ఈపంటకతన సీతనికి చేకుఱుమేళ్లు అనల్పములై యుండును.

సహాజశక్తినందినవ్యక్తి ఒక్కనిముసమైనఁ గాళ్ళేతులు ముడుఁచుకొని కూర్చుండఁజాలఁడు. ఆత్మప్రకాశమున విజృంభించు సీశక్తి ఈతనిజీవితముననుండి మాటిమాటికి నుబుకు చుండును. సహాజగుణముల నణఁచుటకు త్రిమూర్తుల కైన సాధ్యముకాదు. దీనిసహాజత్వమే దీనికద్భుతబలము నిచ్చును. సహాజశక్తిసహాజభావములు అమరత్వముగలవి. ఎరువుబడ నికలు గాలితాఁకుడున నేలరాలును. కాని సహాజశక్తిసంపన్న ములైన ఉర్వీరుహములు రాలునా? అంతరంగమం దెందో వేళ్లు నాటుకొనియుండ, నవ్వాలి చప్పుడునకు నడలి సహాజ భావము క్రిందఁ గూలునా?

మానవుఁ డీశ్వరరూపమున నుద్భవించుటచేత సహాజ శక్తిని గుర్తించినంతన, తా నెవరో యెఱిఁగి, "అహం బ్రహ్మా స్మి"యనును. పరబ్రహ్మస్వరూపము పురుషునందు ప్రత్యక్షమై యుంట ఈవిజ్ఞాని కాంచును.("విద్వాన్ పురుషమిదం బ్రహ్మేతి మన్యతే." అథర్వవేదము) "సోఽహామ్" అనిన శంకరుఁడును,

"I and my Father are one" *(Vide Gospel of St. Jahn* Chapter 10. Verse 30 ) అనిన ఏసును క్రమతపస్సు కతన తమ్ముఁ దాము గుర్తించుకొని, తమహృదయములందు వెలుఁగు దివ్యప్రదీప మొరులయెడఁదలందును వెలుంగుచుంటఁ గని దానికి జోహారనిరి. కన్నతెఱచి జోహారనువాఁడు చిత్తతామరసము ఈశ్వరుని పీఠస్థలిఁ గావించుకొనువాఁడు భక్తులందు శిరోమణియై, సేవకులందు తలమానికమై యుండును. సహజశక్తి విజృంభణమునకును, సేవాధర్మనిర్వహణమునకును, భక్తిసంభరితజీవనమునకును, ఆత్మపరిశీలనములకును హేతువు కాఁజాలునది ఆర్యవిద్యయే! ఈవిద్యనందనివాఁడు ఆత్మమహత్త్వ మెఱుఁగక అంధుఁడై, తనయింద్రియములను చూచి "దాసోఽహం" అని, దేవతలకు నూడిగముచేయు పశువై ("పశురేవ దేవతానాం") యుండును. పశుబలము పెద్దదైనపుడు ఆత్మశక్తి అంతర్ధానము కాదా? పరంజ్యోతికి దూరస్థలగువారు నిరయసంతమసమునఁ గ్రుంకు లిడునట్లు, వెలుఁగునందని వస్తువులు క్రిమిపరంపరకు కన్నతల్లు లగులీల, ఆదర్శశిక్షణమునకు దూరస్థు లగువారి బ్రదుకులు బహుళదోషములకుఁ దల్లు లగును. ఇట్టి బ్రదుకుల కలయికయే కంపుగొట్టు నాగరకత యగును. ఇందుండియే విషవాయువులును, దుర్వృత్తులును, వ్యాధినిచయమును, కలుషవితానమును జనించును.

తావి లేనిపూవు, జాబిలిని జూడనిరాతిరి, చూపులేని కన్ను, యౌవనమెఱుఁగనిఆఁడుది, పాడఁజాలనిపక్కి, అనుకంప

[illegible]శియు, కిరణచుంబన మెఱుఁగని కుట్మలము, సతి [illegible] క్షయము, ప్రేమఁ జూడనిదాంపత్యము, బిడ్డఁ గననికడుపు, [illegible] విద్య, *ఆత్మఁ గననినాగరకత ఒక్కటేసరగతి [illegible].

ఆత్మహ్మాదిఁగల బృందావనముపైని చూడ్కి నిలుపక పోవుటచే, పరంజ్యోతిఃప్రదీప్తమైన సహజశక్తిని వ్యక్తీకరింపఁ జాలక అట్టిట్టులాడు నేఁటి మానవసంఘము సముచితశిక్షణా [illegible]సిననాఁడు తన్నుఁ దా నెఱిఁగి, తనగమ్యస్థానమును [illegible]త్తించి, తనపై వ్రాలిన లోపములను నెగురఁగొట్టి, తన [illegible]ద్భూత సహజశక్తిని వ్యక్తపఱచి, అవనీతలమును బెర్నార్డ్ షా తెలిపిన సురపురమునట్లు సౌందర్యసముద్భాసిత మొనరించి తన భావిజీవితమున నిత్యకల్యాణమును, పచ్చ తోరణమును విలోకించును.

* అధునాతనవసుంధరను పుంఖానుపుంఖముగ పరిశీలించితి మేని, ఇట్టివిద్య, ఇట్టి నాగరకత ఎట్టెట్టులు విజృంభించునో గ్రహింపఁజాలుదుము.

ఇం దుల్లేఖింపఁబడిన అంశములకు ఛాయ లనఁదగు భాగములు "*The Dawn yet to break*" అను నా యాంగ్లవ్యాసమునఁ గానఁగును. కావున వానిలోఁ గొన్నిటి నిందుఁ దెలుపుచుంటిని.

...........Whether in the Occident or in the Orient, Human mind is now busy scheming and evolving new ways of enterprise and endeavour.

That man has shown in the present Era remarkable efficiency in method and system, organisation and governance, is incontrovertible. The advance oȷ science dissipated a good deal of technical disorder and laid stress on division and definition, analysis and synthesis, classification and generalisation Movements galvanised by profiteering motives are not few to-day.

... .. .....One cannot, therefore, set one's face against this wonderfu. upshot of methodical study. Science is no doubt great, but science is not all that counts in the affairs of man or in the movements manned by man. The danger has already set in when man has become inebriated with science. A decent dose of science would have worked wonders; but too much of medication has already generated poison which admits of no conceivable antidote. Spirit of enquiry is highiy commendable ; critical study is prolific of correct results ; regulated scepticism lays the axe at the root of dogmatism and slavishness. But officious enquiry, hyper-criticism and ultra-septicism lead man to dangerous eddies and cross-currents. There is a power—imperceptible though—which invariably works in the affairs of man which cannot be visualised in observatories or laboratories, which the owl-winged calculations cannot chart out. This momentous circumstance has been, alas! expatriated from the vision of the man of to-day and its absence has spread its sterile expanse in all the fields of human life; to wit Literature and Fine Arts, Philosophy and Religion, Politics and Economics.

Literature is the reflex of the variegated aspects and experiences of life. The science-ridden civilisation of to-day has its visual expression in literature all over the world. Flights of imagination, sublimity of conception grandeur in delineation and mystic depth in poesy are not much in evidence in Modern Literature. The figure of speech experienced a rude shock and thought-packed disquisitions are crowded out of Parliaments and Academic Accommodations. Figures of speech should not be construed as artificial or mechancal collection of words or their mutations or permutations; they are the spontaneous imagery pumped by inspired thought from out of the depths of human heart. The science of technique is but the hand-maid of literature ; but to-day it made itself the mistress of the latter in-so-much that the spirit of literature has flown—except from the works of a Tagore, a Romain Rolland or a Maurice Materlinck—from current thought and found its way back in starry regions. Men who know nothing of poetry pass for poets, their skill in the manipulation of prosody and verse-technique being construed as poesy. Even the art of public speech has been on the wane. In the Victorian Era, the House of

Commons was a sight for the gods to witness; the speeches deliverep then entranced even the mute pillars of the Great House. But the Parliament of to-day minds business, nothing but business. Creative genius either in speeches or writings and inspiring thought born of Divine Afflatus receded into the tombs of Carlyle and Emerson, Tennyson and Browning, Gladstone and Burke.

Fine Arts also lost much of their life and excellence. The South Indian music has now turned into a regular course of mathematics and vocal gymnasium. The performer often twists himself from top to toe and breaks into exhaustion. Wry face, uncouth exhibition, ceaseless somersault up and down the seven letters and tiresomeness are not music. Fine Art has no travails to suffer. It is ever smiling, ever sweet, ever buxom, ever debonair, ever blithesome, ever beaming.

Religion and Philosophy are now in a big muddle. They are rudely handled by Science. The student of philosophy learns to gain success in the examination. Something about Intution and *apriori* thought he learns, but he has no belief in things which are beyond the bounds of experiment and observation. He shows his intellectual calibre by the mastery of Monodology and Methodology, Ontology and Psychology, Cosmology and Epistemology. The Empiricism and Utilitarianism of Mill and the Dialectics of Hegel are at his fingers' ends. Locke and Leibnitz, Spinoza and Spencer, Kant and Descartes, he digests quite well; but he does not care to ponder over portions which are beyond the province of Logic in the very philosophical treatises which he studies. The metaphysics of the East and its majestic harmonies have not yet touched the portals of our Universities. The call of Macaulay has been receiving splendid response. Indian philosophy, except the second-hand kind of it learnt in English translations —and these translations could never interpret the fine shades of Sanskrit signification — lay burried with Yagnavalka in the depths of forest meditation.

Then Religion—there is no religion, even the shadow of it now on the face of Earth. Theory and Theology alternate in discourses on war-cult. The spirit of Christ and that of the saint of Assisi suffered crucifixion and Resurrection thereof is not to be found though Sundays have been flying in quick succession. Great wars and great schemes, great stress and distress are fondled and chuckled over among Christian nations, echoing Swinburne's cry of despair. The blood of Abyssinia

and the virus in the world marts disclose the cry of Cainism and the hideous laughter of Irreligion. The *Dhamma Chakka Pavattana Sutta* of Bodhisatta (*vide* Anderson's Pali Reader) which once ruled the minds of Japan and China is throttled to-day. Russia, which rose as a meteor, had a Five Year Plan which had the ostracism of God within the miscellany of its details. The Houses of God in Russia are now kissing the road-dust. India, which has not—spite of Gandhiji's historic fasts—yet seen the solution of the Hindu-Muslim, Hindu-Hindu or Hindu-Harijan difficulties, presents an awful spectacle. The blood of Ganesh Chandra Vidyarthi and Shraddhanada Swamy harangues on the heartlessness born of Fanaticism. Too much of science in one way and absence of science in the other are in evidence in India. Ignorance of the principles of science and the process of rationalisation and ratiocination is responsible for a good deal of havoc in our country. Man falls a prey to dogma, to superstitious thought when he stands erect as the negation of science. Our meaningful rituals are now widowed of their meaning.

Is it at all necessary to descant upon the dreadful evils which are stalking in our society, which pours its heart in blind prayer to Irrational Tradition? The Evil lifts its head when the technique of tradition is apotheocised while the music of its poesy retires from ears filled with the dirt of superstition. Our hyms plunged a Max Muller in the depths of beatitude and our poems set the feet of a Goethe on their ecstatic dance. Our lore was brimful with the elixir of wisdom and our thought alchemised baser minds into golden vistas of wisdom. Our ideas threw the shafts of their light in the distant corners of the Universe and our glory received the paean of praise from numberless ages. Plaudits rained as petals from heavens and angels felt proud to bathe in the dust of India. Our institutions were the temples of Minerva and our Gurus the moving Tajmahals of poesy and beauty. Our life was the dread of hydra-headed superstition and our bliss the envy of winged gods. Our souls swam in the Nectar of Heaven and our God descended to play among our street urchins. But alas! our times are out of joint and we fell from the heights of our Empyrean Grandeur to the depths of Stygian Flood. We lost the rationale of our Religion and we hug the bier as our guide, friend and philosopher. We lost the glimpses of our God and we caught the tail of sickly custom as the hand of our Saviour. Our temples have become the emporiums of greed and our priests, the moving

marts of lucre; and our Lord shame-faced ran into streets with the shriek of an insulted guest. Our *Upanishads* are a sealed book to us and the emphatic observation that those who worship superstition enter into blinding darkness (Vide Isa Upanishad 9th Verse) is an empty jargon to our priest-masters. Dead bones, hard shells and dirty rags, disease, squalor and poison are culled by Illiteracy, Intolerance, Ignominy, the horrid witches that opened the first scene in the *Macbeth* of our tragic life.

We are dead to the inner significance of our *Mantras*. To us the sound of *Mantra* is the revelation of the reformed God. Rational faith gave way to blind faith, Logic to Sophistry and Ethics to puerile chatter. There is no co-operation among the signiiicance, sound and action in the ceremonies engineered at the expense of our gullible souls by the tyrannical hegemony of the crass, yet sonorous priesthood. Our minds have ceased to be critical or puissant, and they readily sink in submission at the sight of pugilistic custom with the ink of dogma writ large on its face. We are automatons and our priests gramaphones; our ignorance is pinned to the blind custom to allow the sound-box to shriek and shout at will. Our ceremonies are performed to pander to the crotchets of the ignorant yet domineering society to win pseudo prestige or register our empty status in the applause of the crowd and coterie, the clique and caucus. Such rabblement, hurly-burly and. bustle are no mere bluff, btuster and braggadocio; they are Satan, Belzbub and Moloch that have been pulling our Society with their rebellious army from the heights of glory to the pandemonium of untold misery. With the clang of adamantine chains on us, we have been deifying blind custom, and this deification involves inordinate expenditure and the ship-wreck of self-respect with the loss of bread and comfort. Our society is now stuck deep in the 'Slough of Despond' and what Milton and Burke say, the 'Serbonian Bog' of Disease. All this is due to the absence of the spirit of enquiry and critical study among our masses.

Our University-wits are stationed in the other extreme. They pull science beyond its legitimate sphere and when they fail to find God in Inductive processes and Scientific calculations, they grow ultaclever and turn into avowed or unavowed sceptics, atheists or agnostics.

Politics and Economics do cover a wider field since they count most in the modern world. Anybody would hang his head down for shame at the sight which these present now on the face of Earth. It is a wonder that the Great Movements of the World which desiderate peace, plenty and prosperity have not yet fallen to the ground, though rank greed and heartlessness have been ceaselessly confronting them.

Politics merges into Economics, its fulfilment is often found in the flowering of the ideals of Economics. Like the famous Dromioes of Shakespeare (vide *Comedy of Errors*) they walk hand in hand and stand or fail together. Political turmoil has its repercussions on the Economics of the world and Economic Distress flings its sombre shadow on political pheonomena. The poisonous gases which sullied the politics of the world from 1914—1918 left their stench in the economics of to-day. Multifarious economic and political problems have lifted their heads now, demanding speedy solution. The details of these problems we cannot discuss within the compass of a short article; but their psychology does not fail straggling its course inio the link of even this dissertation. The solution of these problems demands the careful thought of all and sundry. Everybody is anxious now for what Decimus Saxon of Conan Doyle says the "breaking-out of peace." Who would not appreciate the ideal of disarmament and jump at the thought of the Brotherhood of Man and Fatherhood of God? Who would not say 'amen' to the proposals of effective international trade and monetary stability? The irony is that these problems these proposals, these desiderata are strangulated by forces born of Irreligion. When selfish motives met oppositton, the fissiparous forces which remained potential grew kinetic. Coteries and Conferences, have ended in smoke; and fresh discussions are gathering fresh clouds of smoke. That is why Sir Radhakrishnan prescribes an antidote (vide The pnonouncement issued by the great philosopher some time ago in Paris) to the Pragmatic Rationalism of the West.

Everybody knows that International Prosperity can be attained by Interdependent Trade. The idea of Interdependence connotes some sacrifice of personal interest for the wellbeing of all. But every nation is now presistently contemplating self-aggrandisement and insistently practising Protection.. ............Japan which made phenomenal strides in the field

of commerce broke through the citadel of Trade Hegemony of all nations especially the English people. In her endeavour "to discover life lines" Japan strikes terror in the heart of the Manchester Capitalist. The clever capitalist that he is, the Manchester Plutocrat makes friends with the Indian Capitalist. The Metaphysies of Ottawa had trotted out a fine axiom to lead the Syllogism of the Manchester and the Indian Capitalist, the major premise of Imperial Preference crystalizing into the desired *Petitio Principii*.........................Commercial Rivalry has become the Creed to almost all the Nations of the world. America, the great industrial giant, has failed to solve the problem of excessive industrialism. She had sought to gain economic cencessions from debtor countries, and she was embarking on a programme of national prosperity............ ... Protection which gained the nimbus of the epithet "*Scientific*" has become the desideratum of England to-day. The development of the Imperial market has occupied the best minds in England. The ideals of Fascism envisaged by some Englishmen who have learnt a good deal of communalism and Marxian principles, can find materialisation in the birth of an Imperial Zollverein,

The succint review of the economic policy of the leading commercial nations of the world reveals therefore, the fact that the Ethics of Economic Interdependence, which conjures up a vision of Equality and Fraternity, Peace and Plenty, and of which so much is talked about is but moonshine. Statesmen do not cease banking upon Internationalism, notwith standing.

.......... ........The activities in the fields of Economics and Politics, as in other fields adverted to at the outset, reveal therefore, pitfalls galore which involve a good deal of disaster to mankind in the present Era, The disaster is born of the importance given to Science at the expense of Religion, to the external enamel at the expense of internal beauty, to technique at the expense of the soul of goodness, to ritual and formality at the expense of sincerity and sentiment, to flesh at the expense of the spirit, to church at the expense of what Bertrand Russel says the teachings of Man-God. In a word, the misery is the emanation of activities widowed of humanitarian considerations. Unless man acts up to the will of God, unless he works in the light of His Spirit, he has perforce to walk in the shadow of sin and death. This is true not only in the case of man but also in that of nations.

Ultra-enthusiasts do not cease saying that civilisation has made rapid strides in recent times. Industrial Revolutions, Bloody Revolutions or Glorious Revolutions have indeed changed the complexion of the world. But the soul of the world is pecked by what a distinguished Tamil Poet says the vultures of greed and avarice. The world that is diseased reads the pages of pathology and not philosophy. Science without Religion is like, what Rabindranath says, a stray line of poem, which ever feels that it rhymes with another line and that it must find it or miss its own fulfilment. There is yet no quest for the unattained which is sure to bring forth real peace and joy on the face of Earth. It is high time that statesmen laid aside their lyre of melodious hope and ceased garnering in their hearts tendencies which are ultra-scientific or irreligious. What the world now hungers after, is instruction in Truth, Beauty and Goodness which constitute the ultimate values of Platonism. Simons and Snowdons, Lothians and Macdonalds showed their utter inability to solve the great problems of the world. What we now need most are Philos to show us the vision of Peace, Kabirs to guide us to perfect bliss, Tagores to fill the world with Beauty and Joy. Radhakrishnans to fill us with the fire of Idealism, Gandhees to help us to Truth and Sacrifice, Augustines to reveal unto us Intellectual Love, Bernards Emotionol Love, Johns Romantic Love and Francises, Practical Love. The ablest intellects of to-day must needs be initiated into the spiritual values of life and urged to find a rebirth in their present existence.

The motive of the Buddhist Monks who left Rangoon sometime ago on a fourteen-year tour all over the world to preach the doctrine of Buddhism is highly commendable. Man in his essence is *Sat, Chit,* and *Ananda* and however thick might be the dross that greed and selfishness have gathered on human heart, they are sure to die with the touch of the Logos that pervades all over the Universe. Let us, therefore, hope that the poisonous gases which have been sullying the moral atmosphere and blurring the spiritual outlook of the nations of the world, would melt down in the spontaneous down-pour of love, that the Kindly Light of God would lead man-kind from the encircling gloom into the vistas of resplendent hope, that the world chained like Prometheus to the rock of greed would lift itself up, that the palsied and petrified To-day would emerge from the fatal depths of dismal night and have a glorious Resurrection in the auroral flush of To-morrow and that the pangs of Humanity would find their fulfilment in the rapturous notes of the Dawn yet to break.

---

